ఓం శ్రీ ధన్వంతరయేనమః

# ఆయుర్వేదం - ఆయుష్వేదం

## వంశపారంపర్య ఆయుర్వేదం



**డా॥ ఎం.వేణుగోపాల్** B.Com.
వైద్య విద్వాన్

శ్రీ ధన్వంతరి భగవానుని దయవల్ల నాలుగు వేదాలలోని అధర్వణ వేదానికి ఉపవేదమయిన ఆయుర్వేదం ప్రపంచ మందలి మానవాళి సంపూర్ణ ఆయురారోగ్యాల కొరకు ప్రసాదించబడినది. అట్టి ఆయుర్వేద వైద్యంలో సంపూర్ణ ఆరోగ్య సేవలో గత 50 సంవత్సరములుగా మా తండ్రిగారైన కీ॥శే॥ **డాక్టరు ముంగరరామమూర్తి** గారి ఆశీస్సులతో, మా వంశములో నేను మరియు నా కుమార్తె శ్రీమతి మాధవి పునరంకితమవుతున్నాము.

1. అన్ని రకముల చర్మ వ్యాధులు, సోరియాసిస్, స్పర్శ లేని మచ్చలు బొల్లి మచ్చలు.
2. అన్నిరకముల మూర్ఛ వ్యాధులు
3. కీళ్లనొప్పులు, వెన్నెముక వ్యాధులు, సయాటికా, స్పాండిలైటిస్ మొ॥ కీళ్ల సమస్యలు
4. దగ్గు, ఆయాసము, తుమ్ములు, ముక్కున నీరు కారుట, ఊపిరితిత్తుల వ్యాధులు
5. స్త్రీలకు సంబంధించిన తెలుపు, ఎరుపు కుసుమ వ్యాధులు సంతాన సమస్యలు
6. మూత్రాశయం, మూత్రనాళము, మూత్రపిండములలోని రాళ్లు మరియు గడ్డలు
7. మధ్య నపుంసకత్వము, ఇంద్రియము నందు జీవకణములు తక్కువగా యుండుట, అంగవైఫల్యం, ఇంద్రియ దోషములు
8. మరియూ HIV (ఎయిడ్స్) వ్యాధిగ్రస్థులు, వ్యాధి నియంత్రణ వ్యాధి సోకకుండా వుండుటకు జాగ్రత్తలు, సూచనలకు సంప్రదించండి.


**డా॥ ఎం.వేణుగోపాల్ B.Com.**
**వైద్యవిద్వాన్ Regd 18278**
**7/307, హోమస్‌పేట, ప్రొద్దుటూరు - 516360.**
**డా॥ ఎం.వేణుగోపాల్ 9849227233**
**శ్రీమతి ఎం.మాధవి 9849183047 (స్త్రీ వ్యాధులకు)**

# శ్వాస

శ్వాసలో స్వేచ్ఛ కోసం...

## అలర్జీ, అస్తమా క్లినిక్

T.T.D. దేవస్థానం ప్రక్కన, లిబర్టీ సెంటర్, హిమాయత్‌నగర్, హైదరాబాద్.

అపాయింట్‌మెంట్ కోసం.. Ph: 040-66839888, 98484 26879

అస్తమాపై జాతీయ అవార్డు గ్రహీత



డా॥ వీరపనేని విష్ణున్‌రావు

అలర్జీ - అస్తమా వైద్య నిపుణులు

MBBS, DCH; FCCP (USA)

PGCC (Chest Diseases)

(DNB - PULMONOLOGY)

మీ కుటుంబంలో ఎవరైనా ఈ క్రింది వాటితో బాధపడుతున్నారా?

- తుమ్ములు ➡ జలుబు ➡ దగ్గు ➡ దమ్ము
- తెమడ ➡ ఆయాసం ➡ పిల్లికూతలు ➡ గురక
- డస్ట్ అలర్జీ ➡ సైనస్ ➡ ముక్కు కారటం, దురద, దిబ్బడ
- టాన్సిల్స్ ➡ గొంతు పచ్చి ➡ చెవి దురద
- కళ్ళ దురద ➡ చర్మం సమస్యలు ➡ ఏదో ఒకటి పడకపోవడం
- ఏ పనిచేసినా ఆయాసం రావడం - ఇవన్నీ అలర్జీ ఆస్తమా లక్షణాలే.



కంప్యూటర్ పరీక్షల ద్వారా ఉబ్బసం వ్యాధి తీవ్రతను మరియు ఊపిరితిత్తుల పనితనాన్ని తెలుసుకుంటున్న డా॥ విష్ణున్‌రావు గారు

ఉబ్బసానికి వైద్యం అనేది... తాళం - తాళంచెవి 'కీ' ఉన్న సంబంధం లాంటిది. తాళానికి తగ్గ తాళంచెవి ఉపయోగిస్తేనే తాళం తెరుచుకుంటుంది. అలాగే ఉబ్బసం ఏ దశలో ఉందో తెలుసుకొని (కంప్యూటర్ ద్వారా) సరియైన వైద్యం అందిస్తేనే ఫలితం ఉంటుంది. లేదంటే జీవితాంతం అన్ని రకాలుగా బాధపడుతూ ఉంటారు. ఉబ్బసం వ్యాధి మొదలయ్యేది 10 సంవత్సరాల లోపే. ఈ దశలోనే సరియైన వైద్యం పొందలేకపోతే వ్యాధి ముదిరిపోతుంది. పిల్లల పెరుగుదల ఆగిపోతుంది. ఉబ్బసం అనేది ఎదిగే మొక్కపై బరువు ఉంచడం లాంటిది. బరువు ఉన్నంత వరకూ ఆ మొక్క ఎదగనట్లుగా, సరియైన వైద్యం అందనంతవరకూ అస్తమా - అలర్జీతో అన్ని విధాలుగా ఇబ్బందులు పడుతూనే ఉంటారు. ఏ వయసు వారైనా సరియైన వైద్యం పొంది అస్తమాను జయించి, సాధారణ జీవితాన్ని గడిపే అత్యాధునిక వైద్యం ఇప్పుడు అందుబాటులో ఉంది.

చిన్న పిల్లలలో వచ్చే అలర్జీ అస్తమాకు ప్రత్యేక వైద్య పరీక్షలు మరియు చికిత్స

అలర్జీ, అస్తమా బాధితులను తిరిగి సాధారణ జీవితం గడిపేలా చేయడమే ఈ 'శ్వాస' ఆశయం.

Note: అస్తమాపై మరిన్ని వివరాలకు వెబ్‌సైట్ www.swasaa.com చూడండి.

సంపుటి : 30 | సంచిక 3
ఏప్రిల్ : 2007 | 351వ సంచిక

నవ్య నవలా వేదిక

# చతుర



ఈ నెల నవల

ఎండుగడ్డికోసం గడ్డితినే
స్వార్థపరుల వైఖరిని ఎండగట్టిన
**కొలకలూరి ఇనాక్** నవల

## సర్కారు గడ్డి

10వ పేజీలో



బొమ్మలు: పినిశెట్టి    ముఖచిత్రం: ఎం.వసంత కుమారి

హెల్త్ బిట్స్: ఎం. వెంకటేశ్వరరావు

చతుర నవలల పోటీలో ద్వితీయ బహుమతి పొందిన
డా॥ వి. చంద్రశేఖర రావు నవల **ఆకుపచ్చని గాయం** మే సంచికలో

# పండిత శ్రీ బుట్టే వీరభద్ర దైవజ్ఞ

శ్రీ శ్రీశైల దేవస్థాన ఆస్థాన సిద్ధాంతిగారిచే గుణింపబడి, రచియింపబడిన

## 110 సం॥ల భూత భవిష్యద్వర్తమాన



# శతాబ్ది

# పంచాంగము

## మినీ జ్యోతిష కంప్యూటర్

## 1941 నుండి 2050 వరకు

**5 నిముషాలలో మీ జాతక చక్రం రెడీ! మీ జాతక చక్రం మీరేవేసుకోవచ్చు!**

✦100 సం॥లకు ప్రతిరోజు గ్రహచక్రములు ✦ రాబోయే 50 సం॥లకు ప్రతి రాశివార్కి జాతకఫలాలు ✦ ప్రతి సంవత్సరం సంభవించు సూర్య - చంద్ర గ్రహణములు ✦ ప్రతి సంవత్సరం గురు, శుక్ర మౌఢ్యములు ✦ ఇంకనూ ముఖ్య పండుగలు ✦ రాబోయే 2050 వరకు పుష్కరముల తేదీలు

**అన్నిబుక్‌షాపులందు లభించును** **వెల : రూ. 675/-**

**ఆంధ్రదేశంలో అత్యధిక ప్రజాదరణ కలిగిన**

**THE LARGEST CIRCULATED PANCHANG IN A.P.**

## పండిత శ్రీ బుట్టే వీరభద్ర దైవజ్ఞ గారి

## 2007-2008 శ్రీ సర్వజిత్ నామ సంవత్సర

# గంటల పంచాంగము

- ★ 2007-2008 శ్రీ సర్వజిత్ నామ సం॥లో మీ భవిష్యత్
- ★ జ్యోతిషం ప్రత్యక్ష నిదర్శనం ప్రత్యేక వ్యాసం
- ★ మా పంచాంగము నుండి ఇతర దేశములవారు పంచాంగము చూసుకొను విధానం
- ★ భారతదేశ, ఆంధ్రరాష్ట్రంలో జరుగు విశేషాంశములు

**ఇంకనూ అనేక నూతన విశేషాంశములతో**

**అన్నిబుక్‌షాపులందు లభించును**

కాపీలకు : 9848171785, 9290099287




# కాలాతీతం

ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక

# అన్నా కరెనినా

(1866)

"సుఖంగా ఉన్న సంసారాలన్నీ ఒక్కలాగే ఉంటాయి. కలతలలో చిక్కుకున్నవి మాత్రం ఒక్కొక్కటీ ఒక్కో రకం" అన్నది ఒక నానుడిగా మారింది. నిజానికది 'అన్నా కరెనినా'లోని తొలి వాక్యం.

ప్రపంచ సాహిత్యంలో వివాహేతర సంబంధాల గురించి రాసిన కథలకు కొదవ లేదు. టాల్‌స్టాయ్ సమకాలికులు నతానియెల్ హతార్న్, గుస్తావ్ ఫ్లోబేర్‌ల 'స్కార్లెట్ లెటర్', 'మదాం బావరీ'ల ఇతివృత్తాలు కూడా ఇవే అని మనకు తెలుసు. అన్నా కరెనినాలో కూడా కథావస్తువు ఇదే అయినప్పటికీ, పరిధి చాలా విస్తారమైనది. పంథొమ్మిదవ శతాబ్ది రష్యన్ సమాజానికి అద్దం పట్టిన నవల ఇది. టాల్‌స్టాయ్‌ది సాంప్రదాయిక మనస్తత్వం కాదు. సమాజ నియమాలను ధిక్కరించిన ప్రేమ వ్యక్తుల కుటుంబాల విచ్ఛిత్తికి దారితీస్తుందని మాత్రమే చెప్పాడు.

నవలలో కరెనిన్ అనే ఉన్నతోద్యోగి భార్య అన్నా. ఒక కుర్రాడికి తల్లి. తమ బంధువులైన అబ్లోన్‌స్కీల కుటుంబ సమస్యలను పరిష్కరించటానికి వచ్చి ఒక సైనికాధికారి వ్రోన్‌స్కీతో ప్రేమలో పడుతుంది. అప్పటికి రష్యాలో విడాకుల చట్టం అమల్లో లేదు. తను భార్యకేం తక్కువ చేశాడో కరెనిన్‌కు అర్థం కాదు. తను సంఘంలో ఎంతో పరపతి ఉన్న పెద్దమనిషి. ఏం చెయ్యాలి? అన్నా మరొక యువకుడితో సంబంధం పెట్టుకుందని నలుగురికీ తెలిస్తే తన పరువేం కాను! అనేక పరిణామాల తర్వాత కథానాయిక రైలుకింద తల పెట్టి ఆత్మహత్య చేసుకుంటుంది.

కాని గొప్ప నవలల్లో కథ ముఖ్యం కాదు. అన్నా సంఘర్షణతోపాటు నవలలోని వివిధ పాత్రల్లో వాళ్ల ఆలోచనలు, ప్రవర్తన ద్వారా పతనమవుతున్న భూస్వామ్య వ్యవస్థను, వ్యక్తుల అంతర్లోకాలను దర్శింపచేస్తాడు టాల్‌స్టాయ్. "తను సృష్టించిన మనుషుల గురించి దేవుడు రాస్తే ఎలాగుంటుందో, అలా ఉంటుంది టాల్‌స్టాయ్ కథ" అంటారు విశ్లేషకులు.

"అబ్లాన్‌స్కీ ఇంట్లో రోజూ గొడవలే. ప్రతి చిన్న విషయానికీ ఒకర్నొకరు నిందించుకోవటమే తప్ప, ప్రేమగా పలకరించుకోరు" అంటూ ప్రారంభమవుతుంది కథ.

అది ఆనాడు భూస్వామ్య కుటుంబాల్లో సర్వత్రా కనిపించే దృశ్యం. కొద్దిమంది వ్యక్తుల జీవితాలను కేంద్రంగా తీసుకుని సమాజ విశ్లేషణ చేశాడు రచయిత. భార్యాభర్తల మధ్య విభేదాలు వచ్చినప్పుడు పరిష్కారమేమిటి? వివాహమనే ఇనుపబోనులో జీవచ్ఛవాల్లా గడపక తప్పదా? ఈనాటిలాగే ఆనాడు కూడా స్త్రీ పురుషులకు వివాహేతర సంబంధాలు లేవని గాదు. కానీ బహిరంగంగా ఆ సంబంధాన్ని అంగీకరిస్తే- ముఖ్యంగా ఒక స్త్రీ ఏమవుతుంది? పిల్లలేమయిపోతారు? ఒక పరిణత సమాజం ఇలాంటి పరిస్థితుల్లో వ్యక్తులకు

వెసులుబాటు కల్పించాలి.

ఈ నవలలోని మరొక ముఖ్యపాత్ర లెవిన్. కాయకష్టాన్ని నమ్ముకున్న సంపన్న కర్షకుడు. ఈ పాత్ర ద్వారా రచయిత వ్యవసాయాన్ని గురించి, జీవితాన్ని గురించి తన అభిప్రాయాలన్నీ చెప్పాడు.

"ధనిక కుటుంబాలలో వ్యక్తుల మధ్య ఎడం పెరిగిపోతుంది. ఇంటిపనులు చెయ్యటానికీ, పిల్లల్ని పెంచటానికీ పనిమనుషులుంటారు. భార్య అవసరం లేని తన సుఖాలను ఇంటి యజమాని అన్వేషించుకుంటాడు. పార్టీలు, ఫ్యాషన్లంటూ ఇల్లాలూ అదే పని చేస్తుంది. తల్లిదండ్రుల అజమాయిషీ లేని పిల్లలు దారి తప్పటం అతి సహజంగా జరిగిపోతుంది. పేదవాళ్లకివన్నీ సాధ్యపడవు. అందరూ కలిసి కష్టపడి పనిచేస్తే తప్ప కడుపు నిండదు. వాళ్లు ఒకరికొకరు దూరంగా ఉండే ప్రసక్తే లేదు" అంటాడు లెవిన్.

నవలలో చర్చకు వచ్చిన మరొక విషయం ప్రైవేటు ఆస్తి. 1861లో (అర్థ) బానిస విధానం రద్దయిన తర్వాత అనేకమంది భూస్వాములు బికారులుగా మారారు. పిల్లల స్కూలు ఫీజు చెల్లించలేని భూస్వాములు ఈ నవలలో కన్పిస్తారు. ఉద్యోగాలు చెయ్యక తప్పని పరిస్థితి. కాని కనీసార్హతలు కూడా లేని వాళ్లనెవరు నౌకరీలో పెట్టుకుంటారు?

అందువల్ల పంటల మీద వచ్చిన ఆదాయంతో నగరాల్లో విలాస జీవితం గడిపిన భూస్వాములు తిరిగి పల్లెబాట పట్టక తప్పదు. రైతు, బైతు అంటూ తాము ఇన్నాళ్లూ చీదరించుకున్నా లెవిన్ లాంటివాళ్లు ఆదరిస్తే తప్ప గతిలేని పరిస్థితి ఏర్పడింది.

భూస్వామ్య వ్యవస్థ పునాదులు కదిలిన దిశలో అన్నా లాంటి వ్యక్తుల జీవితాలు తుఫానులో ఎండిన ఆకుల్లా కొట్టుకుపోవలసిందే. ఆనాడు ధనిక వర్గాలలోని దంపతుల మధ్య ఉన్నది కూడా భూస్వామి-రైతు సంబంధమేనని అన్యాపదేశంగా సూచిస్తాడు లెవిన్. అప్పటికి రష్యాలో, పెట్టుబడిదారీ వ్యవస్థ వేళ్లూనలేదు. లైన్లు వేసి, రైళ్లు నడిపి బొల్గారినోవ్(ఒక పాత్ర) కోటీశ్వరుడయ్యాడంటే చిరుగుపాతల భూస్వాముల కామాట వింతగా వినిపిస్తుంది. అర్థబానిసలను భూస్వాములు చేసిన దోపిడీ కన్నా, పెట్టుబడిదారు కార్మికులను చేసే దోపిడే ఎక్కువ నీచమైనది. ఇది టాల్‌స్టాయ్ అభిప్రాయం. "కష్టపడకుండా సంపదను అనుభవించడం నేరం" అంటాడు లెవిన్. మారుతున్న పరిస్థితుల గురించి, వర్గ సంబంధాల గురించి, వ్యవసాయ సంస్కరణల గురించి సుదీర్ఘమైన చర్చ ఉంటుంది నవలలో.

లెవిన్ సోదరుడు నికొలాయ్ ఒక విప్లవకారుడు. అతడు భూస్వామ్య, పెట్టుబడిదారీ వ్యవస్థలను తిరస్కరించి కొత్త సమాజం కోసం ఉద్యమిస్తాడు. 'పెట్టుబడి అనే బండరాయి కింద నలిగిపోతున్న చీమలు మన శ్రామికులు. పెట్టుబడి రాక్షసికి ఆహారం జంతువుల్లాంటి మన శ్రామికులు' అంటాడు నికొలాయ్.

'కమ్యూనిజం' భావన బాగానే ఉన్నట్టుంది. ఇది ఆలోచించవలసిన విషయమే అనుకుంటాడు లెవిన్. అయితే హింసకు తావులేని నైతిక విప్లవం సాధ్యం కాదా? అని అతడి మీమాంస. అన్నా భర్త కరెనిన్ పాత్రను కూడా గొప్ప సానుభూతితో చిత్రిస్తాడు రచయిత. అతడు ప్రభుత్వంలో ఉన్నతాధికారి. రాజకీయ చతురుడు. భార్య అసంతృప్తికి కారణాలను మాత్రం అర్థం చేసుకోలేదు. ఉద్యో



## టాల్‌స్టాయ్ శిష్యరికం

ప్రారంభదశలో టాల్‌స్టాయ్ టెక్నిక్, వర్ణనల మీద పట్టు సాధించటం కోసం కృషి చేశాడు. ఉన్నదున్నట్టుగా చెప్పాలి కానీ ఆసక్తికరంగా చెప్పాలి. పాత్రల గురించి రచయిత సూటిగా చెప్పగూడదు. అనేక సంఘటనల్లో వాళ్ల ప్రవర్తనను చిత్రించటం మేలైన పద్ధతి. అలాగే, వాళ్ల చర్యలను, ఆలోచనలను విశ్లేషించి చూపటం ద్వారా పాత్రల వ్యక్తిత్వంలోని వివిధ పార్శ్వాలు పాఠకులకు 'క్లోజప్'లో కనిపిస్తాయి. ముఖ్యంగా ఒకే విషయాన్ని సూక్ష్మంగానూ (మైక్రోస్కోపిక్), బృహత్ దృశ్యంలో భాగంగానూ చూపటంవల్ల, పెద్ద కాన్వాస్‌లో ఒక ప్రత్యేక విషయం స్థానమెక్కడో తెలుస్తుంది. రూసో 'కన్ఫెషన్స్', స్టెర్న్ నవలలు, టాఫర్ రచనలు చదివి టాల్‌స్టాయ్ రచనా ప్రక్రియలోని కిటుకులు తెలుసుకున్నాడని పండితుల అభిప్రాయం.

గుల్లో అవినీతిని అరికట్టటానికి కమిషన్లు వేస్తారు. కాని ఇంటి సమస్యలనెవరు పరిష్కరిస్తారు?

ఇక అన్నా ప్రియుడు వ్రోన్స్కీ. యువకుడు. అందగాడు. పాలపొంగులాంటి ప్రేమోధృతమే తప్ప, గాయపడిన అన్నా హృదయాన్ని అర్థం చేసుకోగలిగిన పరిణతి లేదు. భర్తకూ, ప్రియునికీ అర్థంకాని అన్నా జీవితం తెగిన తోకచుక్కలా గతితప్పి ప్రయాణించింది. "ఈ విపరీత మనస్తత్వాలను అవగాహన చేసుకోగలడు లెవిన్. అతనితో అన్నా తన కష్టాలన్నీ చెప్పుకుంటుంది. కన్నీళ్లతో కడిగిన ఆమె వదనం పాలరాతి శిలలా ప్రకాశించింది. జ్ఞానం, తెలివితేటలు కాదు. సాటి మనిషిపట్ల కరుణ, ప్రేమ ముఖ్యం. స్పందించగలిగిన హృదయం కావాలి" అంటాడు రచయిత.

అన్నా ప్రవర్తనను టాల్‌స్టాయ్ సమర్థించలేదు. ఖండించలేదు. ఒకరి మంచి, చెడులను నిర్ణయించే అధికారం మనకెవరిచ్చారు? మనిషి ఆత్మ గమనాన్ని చిత్రించటమే తన కర్తవ్యం. న్యాయనిర్ధారణ కాదు. సత్యదర్శనం ముఖ్యం.

"చారిత్రక నవలగా మలిచిన 'యుద్ధము-శాంతి' ఒక ప్రేమకథ. ప్రేమ కథలాగ రాసిన 'అన్నా కరెనినా' సమకాలీన చరిత్ర" అన్నాడు కవి అఫనాసీ ఫెట్. రష్యాలో భూస్వామ్య వ్యవస్థ కూలిపోవటానికి గల కార్యకారణ సంబంధాల్ని అన్వేషించిన ఒక సామాజిక అధ్యయనం ఈ నవల.

"నా రచనా జీవితంలో మొదటి సారి తెలిసినదంతా రాశాను. ఏదీ దాచుకోలేదు" అన్నాడు టాల్‌స్టాయ్.

ఒకప్పుడు తనను ఆరాధించిన భార్య, ఆస్తిమీద మమకారం పెంచుకుని తరచూ పోట్లాడటం కూడా టాల్‌స్టాయ్ దాంపత్య జీవితంలో కొంత అలజడి సృష్టించింది. అయినా ఒకర్ని నిందించటం అతడి స్వభావం కాదు. నవలలో ప్రేయసీ ప్రియుల మధ్య తరిగిపోతున్న ప్రేమదశలను చూపిన పద్ధతి పాఠకులను అంతర్ముఖుల్ని చేస్తుంది.

"సంసారంలో ఏ నిర్ణయం తీసుకోవాలన్నా భార్యాభర్తల మధ్యన సఖ్యత ఉండాలి. లేదా ఒకర్నొకరు ఖాతరు చెయ్యని తెగింపైనా ఉండాలి. కాని ఈ రెండూ లేని స్థితి ఒకటుంటుంది. అప్పుడెవరూ ఏపనీ చేయలేరు. పరస్పరం నిందించుకుంటూ సంవత్సరాలు గడిపేస్తారిలా.

అన్నా, వ్రోన్స్కీలకిప్పుడు కలిసి పలకరించుకోవాలని కూడా లేదు. "భర్తను, సంసారాన్ని వదిలి వచ్చిన తనను ప్రియుడు కేవలం స్వైరిణిగా మాత్రమే చూశాడా? అతనికెందరో స్త్రీలతో సంబంధముండే ఉంటుంది. అందులో తనూ ఒక్కతే. లేక

## లియో టాల్‌స్టాయ్

టాల్‌స్టాయ్ సాహిత్యమే కాదు, జీవితం కూడా ప్రపంచ వ్యాప్తంగా ఎందరో శాంతికాములకు, మానవతావాదులకు స్ఫూర్తినిచ్చింది. చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న టాల్‌స్టాయ్‌ని, పినతల్లి పెంచింది. ప్రేమా, కారుణ్యమే మనిషి మనుగడకు మూలమని నేర్పించింది. తరువాత చదివిన డికెన్స్ నవలల్లోని తండ్రి ప్రేమకు నోచుకోని బాలల పాత్రలు అతణ్ణెంతో కదిలించాయి. తన ఆత్మకథాత్మకమైన ట్రియాలజీ "బాల్యం కౌమారం యవ్వనం" పుస్తకాలలో ఈ విషయాల గురించి దీర్ఘంగా చర్చించాడు టాల్‌స్టాయ్. తొలిదశలోనే ఆయన మేధస్సును, ప్రతిభను గుర్తించిన వ్యక్తి మరొక ప్రముఖ రష్యన్ రచయిత తుర్గేనీవ్. "టాల్‌స్టాయ్ రచనల మధువును తాగిన మనుషులే కాదు, దేవతలు కూడా మత్తెక్కి నాట్యం చేస్తారు" అన్నాడు తుర్గేనీవ్.

యుద్ధము-శాంతి తర్వాత 'సర్వసంగ పరిత్యాగం' చెయ్యటానికి ముందు మధ్యదశలో టాల్‌స్టాయ్ రాసిన మరొక మహత్తర నవల 'అన్నాకరెనినా' (1875-77). పత్రికలో సీరియల్‌గా వస్తున్నప్పుడే దీన్ని చదివి ముగ్ధులైన దొస్తోయెవ్‌స్కీ, "నాలో అలజడి లేపుతున్నదీ కథ. వ్యక్తుల ఆత్మలలో ప్రవేశించి రాయటం టాల్‌స్టాయ్‌కి మాత్రమే సాధ్యం. సామాజిక ఇతివృత్తంగా కనిపించినప్పటికీ, ఇది మనుషులు అసంకల్పితంగా చేసే రహస్య ప్రస్థానాల గాథ" అన్నాడు. నోబెల్ బహుమతి గ్రహీత థామస్ మాన్ దృష్టిలో ఇది 'గ్రేటెస్ట్ నావెల్ ఆఫ్ ఆల్ టైం'. ఒక పట్టాన ఎవరినీ ప్రశంసించటానికి ఉత్సుకత చూపించని బెర్నార్డ్ షా కూడా "అందరం నాటకం చూస్తాం. తెరవెనక విషయాల గురించి రాస్తాడు టాల్‌స్టాయ్" అన్నాడు. ప్రపంచంలోని రచయితలందరూ ఏ నవల రాస్తే తమ జీవితం ధన్యమవుతుందనుకుంటారో అలాంటి ఏకైక నవల 'అన్నాకరెనినా' అంటూ దిగులు పడ్డాడు థియొడర్ డ్రైజర్.

పోతే మొహం మొత్తినట్లుగా దూరదూరంగా ఉంటాడెందుకు? " అనుకుంటుంది అన్నా. తనలోని అసూయకు, అసంతృప్తికి పునాదులు ఏర్పరుచుకుంది. తను అతనికోసం జీవితం త్యాగం చేసింది. కాని పూచిక పుల్లంత విలువైనా ఇస్తున్నాడా అతడు? భర్తను వదిలేసింది. అతనికి తన అవసరం ఏమాత్రమైనా ఉండదా? తను లేకపోతే కొడుకు ఏమైపోతాడు? వాణ్ణి ముద్దు చేసేదెవరు? "

వ్రాన్స్కీ తనపట్ల ప్రేమగా ఉన్నప్పుడు కూడా అదంతా నటన అనే నిర్ధారణకు వచ్చింది అన్నా. ప్రస్తుత పరిస్థితి నుండి ఒక్కొక్క దృశ్యమే వెనక్కు వెళ్లి తమ తొలి కలయికను గుర్తు చేసుకుంటుంది. మొదటి పొరబాటు ఆ క్షణాన జరిగిందన్నమాట. ఎందుకు అతడంటే తనకిష్టం కలిగింది? ప్రేమ తెలియని మనిషిని ఎలా ప్రేమించింది? ఇవీ-అన్నా ఆత్మహత్యకు దారితీసిన ఆలోచనలు.

* * *

అత్యద్భుతమంటూ ఈ నవలను ప్రశంసించని సాహితీవేత్తలు, పాఠకులు లేరు. "ఏ రచయితయినా జీవితంలో ఒక మంచి రచన చేస్తే చాలు అనుకుంటాడు. కాని టాల్‌స్టాయ్ రెండు మహాకావ్యాలను రాశాడు. ఆ రెండోదే అన్నాకరెనినా" అన్నాడు ప్రముఖ విమర్శకుడు, రచయిత సి. పిస్నో.

"అన్నా కరెనినా ఊహించిన పాత్ర కాదు. నా జీవితాన్ని కల్లోలపరిచిన సజీవమూర్తి" అన్నాడు అమెరికన్ మేధావి జాన్ ఫారెస్ట్.

– ఎం. వసంత ✦

మబ్బు తునకల కోసం, వాన చినుకుల కోసం.రైతులు ఆకాశంవైపు ఆశగా చూసినట్లే పశువులు సైతం గడ్డిలారీల రాక కోసం నిరీక్షిస్తుంటాయక్కడ. వానల్లేక పచ్చగడ్డి కరువైన వేళ ఎండుగడ్డి దొరికినా అమృతోపమానంగా స్వీకరిస్తుంటాయి. అయితే పశువుల్ని ప్రాణాలతో నిలపడంకోసం ప్రభుత్వం సరఫరా చేసే గడ్డి ఆ పశువులకు అందటమొక ప్రహసనం. పశువులే కాదు; ఊళ్ల సర్పంచులూ, లారీ యజమానులూ, లారీ డ్రైవర్లూ, క్లీనర్లు, హమాలీలు, కాంట్రాక్టర్లు, రైతులు, రైతు కూలీలు సర్కారు పంపే గడ్డికోసం ఎదురుచూడటం... పశువులకంటే హీనంగా స్వార్థపరులు ఆ గడ్డికోసం నానాగడ్డీ కరవటం... వీటి మధ్య మనుషులకంటే తమకే మమతలు అధికమని చాటే పశువుల అంతరంగాలు...వీటన్నిటికీ దర్పణంగా నిలిచే కొలకలూరి ఇనాక్ నవల

'సర్కారు గడ్డి'

ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న నవల



కొడుకులు ముగ్గురూ ఒకే మాటగా లచ్చువుని కబేళాకు తోలుదామని చెబితే రాంవుని కళ్ళలో నీళ్ళు ఊరినాయి, ఉబికినాయి, దొర్లినాయి, పారినాయి. డ్యాంలో నీళ్ళు లేక, కాలవల్లో నీళ్ళు రాక, నాలుగేళ్ళ క్షామం వల్ల, బావులెండి, బోర్లెండి నీటి చెమ్మ లేనిచోట కళ్ళలో నుంచి నీళ్ళు పొర్లుతున్నాయి.

ముంగిట్లో కట్టుగొయ్యకాడ ఉన్న లచ్చువుని కాడికి మెల్లగా రాంవుడు చేతికర్ర ఊతంతో వెళ్ళి కర్ర పారనూకి, ఎద్దు మెడ కరుసుకొని, వాని కళ్ళలోకి చూశాడు. వాని ముఖం చూస్తుంటే ఏడుపు ఆగక, కడుపు నీళ్ళు లేని, ఎండి బీటలు వారిన చెరువై బోరుమన్నాడు రాంవుడు.

అన్న ఏడుపు చూసిన లచ్చువుని రూపూ, చూపూ మారిపోయినాయి. కనురెప్పలు రెపరెపలాడి రెండు కళ్ళు చెమ్మగిల్లినాయి. కన్నీళ్ళు రాసాగినాయి. కన్నీరు, ఎద్దు కంటి పుసి మీదగాపడి, మంచు కురుస్తున్నట్లుగా ముట్టెదాకా రెండు చెంపలా జారి, నేలపాలు కాబట్టింది. అన్నను చూసి తమ్ముడు, తమ్ముని చూసి అన్న గిలిగిలలాడిపోతుంటే, అంతా చూస్తున్న కొడుకులకు దుఃఖం ఆగ లేదు.

ఎద్దు మెడ ముద్దు పెట్టుకొంటున్న రాంవుని గుండె బరువెక్కి, స్పృహ తప్పి, దాని మెడమీదే వాలిపోయినాడు. పరిస్థితి ఓర కంట చూసి అర్థం చేసుకొన్న లచ్చువుడు, ముందుకాళ్ళు వంచి, వంగి, వెనక్కాళ్ళు మడిచి కూసున్నాడు. రాంవుడు యాలాడుతుంటే, గ్రహించిన నందీసుడు పడుకోగా, రాముడు వానిమీద పడినాడు. ఎద్దు మెడమీదే రాంవుని మెడ ఉండగా ఇద్దరూ భూమాత వడిలో ఉండినారు.

ముగ్గురు కొడుకులూ పరుగు పరుగున వచ్చి, చేతుల మీదికి తండ్రిని ఎత్తుకొని, తీసుకుపోయి అరుగు మీదున్న నైరుమంచం మీద పడుకోబెట్టారు. కొడుకులు అన్నదమ్ముల్ని వేరు చేశారు. రాంవునికి ఇంకా స్పృహ రాలేదు.

రాంవలచ్చువులని, అతన్నీ ఎద్దునూ గేరి వాళ్లే కాదు ఊరివాల్లు కూడక పిలిచేదే! 'లచ్చుంవా' అని రాముడు పిలిస్తే వాడు పరుగు పరుగున పక్కన చేరి మోరెత్తి చూచేవాడు.

రాంవుడిని ఎవరన్నా 'రాంవా' అని పిలిస్తే, వానికి వినరాకపోతే, తమ్ముడు రంకేసి రాంవుని పిలిచేవాడు. ఏ సద్దూ వినలేకపోయినా, లచ్చువుని అలికిడికే అటు చూసేవాడు.

రంకె వినబడితే, వచ్చి వాని ముఖంలోకి చూసేవాడు. లచ్చువుని రంకె రాంవునికి శివునాజ్ఞ. రాంవుడు తమ్మునితో ఏమేమో మాట్లాడేవాడు. వాడు ఏదేదో చెప్పేవాడు. చెవులూపేవాడు. రాంవుడు చేతులూపేవాడు.

వాని మనసు వీనికి తెలుసు. వీని మాట అతనికి వినిపించేది. రాంవుడు ఏం చెప్పినా అది క్షణాల్లో చేసేవాడు లచ్చువుడు. 'పని కానీ' అనిపించుకునేవాడు కాదు, కోలతో పని లేదు. అదిలించే అవసరమే లేదు. ప్రేమగా వాని వొళ్ళు నిమరటమేకాని, మీద చెయి వేసే తొందరేం లేదు. రాంవుడు మనసులో అనుకొన్నదాన్ని వాడు మౌనంగా ఆలకించి ఆచరించేవాడు. రాముడు చేనికి పోవాల్నని మెడ పలుపుతాడు విప్పితే వాడు తోవ తీసేవాడు. వానికంటే ముందు పోతూ ఉండేవాడు. కుడితి తాగటానికి పిలిచినా అంతే! మేత మేయమన్నా అంతే, బండి పూన్చాలన్నా అంతే! వాని మాట వీనికి, వీని మాట వానికి అక్షరాలా తెలుసు. వాళ్ళ మౌన సంభాషణ వినసొంపుగా ఉండేది. వాని జోడెద్దు చనిపోయి నాలుగేళ్ళయింది. ఆ జోడెద్దు ఎంత పని చేసినాయి. ఎన్ని చేన్లు దున్నినాయి, ఎంత పంట పండించినాయి.

# సర్వేజనా: సుఖినోభవన్తు

**వివాహాది శుభకార్యములకు శుభకరమైన క్వాలిటీ వస్త్రములు సరికొత్త స్టాక్‌తో**




**+నాణ్యతకు +నిర్ణీత ధరలకు +లేటెస్ట్ డిజైన్లకు**




## షాపింగ్ మాల్

**గవర్నరుపేట, విజయవాడ-2. ఫోన్ :2572927**

కంచిసొసైటీ పట్టు చీరలు ,లంగాలు,వర్క్ శారీస్,డిజైనర్ శారీస్,గద్వాల్,కొత్తకోట,వెంకటగిరి వెండిజరీ చీరలు,ఫ్యాన్సీజార్జెట్ చీరలు,గాగ్రాస్,సల్వార్‌సూట్స్, డ్రస్‌మెటీరియల్స్, సూటింగ్స్ షర్టింగ్స్ , అన్ని లీడింగ్ బ్రాండెడ్ జంట్స్ రెడీవేర్స్,పొందూరు ఖద్దరు పంచలు, ఖద్దరు షర్టింగ్స్ మ్యాచింగ్స్,హోమ్‌లైనిన్స్ మరియు ఇంటిల్లిపాదికి కావలసిన అన్ని రకముల వస్త్రములు.

**OK silks లో ఖరీదు చేసినవారికి శుభము - క్షేమము - లాభము**

రాcవునీ, రాcవుని కుటుంబాన్నీ కాపాడి నాయి. తోడెద్దు లేక లచ్చువునికి పనిలేదు. పనిపాటలకు కొత్త కోడెలు రంకెలు వేసేవి. ఆనాటి నుంచి లచ్చువునికి పనిలేదు. బండి తోలలేదు. మడక దున్నలేదు. కాడి కట్ట లేదు. అరక తోలలేదు. పూర్తి విశ్రాంతి.

రాcవుని ముగ్గురు కొడుకులు అన్నీ చూసుకోగలిగేవాళ్ళు అయ్యారు. తండ్రిని ఏ పనీ చేయనీయటం లేదు. ఊరికే కూసోమ నేవాళ్ళు. చేనికి రానీరు, మడికి పోనీరు. పనిలేదు, పాట లేదు. పూర్తి విశ్రాంతి.

విశ్రాంతి దొరికిన రాcవలచ్చువులు ఈ నాలుగేళ్ళలో మరీ సన్నిహితులు, ఆత్మీయులు, ఆత్మబంధువులు, అసలు సోదరులు అయిపోయినారు.

రాcవలచ్చువులు జీవితమంతా కష్టపడ్డ వాళ్ళు కావటం వల్ల ఊరికే ఉండలేక, పొద్దున్నే లేచి, బుద్ధి పుట్టిన చోటికిపోయి, బువ్వేళకు ఇంటికి చేరేవాళ్ళు.

చేని గనిమ మీదనో, చెరువు గట్టునో, తోటలోనే లచ్చువుడు గడ్డి మేస్తున్నప్పుడు రాcవుడు ఏ చెట్టు నీడనో పండుకొని నిద్ర పోయేవాడు. లచ్చువుడు మేత మేయటం అయిపోగానే రాcవుని కాళ్ళకాడే పడుకునే వాడు. ఎక్కువసేపు రాcవుడు నిద్రపో తుంటే, బువ్వేల దాటిపోతుంటే, ఎండెక్కు తుంటే లచ్చువుడు రంకేసేవాడు. రాcవుడు నిద్రలేచి లచ్చువుని వెంట ఇంటికి వచ్చే వాడు. కుడితి పెట్టి కొట్టంలో కట్టేసి, మేత వేసి, తాను కాళ్ళూ, చేతులు కడుక్కొని ముద్ద తినబోయేవాడు రాcవుడు.

తండ్రి దినచర్య చూసి కొడుకులు సంతో షించేవాళ్ళు. తండ్రి అసలు పేరు ఓబులేసు. అయినా ఎవరూ అతణ్ణి ఆ పేరుతో పిల వరు. మనిషీ, ఎద్దూ అన్నదమ్ములు కావ టంతో రాcవలచ్చువులైనప్పుడు, ఓబులేసు పేరు రాcవుడుగా మారి స్థిరపడిపోయింది. తండ్రి అసలు పేరే కొడుకుల పేర్లుగా స్థిర పడ్డాయి. వాళ్ళు పెద్దోబులేసు, నడిపోబులే సు, సన్నోబులేసు. ఓటర్ల లిస్టులో ఆ పేర్లు అట్టాగే ఉన్నాయి కానీ, జనం మాత్రం పెద్దోడు, నడిపోడు, సన్నోడు అని పిలిచే వాళ్ళు. తండ్రిని గేరివాళ్ళు 'పెద్దాయప్ప' అని కూడా పిలుస్తారు, తలుస్తారు. తండ్రిని ఊరివాళ్ళు మాత్రం 'మాదిగోబులేసు' అని చెప్పుకుంటారు, చెబుతారు, పిలుస్తారు. కానీ తెలిసినవాళ్లకు రాcవుడు పేరే ప్రసిద్ధి.

మాదిగ్గేరిలో రాcవుడు తినాకుడవా ఉన్న వాడు. మాదిగల్లో పెద్ద మాదిగ. ఊరివా ళ్ళకు తలలో నాలిక. మంచోడు, దరమా త్ముడు, పుణ్ణాత్ముడు అనీ అతనిని భావిస్తారు వాళ్ళు.

అతనికి తాతముత్తాతల వారసత్వంగా వచ్చిన ఏభై ఎకరాల చేనుంది. పదెకరాల వరి ఉంది. పదెకరాల్లో చీనీ చెట్లున్నాయి. అయిదెకరాల్లో జాంచెట్లు, రెండెకరాల్లో బొప్పాయి చెట్లు ఉన్నాయి. వానలు పడితే చేను పండుతుంది. సెనక్కాయ పంట లేకుంటే చేను బీడే!

ఈ నడాన పొద్దుతిరుగుడు పువ్వు సాగు కూడ మొదలు పెట్టినారు. వరి పూర్తిగా పండితే ఇంటికి నాలుగేళ్ళు ధాన్యం లోటుం డదు. పంటలు పండాలంటే వానలు రావాలి. వానలు వస్తేనే బోరుల్లో నీరుం డేది. లేకపోతే ఉన్నంతలో పంట. బోరు నీరు పారిన మేర పంట. పంటను బట్టి గడ్డి, మేత! ఇంటివాళ్ళకు ఇంత ముద్ద ఉండాలన్నా, పశువులకింత గడ్డి కావాలన్నా బోర్లుండాలి, నీరు పారాలి, పంట పండాలి. సక్రమంగా వరి పండితే నాలుగేళ్ళు గింజ లుంటాయి, మేత ఉంటుంది.

ఏటా వర్షాలు పడి, చేను, తరి పండితే రాంవడు మారాజే! దొరబాబుకుమల్లే బతు కుతాడు. ఒకేడు కాకపోతే ఒకేడైనా వాన కురవకపోతే ఇరకాటమే! నాలుగేళ్ళుగా వాన ల్లేవు. బోర్లు క్రమక్రమంగా ఎండిపోసాగాయి.

ఈ మధ్యకాలంలో సెనక్కాయ పంట లేదు. చీనిచెట్లు ఎండిపోతు న్నాయి. వాటిని కొట్టేయాలి. కొత్త మొక్కలు పెట్టాలి. జాంచెట్లు కొట్టేసి నారు. బొప్పాయి చెట్లు పూస్తూ కాస్తూ ఉండినాయి. అవి కూడా పడి పోసాగినాయి.

బోర్లు ఎండిపోయేకొద్దీ తరికి పారే నీరు తగ్గిపోయి, పదెకరాల నుంచి అయిదు, నాలుగు, మూడు, రెండు ఎకరాల వరి పంట మాత్రమే చేతికి వచ్చింది. చలికీ మంచుకీ పండే పొద్దు తిరుగుడు పువ్వు మాత్రం అంతంత మాత్రంగా వస్తూ ఉంది.

కొడుకులు ముగ్గురూ పనిమంతులే. కష్టజీవులే. చీట్లాడరు, పోట్లాడరు. పాకెట్టులు ముట్టరు. తండ్రయినా బీడీలు కాలుస్తాడు. కొడుకులు బీడీలు కూడా తాకరు. తండ్రి మాటంటే యమ గురి. గీత దాటరు. వాళ్ళ మనువులై కోడళ్ళు వచ్చి, ఇంటినిండా చిన్నా చితకా పిల్లలు 'కీ', 'బే' అంటూ ఉండారు. రాంవుడి భార్య సీతక్క కాలం చేసింది. ఇంటి నిండా మను షులే! తినటానికి కొదవ, రోజురోజుకి కష్టం పెరుగుతూనే ఉన్నాయి. "పిల్లల బుడిబుడి మాటలు, బుడిగి బుడిగి చ దువులు రాంవునికి ఇష్టమే! వాళ్ళు బడికి పోవాలనీ కోరికే! ఈ తీరుగా పరిస్థితులుంటే వాళ్ళ సదువులు సాద్దెంవా?

రాంవునిది నాలుగ్గాండ్ల సేద్దెం! నాలుగెద్దులు. ఒక ముసలి ఎద్దు. నాలుగు దున్నపోతులు. రెండావులు. ఒకటి ముసిల్ది. రెండు ఎనుంగొడ్లు. నాలుగు దూడలు. రెండు పెయ్యలు, రెండు కుర్రలు. వాటికీ మేత లేదు.

మునుపు పాడీపంటా కొదవలే



## రచయిత పరిచయం

1939లో జన్మించిన ఆచార్య కొలకలూరి ఇనాక్ పిహెచ్.డి పట్ట భద్రులు. గుంటూరు ఎ.సి. కళాశాలలో లెక్చర ర్‌గా ప్రారంభమైన వృత్తి జీవితంలో అంచెలంచెలుగా ఎదిగి, బోధనలో నలభై సంవత్సరాల అపారానుభవం గడించి శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయం వైస్-చాన్సలర్‌గా పదవీ విరమణ చేశారు. కేంద్ర సాహిత్య అకా డమీ, జ్ఞానపీఠ అవార్డు కమిటీల్లో సభ్యులుగా ఉన్నారు. 1954లో రచనా వ్యాసంగానికి శ్రీకారం చుట్టిన వీరు రాష్ట్రమంతటా పలు కవి సమ్మేళనాలలో పాల్గొన్నారు. ఎనిమిది నవలలు, ఎనిమిది కథానికా సంపుటాలు, ఏడు నాటకాలు, రెండు వ్యాస సంపుటాలు, నాలుగు నాటికా సంకలనాలు వెలువరించారు. ఆయన రచన 'ఊరబావి' ఫ్రెంచ్, జర్మనీ భాషల్లోకి, ఇతర రచ నలు అనేకం తమిళ, కన్నడ, హిందీ, ఆంగ్ల భాష లలోకి అనువదించబడినాయి. ఇనాక్ రచనలపై పరిశోధనలు జరిపినవారు ఆరు పిహెచ్.డి డిగ్రీ లనూ, తొమ్మిది ఎం.ఫిల్ డిగ్రీలనూ అందుకు న్నారు. సైనికపరమైన గౌరవం కల్నల్ అనే ఆన రరీ టైటిల్ కూడా ఇనాక్‌కు లభించింది.

ఆంధ్రశ్రీ, కళాసరస్వతి, సాహితీ సమ్రాట్ కథక చక్రవర్తి తదితర బిరుదులందుకున్నారు. బెస్ట్ టీచర్ అవార్డు, అంబేద్కర్ నేషనల్ అవార్డు, బెస్ట్ ఎడ్యుకేషనలిస్టు అవార్డు, నేషనల్ ఇంటిగ్రేషన్ అవార్డు, పైడి లక్ష్మయ్య సాహిత్య అవార్డు, సాహి త్య అకాడమీ- తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు, మద్రాస్ తెలుగు అకాడమీ అవార్డు, ఢిల్లీ తెలుగు సంఘం అవార్డులు ఆయనను వరించాయి.

**చిరునామా: ఆచార్య కొలకలూరి ఇనాక్**

4/282, న్యూ సర్వోదయ నగర్, మీర్‌పేట,

వైశాలీనగర్, హైదరాబాద్ - 79

కుండా ఉండేది. పంటతోపాటు పాడీ తగ్గిపోయింది. కరువు మనుషులకంటే పశువుల పాలిట శాపంగా మారింది. మనుషులు కరువు పనులు చేసి గింజలు తెచ్చుకుంటున్నారు. కానీ మేత కొనలేకుండా ఉన్నారు. కొడుకులు, కోడళ్ళు కరువు పనులకు పోతున్నారు. కానీ, బాగా బతికిన రాcవుడు వయసు వల్ల కొంత, బాగా బతికినవాడు కావటంవల్ల కొంత ఆ పనులకు పోలేకపోతున్నాడు. ఎంతో సేద్దెమున్న రైతు అయినా, అవి పండకపోయినా, ఆకలిద ప్పులు ఎండవు కదా. కరువు పనులకు తలొంచుకుపోతున్నాడు. కానీ రాcవుడు పోలేకపోయాడు.

చేన్లల్లో సెనక్కాయ కసువు లేక పశువుల మేతకు కొదవ ఏర్పడింది. తరితో వరిపంట తగ్గిపోయి ఎండు గడ్డికి కొరత వచ్చింది. వానల్లేక పచ్చిక లేదు. గరిక పరకలు పెరగటం లేదు. పసుల గడ్డి చాలకొచ్చింది. పంటలు లేకపోయ, తిండి గింజలు రాకపోయ, గడ్డి కూడక ఉండకపోయ, నాలుగేళ్ళుగా ఇదే పరిస్థితి. ఎంత గడ్డి తేగలరు? ఎన్ని గొడ్లకేయగలరు? ఎంత మేపగలరు? ఎంత కాలమిట్టా సాగుతుంది! మనుషుల కృష్టం. పశువులకృష్టం. కష్టం రెట్టింపు కాబట్టింది.

సూడిలేని, పాడిలేని పశువులు దండగ. మేత తేలేరు, మేపలేరు. కాడి మోయని, బండి లాగని ఎడ్లు అక్కరలేదు. మేత ఎక్కడో సంపాదించి తెచ్చివేసినా తినలేని, కుడితి పెట్టినా తాగలేని ముసలీ ముతక, గొడ్డూగోదాను చచ్చిందాక మేపేకంటే, బతికుండగానే కబేళాకు తోలితే ఎంతో కొంత సొమ్ము చేతికి వస్తుంది. బతికివున్న పశువుల్ని చావకుండా కాపాడుకోవడానికి అయినా ఇంత సొమ్ము చేతికొస్తుంది. దుడ్డుంటే దాని తీరు వేరు. లెక్క లేకపోతే దిక్కులేదు.

ఇంటి కోడళ్ళకు ముసలి ఆవు అమ్మ వంటిది. పిల్లాపీచుకు అవ్వ వంటిది. అదిప్పుడు పాలివ్వని మాట నిజమే. కాని ఒకప్పుడు కుండలకొద్దీ పాలిచ్చింది. ఈ పిల్లలు తల్లుల పాలకంటే ఆవు పాలే తాగి పెరిగి పెద్దవాళ్ళవుతూ వచ్చారు. దాన్ని కోసుకు తినేవాళ్ళకు అమ్మటం ఇష్టం లేదు. ఆడవాళ్ళకు, పిల్లలకు అమ్మటం ఇష్టం లేదు.

ముసలి ఎద్దు మగవాళ్ళు నలుగురికీ చేదోడు వాదోడుగా ఉంటూ వచ్చింది. ఎంత పని చేసింది! ఎన్నేళ్ళు తోడుగా పాటు పడింది. ఎంత పంట పండించింది. తమ పని ఎంత పంచుకుంది. అన్నిటికీ మించి తండ్రికి తమ్ముడులాగా ఉన్న లచ్చువుని కబేళాకు తోలటం తండ్రికి బాధగా ఉంది.

పశువులు అన్నింటిని మేపటం కష్టమే. మేపుదామనుకున్నా గడ్డి దొరకటం లేదు. దొరికినా కొనే స్తోమత ఉండటం లేదు. కాలూ చేయీ కూడదీసుకుని గడ్డి కొందామంటే దాని రేటు ఆకాశం తాకుతూ ఉంది. ఆ స్థితిలో అన్ని గొడ్లను కాపాడటం కష్టమే.

ముసలి వాటిని అమ్మితే సొమ్ము వస్తుంది. అమ్మకపోతే చచ్చిపోతాయి. సొమ్మును పాతి పెట్టినట్లే! అదొక ఖర్చు దండగను కొంటే, డబ్బును పారేసుకొన్నట్లే!

ముసలి ఆవునూ, ఎద్దునూ అమ్మితే కొంత లెక్క చేతికొస్తుంది. అమ్మకపోతే మేపలేరు. మేయవు. చనిపోతాయి. ఏం చేయాలి?

పశువుల మీద- ముసలి పసులమీద - చావటానికి సిద్ధమైన వాటిమీద ఖర్చు అనవసరం.

ఇంతకాలం సేవ చేశాయని, ప్రేమించాయని, ప్రేమ పంచాయని, ఆత్మీయంగా ఉన్నాయని, పాలు పంటలతో పాటు అనురాగం అందించాయని కళ్ళారా చూస్తూ చంపుకోవటం అన్యాయం.

ఈ అనవసరం, అన్యాయాల మధ్య కొడు

# పిల్లలు కావాలనే మీ స్వప్నాన్ని
# నిజం చేసుకోండి!





## పేద, మధ్యతరగతి వారికి అందుబాటులో

**మావద్ద గల వైద్యసదుపాయాలు:**

- I.U.I. ఇంట్రాయుటిరైన్ ఇన్‌సెమినేషన్
- I.V.F. (ఇన్‌విట్రోఫర్టిలైజేషన్) టెస్ట్‌ట్యూబ్ బేబి
- I.C.S.I. ఇంట్రాసైటోప్లాస్మిక్ స్పెర్మ్ ఇంజక్షన్
- G.I.F.T. గామెట్ ఇంట్రాఫోలోసియన్ ట్రాన్స్‌ఫర్
- T.E.S.A. టెస్టిక్యూలర్ స్పెర్మ్ యాస్పిరేషన్
- స్పెర్మ్ బ్యాంక్
- ఎంబ్రియో బ్యాంక్
- సెమెన్ ఫ్రీజింగ్
- ఎంబ్రియో ఫ్రీజింగ్

అధునాతన పద్ధతులన్నీ ఒకచోటనే అంతర్జాతీయ ప్రమాణాలతో అందిస్తున్న ఆదిలాబాద్ జిల్లాలోనే ఒకే ఒక హాస్పిటల్

**(I.U.I., I.V.F., I.C.S.I. Centre)**





# ధర్మరాజు టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్

ఆదర్శ T.V.S. షోరూం ఎదురుగా
బెల్లంపల్లి చౌరస్తా, మంచిర్యాల
ఆదిలాబాద్ జిల్లా

డా॥ ఎం.అగుమంచి రాణి
D.G.O.,
ART SPECIALIST

**హెల్ప్‌లైన్: 9440694858**

లేఖ యాడ్స్, మంచిర్యాల, 98491 23614, 98497 30320

కులు కొట్టుమిట్టాడుతుంటే... 'ఉంటే తింటాం, లేకుంటే పస్తుంటాం. కాదంటే చస్తాం కానీ, ముసలి ఆవుని కబేళాకు తోలరాద'ని కోడళ్ళు గోల పెట్టారు. ఇంటినిండా ఆలగోల, బాలగోల. ఇంటి పెద్ద, మంచి మారాజు లచ్చువుని ఎక్కడ కబేళాకు కొడుకులు అమ్మి తోలేస్తారో అని స్పృహ లేని స్థితిలో పడి ఉన్నాడు. ఆడవాళ్ళు, పిల్లల ఏడుపు శబ్దం, తండ్రి స్పృహ లేని నిశ్శబ్దం మధ్య కొడుకుల ఆలోచనలో శూన్యం ఏర్పడింది. ఆ శూన్యం నుంచి బయటపడటానికి వాళ్ళు తమ ఆలోచనలను వదులుకోవలసి వచ్చింది. ఆ క్రమంలో అయినకాడికవుతుందని ముసలి ఎద్దును, ఆవును అమ్మే మాట మర్చిపోక తప్పలేదు.



అరుగుమీద మంచంలో మనిషికి మెలకువ లేదు.. ఎద్దూ, ఆవు కన్నీరు కారుస్తున్నాయి. ఆడవాళ్లు కన్నీళ్ళు తుడుచుకొన్నారు. పిల్లలు ఆడుకొంటున్నారు.

అది మట్టిమిద్దె. ముప్పై, ఇరవై అడుగుల ఇల్లు. పదీ ఇరవై అడుగుల ఇల్లులో భాగం. మరో పదీ ఇరవై అడుగుల ఇల్లు అరుగు భాగం. మరో ఇంత దిగువ భాగం.

లోభాగంలో రాంవుడు ఉరఫ్ ఓబులేసు ఇంటి విలువైన వస్తువులున్నాయి. అక్కడే భూమిలో పాతర ఉంది. నల్లబండలు పరిచిన నేల. మూలన పెద్దపెద్ద బానల మీద చిన్న చిన్న కుండలు పేర్చి ఉన్నాయి. గోడవార పేర్చినట్లు మంచాలున్నాయి. పక్కనే పేర్చిన పరుపులు, దిండ్ల పైన దండెంమీద పంచెలు, అంగీలు, గోడ సొరుగుల్లో దుప్పట్లు, బట్టలు ఉతికి మడిచి పెట్టి ఉన్నాయి.

అరుగులున్న ఇంటి భాగంలో వంటగది ఉంది. చింత కట్టెలు, చీనీ కట్టెలు, వేప కట్టెలు ఇంటి ముందున్నాయి. మరోపక్క మంచం మీద రాంవుడున్నాడు. అక్కడే పిల్లలు ఆడుకుంటున్నారు. అక్కడ ఆడ మగ తీరుబడిగా ఉన్నప్పుడు కూర్చుంటారు. అక్కడ నేలంతా నల్లబండలు పరిచి ఉన్నాయి.

ముందున్న దిగువ భాగంలో పసులు కట్టేశారు. అక్కడ కాలువు బండలు పరిచి ఉన్నాయి. పసుల మేతవాంమి ఇంటి ముందుంది. వాంమి పూర్తిగా తరిగిపోయింది. కట్టెల గుట్టలు కూడా తరుగుదలను చూపు



తున్నాయి.

మూడుభాగాల ఇంటిలోకి ముందునుంచే తోవ. ఒక పక్క కోళ్ళగూడు. మరోపక్క కట్టెల గుట్టలు. లోపలికి బాటకిరువైపులా పశువులు బారుగా ఉన్నాయి. మరి ముందు కుపోయి నాలుగు మెట్లికలు ఎక్కితే అరుగు భాగం. మరికొంచెం ముందుకుపోతే రెండు మెట్లికలెక్కితే ఇంటి లోభాగం. ఆ తలుపు లోంచే రాకపోకలు. వేరే తలుపులు లేవు. రెండు కిటికీలున్నాయి. పైన పెద్దది గవాక్షం ఉంది. గాలికి, వెలుతురికి అది పెద్ద దిక్కు. వానపడదు, ఎండ పడుతుంది.

ఆ మిద్దె గోడలు రెండడుగుల వెడల్పుతో కొండరాయితో కట్టబడ్డాయి. పొయ్యి దగ్గర కిటికీ ఉంది. మంచం దగ్గర కిటికీ ఉంది. తలుపు లేదు. గోడ లేదు. పైన కూర్చున్న వాళ్ళకు పశువులు కనబడుతూ ఉంటాయి. బయటికి పోయేచోట కూడా తలుపు లేదు.

గోడ ఉంది. వానపడదు.

ఇంటి గోడలు కొండరాళ్ళు మట్టితో కట్టారు. పైకప్పు తీరు, బండా వేశారు. దానిమీద గార చవుడు. వానపడినా ఇల్లు కారదు. తూర్పుకి వాన గంతులున్నాయి. నీళ్ళు పోతాయి. ఉత్తరానికి అభిముఖంగా ఉన్న ఇంటిలోకి పొద్దుటా సాయంకాలమూ ఎండ పడుతూనే ఉంటుంది. మూడు నిలువుల ఎత్తున్న ఆ మిద్దెలో ఏ పొద్దేగాని చల్లగా ఉంటుంది. ఎండాకాలం ఎండలు ఆ ఇంటిలో వాళ్ళనేమీ చేయలేవు. ఇల్లు చల్లగా ఉంటుంది. ఇంటి లోభాగంలో కుండల దొంతర్లు, గాదెలకు ఎదురుగా రెండు బీరువాలున్నాయి. వాటిలో బంగారు నగలు, నగదు ఉండేవి. అప్పుడు తాళాలు వేసే వాళ్ళు ఇప్పుడు తాళం వేయటం లేదు. నగలు తాకట్టుకుపోగా అంతంత మాత్రంగా ఆడవాళ్ళ శరీరాలమీద, అలమారాల్లో, ఉన్నాయి. నగదు పెద్ద మొత్తంగా ఏమీ లేదు. అలమారాల్లో పిల్లల బట్టలు ఆడ వాళ్ళ చీరెలు, పెళ్ళినాటి పట్టుబట్టలు ఉన్నాయి.

అటుపక్క నుండే మెట్టు బల్లల మీద మునుపు ధాన్యం మూటలు మేటు గట్టి ఉండేవి. అవి తగ్గిపోయి ఒకటీ అరా మిగిలి బల్లలు బోసిపోయి ఉన్నాయి.

మిద్దె ముందు ఒక టయరుబండి, మరో బల్లబండి ఉన్నాయి. నాగలి, కాడి, మేడి వంటి వ్యవసాయ పనిముట్లు అక్కడే ఉన్నాయి. ఇంటివాళ్ళకుండే తిండి గింజలుకాని, పశువులకుండే మేతగాని దాదాపు తరిగిపోయాయి. కూర్చుని తింటే కొండలే తరుగుతాయంటారు. ఇందరు తింటుంటే, మెట్టు బల్లలు, పాతర, గాదెలు, కుండల దొంతర్లలో ఉన్న ధాన్యం తరిగిపోవటమే కాక, నాలుగేళ్ళుగా ఏ తిండిగింజలూ ఇంటికి రాకపోవడంతో ఏమీ మిగలకుండా పోవటంలో వింతేముంది? ఈ ఏడు కూడా ఇలాగే వానలు లేక, పొలాలు పండక, తిండి గింజలు లేకపోతే ఈ సంసారం ఇలాగే సాగుతుందన్న నమ్మకం ఎవరికీ లేదు. ఈ అపనమ్మకం నుంచే ముసలి ఎద్దునూ, ఆవునూ అమ్మాలన్న ఆలోచన పొడచూపి, అంతరించిపోయి శూన్యంలో శూన్యమైంది.

'కుటుంబం ఎట్లా గడుస్తుందా?' అని, అందరూ ఆదుర్దా పడుతున్నారు. పశువుల మేత మరీ ప్రమాదకరంగా మారింది. తల్లి తండ్రుల్లాంటి ఆవునూ, ఎద్దునూ అమ్ముకోవాలనుకోవటం, కబేళాకు తోలాలనుకోవటం, వాటిని మేపలేకే. అమ్మితే వచ్చే సొమ్ముతో తామింత ముద్ద చేసుకోవచ్చు కొన్న సర్కారు గడ్డి ఆ రోజే వచ్చినా ఎన్ని గొడ్లు తింటాయి? ఎంత కాలం తింటాయి? ఆ కాస్త గడ్డి ఇన్ని పసులకు పంచేకంటే ముసలి వాటిని కబేళాకు తోలితే మేలుకదా అనుకున్నారు కొడుకులు.

మిగతా వాటిని ఎందుకు అమ్మదలుచుకోలేదు? వానలు పడితే వ్యవసాయం చేయటానికి అవి కావాలి కాబట్టి. అందుకోసం అవి ఉండాలి. ఉపయోగంలేని ముసలివి పోవాలి. ఉపయోగపడే వయస్సువి ఉండాలి.

రాంవుడు తానూ ముసలి వాడయ్యాడు. తనవల్లా ఉపయోగం లేదు. తనెందుకు వీళ్ళకు? తానేం కావాలి? వాటిని అమ్మితే ఎవరైనా కొంటారు. తనను అమ్మితే ఎవరూ కొనరు! తన తమ్ముడు లచ్చువుడు ఇప్పటికీ విలువైనవాడే! అన్న అయిన తాను ఇప్పుడేమీ విలువలేని వాడు. ఆ ఆలోచనతో కన్నీళ్ళు వచ్చాయి.

తన కొడుకులు ఉపయోగం లేని తననేం చేస్తారు? వదిలేస్తారా? ముద్ద వేయరా? వాళ్ళు అట్లాంటి వాళ్ళు కాదు. తనను ఏ పరిస్థితుల్లోనైనా తరిమేస్తే? - తరిమేస్తే ఏం చేయాలి? తన కొడుకులు బంగారుకొండలు. ఇప్పుడా బంగారుకొండలు విలువ లేకుండా పోయాయి. పేదరికం ఎంత

"నల్ల బొంగు మచ్చలు," "మొటిమలు," "మొటిమల గుంటలతో" విసిగిపోయారా?
"మెడికో-కాస్మొటిక్ కంబైన్డ్ ట్రీట్‌మెంట్" ద్వారా ఆధునిక చికిత్స"
అవాంఛిత రోమాలతో సిగ్గుపడుతున్నారా?
"లేజర్ పర్మినెంట్ హెయిర్ రిడక్షన్" ద్వారా మీ సమస్యకు పరిష్కారం"






# బ్యూటీ కేర్ & స్కిన్ క్లినిక్

సాయిదత్తా ఆర్కేడ్, 1st Floor, ఇండియన్ బ్యాంక్ ఎదురుగా, హిమాయత్‌నగర్ మెయిన్‌రోడ్, హైదరాబాద్.
Ph: 65185515, 27661767, 9849746252

డా॥ యం.యన్.రావు
MBBS (Osm) DD (UHS)
చర్మ కాస్మొటాలజి ప్రత్యేక వైద్యనిపుణులు

Mrs. రాధికా రావు
ప్రముఖ బ్యూటీషియన్ &
కాస్మొటాలజి నిపుణులు

### మా మెడికో కాస్మొటిక్ ప్రత్యేక చికిత్సలు

- అవాంఛిత రోమాలకు లేజర్ పర్మినెంట్ హెయిర్ రిడక్షన్
- కెమికల్ పీలింగ్
- పిగ్మెంటేషన్ ట్రీట్‌మెంట్
- కలర్ ఇంప్రూవ్‌మెంట్, ట్రీట్‌మెంట్
- లేజర్ ఫేషియల్ రిజెనువేషన్
- లేజర్ హెయిర్ స్టిమ్యులేషన్
- ఆంటి ఆకెని ప్యాకేజ్
- మైక్రో డెర్మాబ్రేషన్

### మా బ్యూటీకేర్ ప్రత్యేకలు

- ఫేషియల్స్ (అన్నిరకాలు)
- బ్లీచింగ్
- వ్యాక్సింగ్, మనిక్యూర్, పెడిక్యూర్.
- పర్మినెంట్ హెయిర్ స్ట్రెటెనింగ్ & హెయిర్‌కట్
- హెన్నా అప్లయింగ్, హెయిర్ కలర్
- ఫేస్ లిఫ్ట్, బ్రెస్ట్ లిఫ్ట్
- గన్‌షాట్ విత్ టాప్స్, బ్రైడల్ మేకప్

## తెల్లపూత రోగులకు శుభవార్త!

Ph: 65985515,
Cell: 9849746252

తెల్లపూత రావడం మా ఖర్మ అని, ఈ వ్యాధి తగ్గదని బాధపడకండి. భయంకరమైన పత్యంతో ప్రాణాలపైకి తెచ్చుకోకండి. NBUVB, PUVA థెరపి చికిత్స ద్వారా ఆధునిక చికిత్స. కేవలం 2-3 వారాల్లోనే ఇంప్రూవ్‌మెంట్. విటిలిగో సర్జరి. ఆధునిక పద్ధతి ద్వారా చికిత్స (ఉదా: ఆటోలోగస్ ఎపిడర్మల్ సస్పెన్షన్, ఆటోలోగస్ ఎపిడర్మల్ మెలనైన్ సెల్ సస్పెన్షన్).

# తెల్లపూత స్పెషాలిటి క్లినిక్

మహేష్ బ్యాంక్ ఎదురుగా, ENT హాస్పిటల్ ప్రక్కన, బ్యాంక్ స్ట్రీట్, కోఠి, హైదరాబాద్
డా॥ యం.యన్.రావు, MBBS (Osm) DD (UHS)
చర్మ కాస్మొటాలజి ప్రత్యేక వైద్యనిపుణులు

శాపం? ఎంత పెద్ద రైతు తాను! ఇంత బీద వాడుగా ఎలా మారాడు? ఎందుకు మారాడు? పని చేయలేడా? చేయనన్నాడా? చేయలేకపోయాడా? ఏదీ కాదే! వాన రాకపోతే ఇంత ప్రమాదమా? దేవుడికి ఎందుకు దయ లేదు? దయ కలుగలేదు! ఎందుకూ పనికిరాని తానెందుకు కొడుకులకు భారంగా ఉండాలి? ఎక్కడికయినా పోవాలి. ఎక్కడికి పోవటం? ఎలా బతకటం?

భార్య కాలం చేసినప్పుడే తానూ పోయి ఉంటే ఈ కరువు కష్టం చూసే బాధ తప్పి ఉండేది. ఆ అదృష్టం ఆమెకున్నట్లు తనకు లేకపోయింది.

తాను ఇల్లు వదిలి పోగలడా? పోలేడు. కొడుకుల్ని చూచుకోవాలి. మనవళ్ళనీ, మనుమరాళ్ళని ఆడించాలి, పాడించాలి, ఆలనా పాలనా చూడాలి.

తాను వెళ్ళిపోతే తననెవరు చూస్తారు? ముద్ద వేసే కోడళ్ళు లేకపోతే ఎలా? ఎక్కడకుపోయినా తిండితిప్పలు తప్పవు కదా!

చుట్టుపక్కల ఊళ్ళ రైతులు అనంతపురంలో బిచ్చెమెత్తుకు బతుకుతున్నారని తాను వినలేకపోలేదు. తాను అడుక్కుతినాలా? అంతకంటే చావు నయం కాదా? అనుకొన్నప్పుడల్లా చావు వస్తుందా? బలవంతంగా చస్తే పాపం కదా! నరకం కదా! చచ్చిపోదామనుకొన్నప్పుడు సహజంగా మరణం సంభవిస్తే ఎంత అదృష్టం!

పనికిరాని వస్తువుల్ని పారేసినట్లు పనికిరాని ప్రాణుల్ని వదిలించుకోవటం సాధ్యమా? న్యాయమా? ఒకరికి పనికిరాని వస్తువు మరొకనికి ఉపయోగపడవచ్చు. తమకు పనికిరాని ఆవు, ఎద్దు ఎవరికో పనికిరావచ్చు. మాంసం కోసం, తోలు కోసం వాళ్ళు కొనుక్కోవచ్చు. తన వాళ్ళకు పనికిరాని తనను ఎవరు కొంటారు? ఎందుకు కొంటారు. కొనరు! సృష్టిలో మానవజన్మ ఉత్కృష్టం అంటారు కదా! అంత ఉత్కృష్టమైన జన్మ ఉన్న తను ఎవరికీ అవసరం కాదు. తనెందుకు? తన ఉత్కృష్టత ఎందుకు?

ఈ ఇల్లు నాది, ఈ పొలం నాది, వీళ్ళు నా కొడుకులు, వీళ్ళు నా కోడళ్ళు, మనుమలు, మనుమరాళ్ళు అని ఇల్లు కదలకపోయినా, కరువు కారణంగా వాళ్ళే మెడబట్టి నెట్టేస్తే ఏం చేయాలి?

ఎవరూ నెట్టేయరు? నిజమే కూడు పెట్టలేక పొమ్మంటే... ఏం చేయాలి?

ఏమీ చేయలేడు.

ఎవరు న్యాయం చెబుతారు?

న్యాయం కోసం ఎవరిని యాచించాలి?

కొడుకుల్నా? కోడళ్ళనా? ఇరుగు పొరుగునా? ఊరివాళ్ళనా?

ఎప్పుడో ఒకప్పుడు, ఎందుకో ఒకందుకు దాదాపు అందరూ తనను ఏదో ఒకటి అడిగే ఉన్నారు.

వాళ్ళనా తాను యాచించటం?

వృద్ధాప్యంలో కన్నబిడ్డలు ప్రేమగా, ఆదరణగా, అండగా ఉంటే అదృష్టమే. లేకుంటే దురదృష్టమే. చావే. నరకమే, సజీవ నరకమే!

రాంవుడు కళ్ళు తెరిచేసరికి చుట్టూ కూర్చుని ఏడుపు ముఖాలతో ఉన్న కొడుకుల్నీ, కోడళ్ళనీ, నరసమ్మనీ చూచి ఊరట చెందాడు. నీరసమని చెప్పి మందు బిళ్ళలిచ్చి ఆమె వెళ్ళిపోయింది.

స్పృహ వచ్చిన రాంవుడు తనవాళ్ళ తాపత్రయం చూడగానే ఓపిక తెచ్చుకొని, లేచి మంచం మీదే కూర్చున్నాడు.

పెద్దోనికి, సన్నోనికి చేతులిచ్చి మంచం మీంచి పైకి లేచాడు. రాంవుడు నడిపోనితో 'లేపకపోరా నన్ని' అన్నాడు. నడిపోడు నడిపిస్తుంటే కొడుకుల ముఖాల్లోకి దయగా ప్రేమగా, ఏడుపుగా, బేలగా అదోలా చూచి, నడిపోన్ని వాటేసుకున్నాడు రాంవుడు.

'యట్టుండాది' అని పెద్దోడడిగితే

## వంగర చతురోక్తులు



వంగర వెంకటసుబ్బయ్య గొప్పనటుడు.. పండితుడు. 'వెండి తెర' కావ్యమనే 'మాయాబజార్'లో అల్లురామలింగయ్యతో కలిసి 'తల్పం.. గిల్పం' అంటూ గిలిగింతలు పెట్టిన నటుడంటే ఎవరికైనా చటుక్కున గుర్తుకు వస్తాడు వంగర. అమాయక బ్రాహ్మడి పాత్రలు ఆయనకు కొట్టిన పిండి. పండితుడు కావడంతో ఆయన మాటలూ గిలిగింతలు పెట్టేవి.. వాటిలో మచ్చుకు కొన్ని.......

**ఇంకెన్నాళ్లు?**

ఏదో సినిమా షూటింగ్ జరుగుతోంది. తర్వాత షాట్ తీయాల్సింది వంగరపైనే! సెట్‌లోనే ఉన్నా ఆయనను గమనించని దర్శకుడు 'వంగర... వంగర...' అంటూ అరిచాడు. 'వంగర వంగర' అంటే, 'పాతికేళ్లుగా వంగుతూనే ఉన్నా మహాప్రభో...! ఇంకెంత వంగను?' అంటూ ముందుకొచ్చారు వంగర.

దర్శకుడితో సహా అంతా ఆయన సమయస్ఫూర్తికి పొట్టచెక్కలయ్యేలా నవ్వారు.

'యావుండాది? బాగుండాదే!' అంటూ ముందుకు నడిచాడు.

కొడుకులైతే ఏమన్నా చేయగలరు. ముఖం మీద నీళ్ళు చల్లగలరు, నరసమ్మను పిలిపించగలరు. ఎద్దులు, ఆవులు ఏం చేయగలవు? ముసలివి ఏం చేస్తాయి. నోరులేని మూగజీవాలు, ఓపికలేని ముసలిగొడ్డు!

ఆవు దగ్గరకు పోగానే ఓపిక లేకపోయినా, కట్టుగొయ్య తాడు తెంచుకోవాలని ఆరాటపడింది. ఏడ్చి ఏడ్చి దాని కళ్ళు పుసులు కట్టాయి. చెయ్యి మీద వెయ్యగానే 'అయ్యా' అన్నట్లు చూచింది. 'నీకేం గాలేదు గదా సాంవీ' అన్నట్లు చూసింది. 'యాందీ! నాకేం గాలే' అని రాంవుడంటే కళ్ళతో నవ్వింది ఆవు. ఎంత అందంగా నవ్వింది. మాలక్ష్మి గోమాత!

ఎద్దు దగ్గరకు పోగానే వాడూ అటూ ఇటూ కదిలాడు. పడుకొని ఉన్నవాడు కదిలి కూర్చున్నాడు. కూర్చున్నవాడు లేచినాడు. ఓపిక తెచ్చుకొని రెండడుగులు వేసి, రాంవుడి శరీరానికి తగులుతూ, స్పర్శసుఖం అనుభవిస్తూ కళ్ళలోకి చూశాడు లచ్చువుడు. రాంవుడూ చూశాడు. ఏడుపు ఆపుకొన్నాడు. లచ్చువుడు ఏడవబోయి, ఏడుపు ఆపుకొని అటూ ఇటూ కలదిరిగాడు.

'అన్నా!' అన్నాడు లచ్చువుడు.

'తమ్ముడా!' అన్నాడు రాంవుడు.

'నీకేం బయింలేదు'

'నేనుండగా నీకేం బయంలేదు' అన్నాడు రాంవుడు.

తలెత్తి, ముట్టె ఎత్తి, నాలిక చాపి రాంవుని ముఖం నాకినాడు లచ్చువుడు. రాంవుడు గంగడోలు సవరించి, మూపురం దువ్వి, మెడ కరుసుకొని, నిమిరి 'తమ్ముడా' అన్నాడు.

'అన్నా!' అని రంకేసినాడు

'పడుకో' అంటే మాట మన్నించి ముంగాళ్ళు వంచి, వెనక్కాళ్ళు మడిచి, రాంవుడి కాళ్ళమీద తల పెట్టుకొని, కొమ్ములు తగలకుండా తల తిప్పి అన్న పాదాలు నాకసాగినాడు లచ్చువుడు.

లచ్చువుడు - శివుడికి వాహనం - నందీసుడు పక్కనే రాంవుడు కూచుని, ముక్కూ మూతి తుడిచి, కన్నీరు కారుతున్న కళ్ళు

చేతితో అద్ది, మెడా కొమ్ములు సవరిస్తుంటే, నందికి- రంకేసి చెంగనాలు తీసే లేగ దూడగా మారాలని ఉత్సాహం ఉరకలు వేయటంలో ఆశ్చర్యం ఏముంది?

తమ్ముని పలకరిస్తున్న అన్నను కొడుకులు ముగ్గురూ శరీరానికి తగులుతూ నిలిచి, కళ్ళు తుడుస్తూ, మెడ సవరిస్తూ, గడ్డం పుడు కుతూ, ముక్కూ మూతీ రాస్తూ 'లే! పోదాం! పా!' అంటున్నారు.

రావునికీ, లచ్చువునికీ తగులుతూ అన్నద మ్ముల్ని ఆనుకొంటూ, తోక అల్లాడిస్తూ, తిరు గుతూ ఉంది బూసి. బూసి ఇంటి కుక్క, రావుని నేస్తం.

రావుడెటుపోతే అటు వస్తుంది. చేతికర్ర మర్చిపోతే గుర్తు చేస్తుంది. స్వామి చేనికి పోతుంటే వెంట పోతుంది.

అన్న పడిపోతే దానికి కాళ్ళూ చేతులూ ఆడలేదు.

కుయ్యి కుయ్యిమంటూ మంచం కాడ నిల బడింది. నిలవలేక కూలబడింది.

పూజారి ఇంటి కుక్క లచ్చిందేవి పెట్టిన ఆరు పిల్లలో అందమయింది బూసి. అదొ క్కటే మగది.

అది చిన్నపిల్లగా ఉన్నప్పుడు పొలం వెళు తున్న రాంవుని వెంటపడి అరిచింది. వెనక భాగంలో ఎగురుతూ, సెల్లాడం మీంచి దేన్నో లాగబోయింది. చిన్నది ఎంతని ఎగు రుతుంది? రాంవుడు దాని తాపత్రయం చూచి కూర్చున్నాడు. సెల్లాడం మీది పురు గును కాలితో కొట్టింది. తేలు! చంపాడు. అప్పటి నుంచి రాంవుడు స్వామి. బూసి హనుమంతుడు. స్వామి భక్తుడు.

బూసి వీపు సవరించి, తోకను ఎగరేసి రావుడు వచ్చి 'లచ్చువుడు- నా తమ్ముడు, నందీసుడు, నా సామి, నా దేవుడు. మమ్మ ల్ని వేరుచేయొద్దు' అని ఏడుపు గొంతుతో అర్థించాడు.

'నందీసునే కాదు, ఆవు మాలచ్చిమిని కూడా అమ్మము, కబేళానికి తోలము' అన్నారు కొడుకులు నిర్ణయంగా.

రాంవుడి కళ్ళలో భయం క్రమక్రమంగా దూరమై ముఖం నుంచి పరారయింది. ముఖం తేటపడి, మసక మసక వెలుతురు స్థానంలో సూర్యోదయమై వెలుగురేఖలు వెల్లువెత్తినట్లు రాంవుడు పొంగిపోయాడు.

ముగ్గురు కొడుకులు నడిపించుకు రాగా అరుగుపైని మంచం మీదకు మళ్ళీ చేరాడు రాంవుడు. కోడళ్ళు గంజి తెచ్చి ఇచ్చారు. పిల్లలు పైకెక్కి ఆడుతుంటే, తల్లులు కసురు కొని వాళ్లను అవతలకు పంపారు. కొడు కులు రాంవుడిని పడుకోబెట్టి చుట్టూ కూర్చు న్నారు.

బూసి రాంవుడి చేతికర్ర లాక్కొచ్చి అతని కాళ్ళ కాడ కూర్చుంది.




అనంతపురంలోని అన్ని పెద్ద రోడ్ల మీద వరి గడ్డి వరకలుగా, పనలుగా పడి ఉంది. గాలికి గడ్డి కదిలి 'జై జవాన్', 'జై కిసాన్' అని అరుస్తోంది. గాలి బాగా తోలి, గాలి లోనే ఎగురుతున్న గడ్డి పరకలు జాతీయ పతాకంలాగా రెపరెపలాడుతున్నాయి. రోడ్ల మీద గాలికి కదులుతున్న గడ్డిపరకలు గుర గురలాడుతూ జాతీయ గీతం ఆలపిస్తు న్నాయి.

గాలికి అటూ ఇటూ కదిలిన గడ్డి రోడ్డు డివైడరును కరుసుకొని తల్లిని కౌగిలించు కొని పడుకొన్న బిడ్డలాగా ఉంది.

అనంతపురంలో యథేచ్ఛగా తిరిగే ఆవులు, ఆంబోతులు, ఎనుంగొడ్లు దొరికిందే సందని, కనబడ్డ గడ్డిపరకను కలబడి మేస్తున్నాయి. డివైడర్ల చుట్టూ తల్లుల్ని వాటేసుకుని పడున్న బిడ్డల్లాంటి గడ్డి పనల్ని నాలుక్కాళ్ళ ప్రాణాలు అపహరిస్తున్నాయి. గడ్డిపరకల్ని ఆవురావురుమని ఆరగిస్తున్నాయి. పొడుచుకొంటున్నాయి. పోటీ పడుతున్నాయి. మాటా మాటా అనుకొంటున్నాయి. అయినా మేస్తున్నాయి.

గడ్డి ఎక్కువగా మేట పడ్డచోట ఆంబోతు ప్రవేశించి ఆవుల్ని, ఎనుంగొడ్డునీ అదమాయించి, గదమాయించి గడ్డంతా మేస్తోంది.

దాని ముఖమంతా పసుపుపూత, దాని మీద కుంకమబొట్లు ఉన్నాయి. మెళ్ళో నిమ్మకాయల హారం చంద్రహారం లాగా కదులుతోంది.

ఆంబోతుకు ఆహార దీక్ష హెచ్చు. అశన వ్రతంతో ఆరోగ్యం ఇనుమడించి, వొళ్ళంతా ఉబికి, శరీరమంతా కండలై, కదల్లేక కదల్లేక నడుస్తూ ఉంటుంది. దాని డ్యూటీ అది మరిచి పోయినట్లుంది.

ఎద్దై, ఎదురైన ఆవుల్ని దాటటం మానేసింది. ఓపిక లేక కాదు. బలం ఎక్కువై, పైకి లేవలేక, ఆవు పైకి ఎగబాకలేక, నేలబారుగా నడుస్తుంది. నడవటం కూడా కష్టమే! కాలు తీసి కాలు వేయాలంటే గగనమే, శూన్యమే! నిశ్శబ్దమే, నిరుత్తరమే, నిష్కార్యమే. నిష్కామకర్మ, కామకర్మ కాకుండా కాయకర్మగా మారిపోయింది ఆంబోతుకు.

ఆంబోతును చూచి వయస్సులో ఉన్న ఆవు నవ్వింది. ఎద్దు సిగ్గు పడింది. 'నీకు కూడా గడ్డి గావాలా?' అన్నట్లుగా ఉంది ఆవు నవ్వు. అంటే దాని అర్థం ఆంబోతుకే తెలియాలి.

సిగ్గుపడ్డ ఆంబోతు ఏమనుకుందో ఏమో, వెనక్కి తగ్గింది. మేతకాడికి ఆవుకు తోవ ఇచ్చింది. ఆవు మీద ప్రేమో, కడుపు నిండిందో, అసలు గడ్డి అక్కరలేదో, నిష్ఠూరానికి భయపడిందో చెప్పటం సాధ్యం కాదు.

ఈ ఆవు అంటే అందరికీ భయమూ, భక్తీ. భక్తి గోమాత కాబట్టి. భయం కొమ్ములతో కుమ్ముతుంది కాబట్టి. ఎందుకు కుమ్ముతుంది? మేత వేయకపోతే. అరటిపళ్ళు ఎవరి చేతిలో ఉన్నా వదలదు. లాక్కుంటుంది. లాక్కోనీయకపోతే పొడుస్తుంది. అంతే, దానికి కావలసింది ఇవ్వాల్సిందే!

టొమాటోల బళ్ళు, కమలా పళ్ళ గంపలు చివరికి సెనిక్కాయలు, పప్పులు, బొరుగుల మూటలు కూడ వదలదు. కావలసింది. వదలిపెట్టదు. దాని ఆరోగ్యం బాగుంది.

ఎవరెన్ని పూజలు చేసినా చేయించుకొంటుంది. కొబ్బరి చిప్ప ముక్క మాత్రం అరటిపండుతో అందించాలి. ఎంత పసుపు అయినా దాని ముఖాన రాయి, కుంకమ బొట్లు పెట్టు, దానికి అభ్యంతరం లేదు. పరమాన్నం మాత్రం బూంది ఉండతో సహా పెట్టితీరాలి.

ఎవరొచ్చి గిల్లినా ఏమీ అనదు. ఏ పొద్దు ఎప్పుడయినా గిల్లితే చాలు చిటికెడు పంచితం పంచుతుంది. ఎవరు గిల్లినా ఇంతే పోస్తుంది. అంతా పొయ్యదు. అందరికీ అంతో ఇంతో పొయ్యాలి కాబట్టి, కొంచెం కొంచెం గిల్లిన వాళ్ళకు పంచుతూ పోతుంది. రేషన్ షాపులో కార్డు ఉంటేనే కిరోసిన్, చెక్కరో, బియ్యమో ఇస్తారు కాని ఆవు మాత్రం కార్డు లేకపోయినా, అడిగినవాళ్ళకు లేదనకుండా ఇంత పంచితం దానం చేస్తుంది. ఇంక దానం చేయలేననుకుంటే ఇంటి తోవ పడుతుంది. అడిగిన పుణ్యాత్ములకు లేదనకుండా పంచటం చూస్తే ప్రజాస్వామ్యంలో అందరికీ అన్నీ అందినా, అందకపోయినా ఆవు పంచితం అందుతున్నందుకు ఆనందంగా ఉంటుంది. ఎక్కువ పోయదు. తక్కువ పోయదు. వృధా కానివ్వదు, భక్తి చెడనివ్వదు.

కొందరు ఔపోశనం పడతారు, కొందరు నెత్తిన జల్లుకొంటారు, కొందరు పూజగదికి తీసుకుపోతారు. కొందరికది వైద్యం, కొంద రికి భక్తి, కొందరికీ ముక్తి, కొందరికి పర మార్థం, కొందరికి పూజా పునస్కారం.

ఆవు పేడ నేల మీద పడకుండా గంపలో పట్టుకోవటానికి మూర్తి దాని వెనకే నడుస్తు న్నాడు. ఆవు ఎటుపోతే అటే మనిషి పోతు న్నాడు. అది నిలబడితే నిలబడుతున్నాడు.

ఆవు రాజీవ్ సర్కిల్‌లో డివైడరు కాడ గడ్డి మేస్తుంటే దాని వెనుకే మూర్తి నిలబ డ్డాడు. దానికి కనికరం కలగలేదు. మూర్తికి ముక్తి రాలేదు.

ఆవూ- మూర్తీ రోడ్డు మధ్య నిలబడితే ట్రాఫిక్ సంగతి దేవుడెరుగు, పోలీసు విజిల్ కథ నరమానవులెరుగు. ఆవూ, మూర్తి ఎర గరు.

ఆ ఆవును చూస్తే ఏ మనిషైనా దణ్ణం పెట్టి తప్పుకోవాలి. ఏ జంతువైనా తల వంచుకొని పోవాలి. ఏ వాహన మైనా హారను కొట్టీ, నెత్తి నోరు కొట్టుకొని, ముందు వాహనం వాడితో గొడవపడి, వెనుక వాహనం వాడితో రాజీపడి హారన్లు హోరెత్తించి, రాజీవ్ సర్కిల్ నోరెత్తించి రామరామ అంటుంటే, లలిత కళాపరిష త్తులో 'నిధి సుఖమా... రాముని సన్నిధి సుఖ మా...' అని శ్రావ్యంగా వినిపిస్తుంటే, పక్కనున్న మసీదులో నుంచి 'అల్లాహో అక్బర్' అంటుంటే, లలిత కళాపరిషత్తు ఆదాయం కోసం కట్టించిన షాపులు, మసీదు వాళ్ళు కట్టుకొన్న షాపులు పోటీ పడి రోడ్డు మీదికి వచ్చి రోడ్డు పొడవు, వెడల్పుల్ని హరిస్తే, వాటిని వెనక్కి పంపే నాయకులు, వినాయకులు, దేవుళ్ళు లేక, ప్రజలు పట్టించుకోక రాజీవ్ సర్కిల్‌కి గూని వచ్చి కుంటితనం వచ్చి గుడ్డితనం వచ్చి, రోడ్డు చిన్న సందై, గొందై, రాకపోకల రద్దీలో పగిలే బుడగలాగా ఇప్పు డా అప్పుడా అంటూ ఉంది. అదృష్టంకొద్దీ ఏర్పడ్డ రోడ్డు డివైడర్లు కరువులో అధిక మాసంగా ఉన్న కాస్త స్థలం ఆక్రమించుకొని, స్త్రీ పురుషుల వాహనాల రాకపోకల్లో మాన, ప్రాణ, ధన, శీలాలు తస్కరింపబడే సందు లో అపర భక్తజన చింతామణి, అద్భుత భూలోక కామధేనువు పుణ్యగోమాత, పూజ్య



మహాలక్ష్మి వెనుక గంపమూర్తినీ, చొక్కాలేనీ అతడి వీపునూ తోకతో కొడుతున్నప్పుడు అసలు పవిత్రకార్య ఆరంభం కాబోతూ ఉందని ఆరాటపడే ఆ పురుష పుంగవుడున్న చోట రోడ్డే దేవాలయం, ఆవే దేవత, మూర్తే నారాయణమూర్తి. ట్రాఫిక్ బంద్. వాహనాలు బంద్. రోడ్లు బంద్. ఆవు పేడ వేస్తే కాని మూర్తి కదలడు. ఆవు గడ్డి మేస్తేకాని, పూర్తిగా పరకలేకుండా మేస్తే కాని, పేడ వేయదు. అది పేడ వేయకపోతే ఆవూ, మూర్తీ కదలరు. వాళ్ళు కదలకపోతే వాహనాలు ముందుకు పోవు. ప్రజలు నడవరు. ట్రాఫిక్ సాగదు. రామాయణంలో పిడకల వేటలాగా దాన్ని గిల్లేవాళ్లు, నెత్తిన చల్లుకొనే వాళ్లు, దండం పెట్టేవాళ్లు, అరటిపండు అందించేవాళ్ళు, కమలాపండు నోటికిచ్చే వాళ్ళు ఎవరి భక్తి వాళ్ళది. ఎవరి పూజ వాళ్ళది. ఎవరి అవసరం వాళ్ళది. ఎవరి తిండి వాళ్ళది. దూరం నుంచి కదల్లేక కళ్ళెత్తి చూస్తున్న ఆంబోతు 'యేమిరా దీని భోగం? దీని కడుపునొక కాయ కాస్తే, ఇదీ పిల్లల తల్లి అయితే దీనికి పొగరు తగ్గి,



లోకం తెలిసివస్తుంది' అనుకొని తన పూర్వ శక్తి స్వరూపం గుర్తుకు తెచ్చుకొని, ఇప్పటి అశక్తతకు నీరసపడి, దిగాలుగా ముఖం వేలాడేసుకొని నిలబడింది.

ఆవు కదలదు. మూర్తి దాన్ని వదలడు. ట్రాఫిక్ సాగదు. దాన్ని ఎవరూ తోలరు. ఏమీ అనరు. ఆగ్నైన ఆగుతారు. అంతలో గడ్డి లారీ వచ్చి పుణ్యం కట్టుకొంది. ఆగిన లారీ మీదికి ఆంబోతుతో సహా అన్ని పశువులూ ఎగబడ్డాయి.

ట్రాఫిక్ సందు దొరికింది. వాహనాలు కదిలాయి. నత్తనడక పోతూ వస్తూ ఉన్నాయి కార్లూ, బస్సులూ, లారీలు.

ఆగిపోయిన లారీల నుంచి నలుగురు నాలుగు పక్కలచేరి అందినంత గడ్డి గుంజి మూట కడుతున్నారు. మోపులు కడుతున్నారు. కిందపడ్డ గడ్డి ఎనుంగొడ్లు మేస్తున్నాయి. ఆంబోతు అందినంత గడ్డి పీకి నములుతూ ఉంది. అంతలో ఆవు అక్కడికి చేరింది. సహజమే కదా! ఆవు వస్తే ఆంబోతు ఆడ ఉండదు. పరారు! ఆవు గడ్డి మేస్తూ ఉంది. మూర్తి గంపతో దాని వెనుక నిలబడి ఉన్నాడు. ట్రాఫిక్ సాగింది. గడ్డి లారీలు వెళ్ళాయి.

దూరం నుంచి వస్తున్న లారీని చూచి ఆంబోతు రంకె వేసింది. అది లారీకి అడ్డం పోయింది. దాంతో లారీ ఆగిపోయింది. ఆగిన లారీలో గడ్డిని అందినంత మేర పనలు పనలుగా జనం లాగుతుంటే తమ కందింది. తాము తింటున్నాయి పశువులు.

జనం తాము తిన్నా తినకపోయినా ఆంబోతును సుష్టుగా మేపుతున్నారు. అది ఎక్కడ ఏమి తిన్నా జనం ఏమీ అనరు. దాని భోజన మార్గాలు కోకొల్లలు. దానికి రామారావు బొమ్మ ఉన్న పోస్టర్లు చాలా ఇష్టం. సినిమా పోస్టర్లు అయినా, తెలుగు దేశం పోస్టర్లు అయినా రామారావు బొమ్మ ఉంటే చాలు, పోస్టర్ను పీకి నమిలి తృప్తిగా నెమరు వేస్తుంది. ఇంక ఎవరి పోస్టర్నీ అది తినదు. పోస్టర్లు గోడమీద ఉంటాయి. కాబట్టి మెడ వంచే పని లేకుండా పోస్టర్లు తినటం దానికి మహా సరదా!

అది నడవలేదు, నడిస్తే చిన్న పర్వతం, పెద్ద ఏనుగు కదిలినట్లు ఉంటుంది. అది అడుగు తీసి అడుగు వేయాలంటే ఎన్ని పూజలు చేయాలో! నిండు గడ్డి లారీ పోతుంటే, మెడ వంచలేదు. కానీ ఎత్త గలదు కదా, అందువల్ల లారీలో గడ్డి నోటితో లాగబోయింది. కొంచమే అందింది. కొంచం జారి కిందపడింది. అది వెనుదిరిగితే నిండు ట్రక్కు వెనక్కు వచ్చినట్లుగా ఉంది. కింద పడ్డ గడ్డి ఆంబోతు తినలేదు. కదా, ఎనుంగొడ్డు వచ్చి ఎగబడి, కలబడి కుమ్మి పొడిచి, దొరికినంత నోటికి కరుచుకొని నాలుగూ నాలుగు దిక్కులకు ఉరకగా రాజీవ్ సర్కిల్ ఇరుకు సందులోంచి రాకపోకలు ఆగి ఆగి సాగుతున్నాయి.

ఆ సర్కిల్ దాటితే బళ్ళారి రోడ్డు అనబడే సుభాష్ రోడ్డు విశాలంగా ఉంది. బస్స్టాండ్‌లోకి పోయే రోడ్డు, వచ్చీపోయే వాహనాల కంటే నిలబడ్డ నానాజాతి వాహనాల వల్ల, షాపుల సొంతదారులు తాము అమ్మే సామాన్లు షాపుల ముందు, షట్టర్ల ముందు పేర్చి పెట్టటం వల్ల ఎప్పుడూ స్వర్గ మార్గంలా ఇరుకుగా, నరక మార్గంలా విశాలంగా ఉంది. పాతూరు రోడ్డు, పాతూరులాగా ఇరుకుగానే ఉంది. ఆసుపత్రి రోడ్డులోకి బారులు తీరిన ట్రాఫిక్ తీరుబడిగా పోవటం చూస్తున్న మునిసిపల్ ఆఫీసు, ఎవరేమయినా అంటారేమోనని ఎటో చూస్తూ పిలిచినా పలకటం లేదు. ట్రాఫిక్ సద్దు తగ్గగానే ఆవు ఆంబోతు ఎదురెదురుగా నిలబడి తోకలూపుకుంటూ రోడ్డు వార నిలబడి కబుర్లు చెప్పుకొంటున్నప్పుడు మూర్తి పంట పండి ఆవు పేడ వేయ సాగింది. ఆనందం పట్టలేని మూర్తి గంప

రాయలసీమలోనే అత్యాధునిక టెక్నాలజీతో ఎంతోమంది దంపతులకు సంతానభాగ్యం కలిగించి పేద, మధ్య తరగతి వారికి అందుబాటులో గల ఏకైక టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్




# ఆదిత్య టెస్ట్ ట్యూబ్ బేబి సెంటర్ (IVF & ISCI)

బుధవారపేట, హోటల్ లక్ష్మినివాస్ దగ్గర, కర్నూలు. ఫోన్: 255130

## సంతాన లేమితో బాధపడే దంపతులకు సంతాన సౌభాగ్యాన్ని అందించే ఆధునిక వైద్యశాలలో గల వైద్య సౌకర్యములు

- ఇన్‌విట్రో ఫర్టిలైజేషన్ (IVF) (Test Tube Baby) & ఎంబ్రియోట్రాన్స్‌ఫర్.
- ఇన్‌ట్రాసైటో ప్లాస్మిక్ స్పెర్మ్ ఇంజక్షన్ (ICSI).
- సెమెన్ ప్రాసెసింగ్ (IUI).
- అల్ట్రాసౌండ్ స్కానింగ్ & కలర్ డాప్లర్.
- వీడియో లాప్రోస్కోపి & హిస్టరోస్కోపి
- ట్యూబల్ రికానలైజేషన్ (మైక్రోస్కోపిక్)
- ఎంబ్రియోఫ్రీజర్ (EMBRYO FREEZER)
- సెమెన్ క్రియో ప్రిజర్వేషన్ (Husband & Donar)
- హైరిస్క్ ప్రెగ్నెన్సీ కేర్ (Highrisk Pregnancy Care)

**డా॥ జి.ఉమాదేవి**
M.Sc., M.Phil, Ph.D.
డైరెక్టర్ & ఎంబ్రియాలజిస్ట్

**డా॥ కె.తిరుపాల్ రెడ్డి**
M.D., D.G.O., M.R.C.O.G. (London)
కన్సల్టెంట్ గైనకాలజిస్ట్

ఎందరో దంపతుల జీవితంలో వసంతం!
అది ఆదిత్య టెస్ట్‌ట్యూబ్ బేబి సెంటర్ కే సొంతం!!

## కంటిచూపుకు మంచి రోజులు

వృద్ధాప్యం దగ్గర పడితే చాలు శారీరక, మానసిక బాధలు మొదలవుతాయి. ముఖ్యంగా కంటి చూపు మందగిస్తుంది. దీనికి గల కారణాల్లో కంటి పాపలపై పొరలు ఏర్పడటం ఒకటి. దీనివల్ల కంటి చూపుకు అడ్డు ఏర్పడి, చూపు మందగిస్తుంది. దీనిని శస్త్ర చికిత్స ద్వారా తొలగించి, ప్లాస్టిక్ లెన్సు అమరుస్తారు. దీనివల్ల కంటి చూపు కొంత మేరకు, నిర్ణీత ప్రదేశాల వరకే కన్పిస్తుంది. అయినా చదవటం కష్టమై చాలామంది మళ్ళీ కళ్ళద్దాలు వాడుతుంటారు.

ఇపుడు నూతన పరిశోధనలు జరిపి 'అకామడేటింగ్ లెన్స్' కనుగొన్నారు. దీనిని కళ్ళలో ఆపరేషన్ ద్వారా అమరుస్తారు. కంటిలో ఉండే కండరాలు దీనిని నియంత్రిస్తాయి. ఇది స్వతసిద్ధంగా ఉన్న కంటి వలె అమరుతుంది. స్పష్టమైన చూపు, దూరపుచూపు కోసం, చదవటానికి కూడా కళ్ళద్దాలు వాడాల్సిన అవసరం ఉండదు.



ఈ అకామడేటింగ్ లెన్స్ అమర్చిన కొద్ది గంటల్లోనే మార్పు తెలుస్తుందని రోగులు చెబుతున్నారు. ఇంతకు ముందు శస్త్ర చికిత్సలు చేయించుకున్న దానికంటే కొత్త లెన్సులు ఎటువంటి సైడ్ ఎఫెక్టులు లేకుండా ఉన్నట్టు చెబుతూ, ఆనందపడి పోతున్నారు. మరి కంటి చూపుకు మంచి (లెన్సులు) రోజులు వచ్చేసినట్లే!

పట్టుకొని నిలబడ్డాడు. అది ఎటు కదిలితే అటు కదిలాడు. అది ఎన్ని వయ్యారాలు పోతే అన్ని వంకరలు తిరిగాడు. మహారాజు ఎన్ని పోకిళ్ళు పోతున్నా అవన్నీ భరించి స్తుతించే వంది మాగధుల్లాగా మూర్తి నానా అవస్థలు, అగచాట్లూ పడ్డాడు. అదృష్టం పండి పేడ గంపలో పడింది. గంప నిండింది. గట్టి పేడ. గంప నెత్తిన పెట్టుకొని ఇంటి తోవపట్టాడు మూర్తి.

ఆవుల్ని దాటటం మానేసి, ముసలిదైనా, బలిసిన ఆంబోతును, ఎందుకూ తరంగాని దాన్ని జనం అన్నం పెట్టి, పండ్లు పెట్టి, కొబ్బరి తినిపించి, ఆకుకూరలు వేసి, కూరగాయలు, పండ్లు అందించి మరీ మేపుతున్నారు.

పంచితం, పేడ ఇచ్చే ఆవును పూజించి, మొక్కి కళ్ళకద్దుకొని, దండం పెట్టి, పసుపు కుంకాలు సమర్పించి, కోరిన తిండి పెట్టి, దొరికి తిన్న తిండి తిననిచ్చి ఆవును పోషిస్తున్నారు. ఆవూ, ఎద్దూ పుణ్యం ఇస్తాయి, స్వర్గం తెస్తాయి.

అనంతపురం జిల్లాలో వందలు, వేలు ఆవులు, ఎద్దులు మేతలేక, కుడితిలేక, కనీసం నీళ్ళులేక, ఆకలితో, అర్ధాకలితో నానా అవస్థలు పడి అంతమొందుతున్నాయి.

మనిషికి పెట్టే పశువులకు మేత లేదు.

మరోవైపు మనిషి తిండిని తినే వీటికి పూజలు. చాలినంత మేత తిండి!

అవి పల్లె ప్రాణులు. కష్టజీవులే, కర్షకులే సోదరులు.

ఇవి పట్టణవాసులు. అదృష్టజీవులు, ప్రజల పూజా కేంద్రాలు.

అవి ఐహికం.

ఇవి ఆముష్మికం.

ఐహికానికి ఆకలితో పరాభవం.

ఆముష్మికం కడుపు నిండి పూజా పునస్కారం.

లోకంలో కష్టజీవులు, నష్టజీవులు, దోపిడీదారులు, సుఖసంతోషాల ప్రాణులు.

గోలోకంలో కూడా నరక, స్వర్గ లోకాల వారసత్వం.

శ్రమజీవికి నిరంతరం శ్రమే!

సుఖజీవికి ఎల్లకాలం సుఖమే!

శ్రమ జయిస్తుందని, శ్రమ జీవులు జయించటం ఖాయం అనటం పొరపాటు. సుఖజీవులే జయించటం వాస్తవం.

అన్నం పెట్టే ప్రాణికంటే స్వర్గం ప్రసాదించే ప్రాణికే సర్వశోభలు, సకల సుఖాలు. సమస్త సంతోషాలు. సంపూర్ణ వైభోగం.

అన్నం వాస్తవం.

స్వర్గం విశ్వాసం.

భూమి నిజం.

దైవం నమ్మకం.

వాస్తవాలు, నిజాలు, తృణీభూతాలు, గడ్డిపరకలు.

విశ్వాసాలు, నమ్మకాలు ఘనీభూతాలు, గుడి గోపురాలు.

అనంతపురం జిల్లా అంతా గడ్డి కోసం, పశువుల మేత కోసం ఆకలిగొని ఉంది.

రెండు లారీలు నిండుగా వరిగడ్డి మోసుకొని వచ్చి ఒకటి పాతూరు వైపు, మరొకటి ఆసుపత్రి వైపు వెళ్ళిపోయాయి.

రాజీవ్ సర్కిల్‌లో ఎంత మాలావు లారీ అయినా చచ్చినట్లు ఆగనైనా ఆగాలి, లేదంటే రోగం వచ్చినట్లు స్లోగానైనా పోవాలి.

ఆగినా, స్లో అయినా, గడ్డి గుంజేవాళ్ళు, పీకేవాళ్ళు, లాగేవాళ్ళు, మూట కట్టేవాళ్ళు ఉండనే ఉంటున్నారు.

కిందపడ్డ ప్రతి గడ్డిపరకను పదిలంగా, శుద్ధిగా, శుభ్రంగా, శుచిగా, సుస్తాగా, అస్తారు. బస్తంగా ఎత్తి, తిని, రోడ్డును శుభ్రం చేస్తున్న ఆవులు, ఎడ్లు, ఎనుములు, దున్న


శుద్ధి చేయబడిన క్వాలిటి కలిగిన (సోయ DOC) నూనె లభించును.

G.S. Oil Ltd.

ADILABAD

పోతులు పట్టణ పారిశుద్ధ్య కార్మికుల య్యాయి.




2004 మే నెల రెండో తారీఖున గూడ్సు ఫార్మేషన్లు రెండు రావలసి ఉండగా, తెల్లవా రుజామునే ఒకటి వచ్చింది. అది అన్‌లోడ్ కాగానే వెళ్ళిపోయింది.

అనంతపురం రైల్వే స్టేషన్ నుంచి బయ లుదేరిన గడ్డిలారీలు తెలతెలవారుతూండగా ఉత్తరంగా వచ్చి కొన్ని కుడివైపుకు, కొన్ని ఎడంవైపుకు వెళ్ళాయి. కుడివైపు లారీలు రామచంద్రనగర్ దాటి ఫీడర్ రోడ్డులో కొన్ని, సుభాష్ రోడ్డులోకి కొన్ని పోయాయి. ఫీడర్ రోడ్డు లారీలు తాడిపత్రి, నార్పల దిశగా వెళ్ళాయి. సుభాష్ రోడ్డులో లారీలు పాతూరు మీదుగా బత్తలపల్లి, కదిరి దిక్కుగా సాగాయి. బైపాసులో పోయిన లారీలు చెన్నేకొత్తపల్లి, పెనుకొండ మార్గంలో ఉన్నాయి.

ఎడంపక్క నుంచి వెళ్ళిన లారీలు ఫస్టు రోడ్డులో పోయి కళ్యాణదుర్గం, రాయదుర్గం రోడ్డెక్కాయి. కొన్ని కొన్ని ఉరవకొండ వైపు వెళ్ళాయి. శాంతినగర్ మీదుగా వెళ్ళిన లారీలు బైపాసు రోడ్డెక్కి పామిడి, గుత్తి మార్గంలో పోతూ ఉన్నాయి.

ఇది ప్రభుత్వం గడ్డి. కరువు ప్రాంతమైన అనంతపురంలోని అన్ని మండలాలకు ప్రభు త్వ యంత్రాంగం గడ్డి అందేటట్లు చూస్తూ ఉంది. పశు సంవర్ధక శాఖ ఈ పంపిణీ వ్యవహారం పర్యవేక్షిస్తూ ఉంది. వీళ్ళు మండ లాలకు గడ్డి కేటాయిస్తున్నారు. యం.ఆర్. ఓ. గ్రామాలను గుర్తిస్తున్నారు. సర్పంచి గ్రామంలో అందుబాటు చూస్తున్నాడు.

ఈ గడ్డి ప్రభుత్వ సహాయం. దీనికి పైసా చెల్లించనక్కరలేదు. కానీ రవాణా ఖర్చులు కట్టాలి. ఇవి లారీకి అయిదువందలుగా నిర్ణ యించారు.

పోయినేడు గడ్డి కేంద్రాలకు లారీలు వెళ్ళాయి. ఈ ఏడు గ్రామాలకు వెళుతున్నా యి. పోయినేడు రవాణా ఛార్జీలు లేవు. ఆ అనుభవం దృష్టితో ఈ ఏడు ఆ ఏర్పాటు చేశారు.

వచ్చే పోయే రైళ్ళు లేక రైల్వేస్టేషన్ నిర్మా నుష్యంగా ఉంది కాని, గూడ్సు షెడ్డు రద్దీ గానే ఉంది.

పొద్దున వచ్చిన గూడ్సు బండికి పెద్దవి 42 వేగన్లున్నాయి. మూడు వేగన్ల గడ్డి నాలుగు లారీలకు లోడ్ అయింది. లారీలు వెళ్ళిపోయాయి. అన్ని గ్రామాలకు ఒకేరోజు గడ్డి సరఫరా కాదు. కొన్ని మండలాలకు ఒకరోజు, మరికొన్ని మండలాలకు మరుసటి రోజు పంపుతున్నారు.

ఏప్రిల్, మే, జూన్ నెలల్లో ప్రతి సంవ త్సరం నాలుగేళ్ళ నుంచి, రోజుకు రెండు గూడ్సు బళ్ళు ముందు వెనుకలుగా వస్తు న్నాయి. అనంతపురం జిల్లాలోని అన్ని మండలాలకు గడ్డి అందించే ప్రయత్నం జరుగుతోంది.

రైల్వే హమాలీలు గడ్డి అన్‌లోడ్ చేసినం దుకు ఒక కూలీ, లోడ్ చేసినందుకు మరో కూలీ తీసుకొంటున్నారు. గడ్డిని వేగన్లలో నుంచి దించుతూ ఒకేసారి లారీలలోకి ఎత్తుతున్నారు. హమాలీలకు పని సులువు. లారీ ఓనర్లకు సమయం కలిసి వస్తుంది. పశు సంవర్ధక శాఖకు గడ్డి నిలవ ఉండ కుండా వెళ్ళిపోయే పద్ధతి ఏర్పడింది. రైతు లకు వీలయినంత వెంటనే గడ్డి అందుతూ

ఉంది. పశువులకు మేత దొరికింది.

వేగన్ డోర్ దగ్గరకు, లారీ వెనుక డోర్ వచ్చి తెరచుకుంటే అన్‌లోడింగు, లోడింగు ఒకేసారి అయిపోయాయి. లారీలు డుర్రు బుర్రు మనుకొంటూ ఉత్తర దిక్కుగా హుషారుగా వెళ్ళిపోయాయి.

లారీలు వెళ్ళిపోగానే దించేటప్పుడు, ఎత్తేటప్పుడు నేలమీద పడి పాముల్లా పారాడుతూ, కప్పల్లా ఎగురుతూ, గాలికి గాలిపటాలవుతూ, అల్లాడుతూ, చిక్కురొక్కురుగా, అల్లిబిల్లిగా, అల్లుకుపోయిన గడ్డిని పోగుపెట్టుకొని, మూటగట్టుకొని, నెత్తినేసుకొనిపోతున్న వాళ్ళ ఆదుర్దా చూస్తే వాళ్ళ పశువుల పాట్లు అర్థం అవుతాయి.

వేగన్ల గడ్డి లోడ్ చేసేది ఒక పక్కనే అయినా గాలి ఆడటం కోసం రెండో వైపు డోర్ కూడా తీసి ఉంచడంతో మగవాళ్ళు, ఆడవాళ్ళు, పిల్లలు ఎగబడి గడ్డిపీక్కుని మూటగట్టుకు పోతున్నారు. గూడ్సు బండి పోగానే రైలు పట్టాల మీద, రాళ్ళమీద పడ్డ గడ్డిపరకల్ని పరిగలాగ ఏరుకొని గుప్పెళ్ళను పనలుగా చేసుకొని మోపులు కట్టుకొన్నారు.

గడ్డి దించిన వేగన్లలో పడి ఉన్న చెదురు మదురు గడ్డిని కొందరు పోగేసుకొని తీసుకుపోయారు. కొందరు తవుడులాంటి నుసిని రొల్లుకొని గోనెసంచుల్లో నింపుకొన్నారు. వేగన్లలో కసువు ఊడ్చి తూర్పారబట్టి, తాలూ తప్ప వదిలేసి గట్టివడ్లు సంచిలో నింపుకొని కొందరు వెళ్తున్నారు.

దాదాపు ఇరవైమంది జంటలుగా తల్లీపిల్లలు వాగెన్లు శుభ్రంగా కడిగి తుడిచి, అప్పగించినట్లుగా రైల్వేకి సహాయం చేస్తున్నారు.

అనంతపురం రైల్వే స్టేషన్‌లో ప్రొటెక్షన్ ఫోర్స్ లేకపోలేదు. గడ్డి దొంగిలించేవాళ్ళు కానీ, వేగన్లు ఊడ్చేవాళ్ళు కానీ వాళ్ళకు కనిపించరు. వాళ్ళు ధర్మాత్ములు. అనంతపురం కరువు వాళ్ళు కూడా రోజూ తింటున్నారు. వాళ్ళకు కఠిన నియమాలు తెలుసు. బందోబస్తు బలగమూ తెలుసు. అన్నీ తెలిసి ఏం చేయాలి? ఏమీ చేయలేరు, చేయరు!

వాళ్ళకు చాలా పనులున్నాయి. రైళ్ళ రాకపోకల సమయంలో టిక్కెట్టు లేనివాళ్ళను, జుర్మానా కట్టలేని వాళ్ళను టిటియిలు పట్టి తెచ్చి అప్పగిస్తే వాళ్ళ అజమాయిషీ చూడాలి. పిక్‌పాకెట్‌గాళ్ళు, సన్యాసులు, రైల్వే ప్లాటు ఫాంమీద సంసారాలు పెట్టిన బిచ్చగాళ్ళు, రైల్లో జాంకాయలు, ద్రాక్షాపళ్ళు, సెనక్కాయలు అమ్మే ఆడవాళ్ళు; మసాలా బొరుగులు, నీళ్ళ పాకెట్లు, పాల పాకెట్లు, మజ్జిగా అమ్మే కుర్రాళ్ళు; పుస్తకాలు అమ్మేవాళ్ళు, సబ్బులమ్మేవాళ్ళు, సారాయి అమ్మేవాళ్ళు; అడుక్కునే కుంటోళ్ళు, గుడ్డోళ్ళు, అవిటోళ్ళు, చెవిటోళ్ళు, సవాలక్షమందిని వాళ్ళు కంట్రోలు చేయాలి. వాళ్ళా? నలుగురు! పనా? నలభైమందిది. అసలు పనికే తీరికలేదు. కొసరు పనా! వాళ్ళకు కనబడదు, వినబడదు, అనబడదు. మహాత్ములు. గాంధీ మనమళ్ళు. మనోళ్ళు, మంచోళ్ళు!




**రా**ంవుని ముగ్గురు కొడుకుల్లో పెద్దాయప్ప మర్యాదస్తుడు. మంచివాడు. నెమ్మది. ఎవరినీ ఏమీ అనడు. ఎవరన్నా ఏమన్నా అన్నా ఓర్చుకొంటాడు. కోపతాపాలుండవు. ఆవేశకావేషాలుండవు. మాటకారి కాదు. ఎవరికీ ఏమీ చెప్పలేడు. ఒప్పించలేడు. గొడ్డు చాకిరీ చేస్తాడు. చేయమన్న పని శుద్ధంగా చేస్తాడు. ఏదన్నా తబిసీళ్ళు వొస్తే కష్టమే. ఎటూ

తేల్చలేడు. మంచి చెడ్డలు తెలుసు. పట్టు విడుపులు తెలియవు. మంచి కూడా చెప్ప లేడు. కరవమంటే కప్పకు కోపం, విడవ మంటే పాముకు కోపం. కప్ప కోపమేం జేసు? పాము కోపం పగబడితే కష్టం. అయినా కప్పతో ఎందుకు పేచీ. అయితే కప్పేదో, పామేదో తెలుసు. తెలివి పాద రసమే. నోరు పెగలదు. ఏదైనా మాట్లాడి తేల్చుకొని రావలసిన పని పడితే రాఁవుడు పెద్దాయప్పకు పని చెప్పడు.

ఇప్పుడు పనిబడింది. రాఁవుడు పోలేదు. తాను వెళితే పని జరుగు తుంది. కాగల కార్యాలు గంధర్వుల చేత చేయించుకొని రాగలడు. కాని ఏంలాభం? తాను పోలేడు.

చిన్నాయప్ప మహాదూకుడు, ఆవేశం ఎక్కువ. ఆలోచన అంతంత మాత్రం ఓర్పు లేదు. ఎంతమాట బడితే అంతమాట అంటాడు. మాటలెక్కువ. దబాయించుకొని రాదగ్గచోట మనిషి చాకే! ఆలోచించి, తర్జన భర్జనలు పడి, తన మాట చెప్పి, అవసరం వివరించి, ఎదుటివాళ్ళను ఒప్పించటం చేత కాదు. తాడో పేడో అని వూరుకోడు. చావో రేవో అంటాడు. నిండా మునిగాక చలేం, గాలేం అంటాడు. అందరూ వాని మాట వినేటట్లయితే, ఏ పని అయి నా సులువుగా చేయగలడు, చేయించగలడు. ఎవరయినా ఏమన్నా అన్నారంటే ఇక తగాదాలే! ముందుగా మెటిక విడుస్తాడు. అందుకే రాఁవుడు ఏదయినా మంతనాలకు, పెత్తనా లకు సన్నాయప్పను పంపడు.

నడిపాయప్ప చేయెత్తు మనిషి, కాయ పారు శరీరం. మాటామంతీ తెలుసు. ఎవ రినీ ఏమీ అనడు. కష్టం కలిగించడు. బాధ పెట్టడు, తాను బాధ పడడు. నొప్పించక తాను నొప్పక తప్పించుకునే స్వభావం. వానిది కార్యం సాధించే వ్యక్తిత్వం. నలుగు



రికి మంచి చేసి, పదిమందిలో మంచివాడని అనిపించుకునే మనిషి. పొరుగువాడికి ఎంతయినా సహాయపడుతాడు కానీ సొంత లాభం కొంతే మానుకొంటాడు. మంత నాలు చేయవలసివస్తే, పంచాయితీ పెడితే, దుప్పటి పంచాయితీ సాగనివ్వడు. వేలు కేస్తే కాలికేస్తాడు. కాలికేస్తే వేలికేస్తాడు.



మాటకారి. తెలివిపరుడు. మాటలతో న్యాయమే కాదు, బురిడీ కూడా కొట్టించగ లడు. న్యాయం తప్పడు, అన్యాయం చేయడు. మాట పడడు. మాట జారడు. అత్యవసరమైతే తప్ప గేరివాళ్ళు అతని మాటకు ఎదురాడరు. ఊరివాళ్ళు అతని మాట ఆలిస్తారు. ఆలకిస్తారు. ఆలోచి స్తారు. వాళ్ళ నాయనలాగే నడిపోడు కూడా నలుగురికీ నచ్చిన మనిషి, నీతిమంతుడు. పెద్దల పట్ల గౌరవం, మర్యాద మప్పితం ఉన్న వ్యక్తి.

రాంవునికి నడిపాయప్పతో పని వచ్చింది.

ఊరికి రేపు సర్కారు గడ్డి వస్తుంది. ఒక లారీ వరి గడ్డి అయినా తీసుకోగలిగితే ఈ కష్టకాలం తీరుతుంది. వానలు పడితే పసిరిక మొలిస్తే కష్టం ఉండదు. అందుకే రెండు నెలలయినా ఆగాలి. ఈలోగా పశువుల ప్రాణాలు నిలబెట్టాలి.

ఐదునూర్లు లెక్క కావాలంటే అంతకు ముందురోజే పెద్దకోడలి నగలు తాకట్టు పెట్టి నగదు తెచ్చాడు. సర్పంచిని, ఊరు పెద్దల్ని ఒప్పిస్తే తప్ప ఒక లారీ గడ్డి తాము పొందలేరు. ఆ ఒప్పించే పనికి రాంవుడు నడిపాయప్పను పురమాయించాడు.

పొద్దుటే నడిపోబులేసు సర్పంచి ఇంటికి పోయాడు. ఇంకా పొద్దు పొడవలేదు. దేవర ఇంకా నిద్ర లేచినట్లు లేదు. ఉదయం పూట కొండగాలి తోలి పైకి సోకి హాయిగా ఉంది. సర్పంచి ఇల్లు కోటలాగా ఉంది. కాంపౌండు గోడ దాటి లోపలికి పోయి గోడవార నిలబడ్డాడు. సూర్యుడు మేల్కొన్నా, దొరవారు మేల్కోలేదు. కాళ్ళు నొప్పి పుట్టి గోడవార ముంగాళ్ళ మీద కుందు కూర్చున్నాడు. బారెడు పొద్దెక్కేసరికి చతికిలబడి కూర్చున్నాడు నడిపాయప్ప.

సర్పంచి నిద్ర లేచాడని సేద్దగాడు చెప్పాడు. నడిపాయప్ప అటునుంచి ఇటు కదిలి కూర్చున్నాడు. పళ్ళు తోంకుంటున్నాడంటే దేవర దర్శనమవుతుందని నడిపాయప్ప సిద్ధం కాసాగాడు.

రైతులు ఒక్కక్కరే రాసాగారు. ప్రతిసారీ లేవటం, వచ్చిన ప్రతి ఒక్కరికీ మొక్కటం కష్టంగా ఉంది. నిలబడే మొక్కుబడి చెల్లించుకుంటున్నాడు. ఇంటి ముంగిట జనం గుంపుగా మారారు. కూర్చున్నవాళ్ళు, నిలబడ్డవాళ్ళు, గోడకానుకొన్నవాళ్ళు, అటూ ఇటూ తిరిగేవాళ్ళుజనం ఇష్టానుసారంగా ఉన్నారు.

అక్కడ చేరిన వాళ్ళందరూ అంతో ఇంతో ఉన్నవాళ్ళు కావటంవల్ల, అది సర్పంచి ఇల్లు కావటంతోపాటు సంపన్నుడి ఇల్లు కావటం వల్ల, సర్పంచి సంపన్నుడే కాదు, రాజకీయ చతురుడూ కావటం వల్ల, గడ్డి గురించి కాక, దుడ్డు గురించి మాట్లాడుకొన్నారు వాళ్ళు. వడ్డీ రేట్లు తగ్గటం, బేంకులు ఋణాలు ఇవ్వటం, తనఖా సొమ్ము, సొత్తు, పొలం పుత్రా బేంకులు జమ చేసుకోవటం, కోపరేటివ్ బేంకుల్లో నిధుల కొరత, రైతులు కష్టాలు పడటం చర్చించారు.

ఆపైన వాళ్ళ మాటలు రాజకీయాలవైపు సాగాయి. రైతుల ఆకలిచావులు, అప్పుల చావులు, కరెంటు కోతలు, వానలు, కరువులు చర్చించారు. వై.యస్. రాజశేఖర్‌రెడ్డి ఫ్రీ కరెంటు ఇవ్వటం కుదరదని చంద్రబాబు నాయుడు విమర్శించటం వాళ్ళ మాటల్లో వినవచ్చింది. కొందరు కాంగ్రెసు పక్షాన, కొందరు తెలుగుదేశం పక్షాన మాట్లాడుతున్నారు. కానీ అంతమంది గుంపులో కమ్యూనిస్టులున్నా ఎవరూ ఏమీ మాట్లాడకుండా ఊరికే ఉన్నారు.

ఎండ వేడెక్కినట్లే మాటలు కూడా చురుక్కుమనిపిస్తున్నాయి. ఆ మాటల వేడి తగ్గాలని "వద్దప్పా...! వొద్దు సారూ!" అన్నాడు నడిపాయప్ప.

"పోలే" అన్నారెవరో.

"వొద్దు సారూ! ఊరికి మంచిది కాదు!", "వాల్లు వాల్లు కుశాలే! మజ్జలో రైతులకే సావు! ఎద్దులు కుమ్ముకుంటే లేగలు జావ్వా? వొద్దు సాంవి" అని విన్నవించాడు నడిపాయప్ప.

"పోలే! నీకేంవెరిక?" అని ఎవరో కసిరారు.

"ఎవురి పాపోడైతే గాంగా యేంది? మంచి మాటే చెప్పినాడు" అని నడిపాయప్పకు అండగా మాట్లాడాడు రైతు.

ఆర్థిక వ్యవస్థలోని అవస్థలు వాళ్ళకు మూలమట్టంగా తెలిసినట్లుంది. మాట్లాడుతూనే ఉన్నారు. ఎవరో అడిగితే చెప్పాడు సేద్దెగాడు, 'పైకి పోసుకొంటున్నాడు' అని.

# తెలంగాణకే తలమానికం అపర్ణ ENT హాస్పిటల్







**Dr. Ekanadham.M**
M.B.B.s., D.L.O.M.S.(Osm)
E.N.T. Specialists

**Dr. Sudeep.M**
M.B.B.S., D.N.B., D.L.O.
Diplomate of National Board

**Dr. (Mrs.) Prashanti.M**
M.B.B.S., D.L.O. (Osm)
(Allergologist)

ముక్కు, చెవి, గొంతు మానవునికి కలిగిన పంచ జ్ఞానేంద్రియాలలో మూడు. వీటిలో సకల నిర్ధారణ, నివారణ మరియు వైద్యమునకు ఎన్నో అత్యాధునిక పరికరములు మరియు వైద్య విధానములు కలవు. తరచు జలుబు రావడం, తలనొప్పి, చెవినొప్పి, గొంతునొప్పి, ముక్కులో రక్తము కారడం, మింగుడు పడకపోవడం, మాట మార్పు ఎన్నో చూస్తూనే ఉన్నాము. వీటిని నిర్లక్ష్యం చేస్తే ఎంతో మూల్యం చెల్లించుకోవాల్సివస్తుంది.

**ముక్కుకు సంబంధించిన వ్యాధులు:**

**సైనసైటిస్:** చాలా సామాన్యమైన జబ్బు. పూర్వమైతే ముక్కు పంక్చర్స్ చేసి ముక్కు కడిగేవారు. ఇప్పుడు ఎండోస్కోపులో ఎఫ్ఇఎస్ఎస్ అనే ఆపరేషన్లు చేస్తున్నారు. వివిధ రకములైన ఎండోస్కోపులే గాక పవర్డ్ మిషన్సులో, టి.వి.లో చూసుకుంటూ ఆపరేషన్లు జరుగుతున్నాయి. ముక్కులో నుండి మెదడుకు సంబంధించిన వ్యాధులు కూడా ఎండోస్కోపుతో చేయవచ్చు. కంటి కొలుకు నుండి నీరు కారడం, చీము కారడం కూడా ముక్కులో నుండి డి.సి.ఆర్. ఆపరేషన్లు చేయవచ్చును. ముక్కుకు దెబ్బలు తగిలినా, వికారంగా అయినప్పుడు సరిచేయడం జరుగుతుంది.

**అలర్జీ చాలా ఎక్కువైపోతున్నది:** వాతావరణ కాలుష్యం, ఆహారంలో వైవిధ్యం వలన తుమ్ముల జబ్బు వస్తుంది. తుమ్ములు మరియు ఆస్తమా వస్తున్నాయి. దీని నివారణ కొరకు అలర్జీ క్లినిక్ తెలంగాణాలోనే మొట్టమొదటిగా ఉన్నది. చర్మం మీద ఇంజక్షన్లు ఇచ్చి ఏ వస్తువు పడటం లేదో నిర్ధారించగలరు.

**చెవి:** చెవి నొప్పి వస్తే సకాలంలో చూపించుకుంటే అత్యంత బాధాకరమైన సి.ఎస్.ఒ.ఎమ్. అనే జబ్బును నివారించవచ్చును. చెవిలో చీము కారడానికి కారణం చెవిలో కర్ణభేరికి రంధ్రము పడటం. దానివలన వినికిడి తక్కువ అవడంగాక మెదడు మరియు పరిసర ప్రాంతాలకు జబ్బు విస్తరించి ఉన్నది. అధునికమైన మైక్రోస్కోపు, ఎండోస్కోపుల ద్వారా మైక్రో సర్జరీ అవసరము వాటికి అనుబంధంగా వినికి పరీక్షలు కంప్యూటర్ పరీక్షలు నిర్వహించాలి. ఒక్కొక్కసారి చెవిలో సులభంగా ట్యూబులు వేయవచ్చు లేదా లేజర్ ద్వారా చికిత్స చేయవచ్చు. తల తిరగటం, పడిపోవటానికి వెర్టిగో సరియైన పరీక్షలు చేసి వైద్యం చేయాలి.

**గొంతు:** టాన్సిల్ మరియు ముక్కు వెనుక పెరిగే అడినాయిడ్స్ సర్వసామాన్యమైన జబ్బు. పిల్లల్లో ఎక్కువగా వస్తుంది. లేజర్ పరికరముతో సులభముగా ఆపరేషన్ చేయవచ్చు. గొంతు బొంగురుపోవుట వంటి వ్యాధులకు లేజర్ చికిత్స అత్యంత ఆధునికమైనది. క్యాన్సర్ భయంకరమైనది. చెవి, ముక్కు, గొంతు మరియు మెడ ప్రాంతంలోనే 30% వరకు వస్తుంది. లేత సమయంలో గుర్తించితే లేజర్‌తో చికిత్స చేయడం అంత సులభము. లేజర్ ట్రీట్‌మెంట్ ద్వారా నొప్పి తెలియకుండా రక్తం పోకుండా, కుట్లు అవసరంలేకుండా గాయం మచ్చ ఏర్పడకుండా ఆపరేషన్ చేసే వైద్య పరికరం. తెలంగాణాలోనే ఏకైక హాస్పిటల్‌లో మా అపర్ణ ఇ.ఎన్.టి. హాస్పిటల్ అని సగర్వంగా తెలియజేస్తున్నాం.

అనుభవజ్ఞులైన, అత్యుత్తమైన విద్యార్హతలు గల డాక్టర్ల సముదాయం, అత్యాధునికమైన, విలువైన, విదేశాల నుండి దిగుమతి చేసుకున్న పరికరములతో అపర్ణ ఇ.ఎన్.టి. హాస్పిటల్ మీ ముందుంది.

# అపర్ణ ENT హాస్పిటల్

**# 2-5-680, సుబేదారి, హన్మకొండ. ఫోన్: 2579099.**

ఇక సర్పంచి వస్తాడు.

అందరూ ఇంటి గేటు ఎప్పుడు తెరుచుకొంటుందా అని ఎదురు చూస్తున్నారు.

"ఓట్లు అంటే పొద్దుగాలే వొచ్చి కాల్లకాడ కూచుండి- 'అమ్మా, అయ్యా, అప్పా, సామి, బావా, మావా, అత్తా, పాపా' అని వరసలు గలిపి అడుక్కొంటా వుంటాడుగాని, ఇంత మంది ముంగిలి తొక్కితే ఉలకడు, పలకడు- యావనుకొంటునట్లు? "

"అబుడు పని ఆయప్పది, ఇబుడు పని నీది. పని ఉన్నవానికి పడిగాపులు తప్పవు" గోడవార నుంచి వినవచ్చింది.

"అధికారం చేతికొత్తే యానాకొడుకు మాటిన్డు" ధర్మసూక్ష్మం వివరించాడో రైతు.

ఉరవకొండ నుంచి చందా నారాయణప్ప వచ్చి ఆ రోజుల్లో ఎవరికి ఓటు వేద్దామంటే వాళ్ళకు వేయటమే! నీలం సంజీవరెడ్డి రాష్ట్రపతి అయితే "మనోడే మొనగాడు" అని ఉత్సవం చేసుకొన్నారు. ఆ రోజుల్లో వాళ్ళు పూర్తి కాంగ్రేసు ఓటర్లు.

కాలం మారి కుర్రకారులో యన్.టి.రామారావు జ్వరం పట్టుకొంది. రాముడుగా, కృష్ణుడుగా, కర్ణుడుగా, రావణుడుగా, దుర్యోధనుడుగా, భీష్ముడుగా రామారావు భారత, రామాయణాలను వాళ్ల కళ్ళలో నిలిపాడు. ఫొటోలు ఇళ్ళలో నిలిపాడు.

రామారావు సినిమాలు వదలిపెట్టి, రాజకీయాలు మొదలుపెట్టి, తెలుగుదేశం పార్టీ పెట్టేసరికి పోలోమని అందరూ తెలుగుదేశం ఓటర్లు అయిపోయారు.

కమ్మవాళ్ళు, బలిజవాళ్ళు, మాదిగవాళ్ళు రామారావును ఆరాధించసాగారు. కాంగ్రెసు కాకపోతే కమ్యూనిస్టులుగా రెడ్లు మారారు.

మాదిగలు మొదట్లో గాంధీ భక్తులు. ఆపైన నక్సలైటు అన్నలు. రామారావు దెబ్బతో ఆయనవైపే. నక్సలైట్లు దేశభక్తులని ఆయన అనడంతో తెలుగుదేశం వైపు మొగ్గు చూపారు. ఈ మొగ్గు చంద్రబాబునాయుడు యస్సీ వర్గీకరణమంటూ మాదిగలకు మేలు చేయటంతో స్థిరపడింది.

మాదిగలు కాంగ్రెసుకే ఓటు వేస్తారని కాంగ్రెసువాళ్ళు, మాకే అని తెలుగుదేశం వాళ్ళు, మాకు మాత్రమే అని కమ్యూనిస్టులు అనుకొంటూ ఉండేవాళ్ళు. మాదిగల్లో ఎవరిని ఓటు గురించి అడిగినా ఓబులేసునే అడగమనేవాళ్ళు. రాముని ఎవరు ఓటు అడిగినా 'మా వాళ్ళతో మాటలాడి సెబుతానప్పా' అనేవాడు. మాదిగ్గేరి ఓట్లు రావాలంటే రాముని అడగాలనే పరిస్థితి ఏర్పడింది.

రాముడు నలుగురితో కలసిమెలసి ఉండేవాడు. ఎవరు ఏం చెప్పినా వినేవాడు. ఎవరిని పిలిచినా వాళ్ళు వచ్చేవాళ్ళు. పరిస్థితులు తనకు తెలిసినంతలో వివరించి చెప్పేవాడు. వాళ్ళు ఆలకించి "నీ మాట మేం కాదనేదే ముండాదప్పా" అనేవాళ్ళు.

తెలుగుదేశం సర్పంచి ఇంటికి మోతుబరి రైతులు రాలేదు. కాంగ్రెసువాళ్ళు వచ్చారు కానీ అందులో ఘనాపాఠీలు రాలేదు. కమ్యూనిస్టులు వచ్చారు.

సర్పంచి, ఇంటి తలుపులు బార్లా తెరుచుకొని వెలుపలికి వచ్చి, అందరికీ రెండు చేతులెత్తి దండం పెట్టి, పేరు పేరునా పలకరించి వరంగా అరుగుమీద నలుగురి మధ్య కూర్చున్నాడు. అందరూ మంచు ముక్కల్లా కరగిపోయారు. 'యాలవచ్చినారు'? అన్నట్లుగా సర్పంచి చూస్తే 'యింకేల' అన్నట్లుగా వీళ్ళు చూసినారు.

"రేపొద్దుటే రెండు లారీల సర్కారు గడ్డి మనూరు వస్తది"

అందరూ తలూపారు.

"గడ్డి ఈతూరి ఊరికే ఈరప్పా! లెక్క! లెక్క గట్టాల్ల"

అందరూ వింటూ ఉన్నారు.

"కరువు గాలం, వానల్లేవు. లెక్క లేదు. అప్పులురావు. పెద్ద తిప్పలే!" రైతు చెప్పాడు.

"పంచాయితీ సొమ్ముకట్టి, గడ్డి రైతులంద

రికీ పంచితే మేలుసుడీ!" వృద్ధ రైతు సూచించాడు.

"ఔదప్పా" అన్నాడు సర్పంచి. "మేలు మాటే" అని జత కలిపాడు. "లెక్కేది? " అనీ అన్నాడు.

"లెక్కలేదు" అని తేల్చాడు. "అప్పుల్లో పంచాయితీ" అన్నాడు. "ఇగ అప్పులు పుట్టవు" అని 'మడికా కత మడిసి పోవాల్ల" అన్నాడు.

"మడి నువ్వే యేదో మార్గం చెప్పాల్ల"

"యాడుంది? లెక్కేడుంది? కుదరతదా? కుదర్దు"

ఎవరూ ఏమీ అనలేదు.

పంచాయితీ డబ్బుతో కొని, గడ్డిని రైతులందరికీ పంచే పరిస్థితి లేదని ఒక్కొక్కరే వెళ్ళిపోసాగారు.

మిగిలిన వాళ్ళలో అయిదారుగురు సొమ్ము చెల్లించి వరి గడ్డి కొనటానికి సిద్ధంగా ఉన్నారు.

"రొండూ నాకే, దుడ్డుంది"అన్నాడో రైతు.

"వొక్కల్లకే రొండా? అదెట్టా ఈలవుతాదప్పా" అన్నాడు మరో రైతు.

"అదీ రైటైనమాట" అన్నాడు సర్పంచి. రెండు లారీలు తనకే కావాలనే రైతుది వైరి వర్గం. వైరి అని గడ్డి ఇవ్వటం కుదరదనలేడు సర్పంచి.

"నలుగురికీ చెందేది సబబు" అన్నాడు కమ్యూనిస్టు యువకుడు.

"అడిగే వాల్లందరకు సరిసమానంగా పంచేదే నేయం!" అన్నాడు కమ్యూనిస్టు రైతు. సర్పంచి కమ్యూనిస్టుల్ని కాదనలేడు.

**మాదిగ్గేరి ఓట్లు సర్పంచి కళ్ళలో మెదులుతున్నాయి. ఎన్నికలు ఎప్పుడైనా, ఓట్లు పోగొట్టుకోకుండా చూసుకోవటం సర్పంచికి అవసరం**

నడిపాయప్ప అసహనంగా కదిలాడు. అది గమనించిన సర్పంచి "మీ యప్ప రాలేదా" అన్నాడు.

"నువ్వేవనదలచినావు? " అని అడిగాడు.

"మీకన్నీ తెలుసు దేవర. నేను మీకు చెప్పేదానికవుతాదేమప్ప? సాంవీ నేయంసేయండి. సాంవీ అందురుకూ నువ్వు గావల్ల దేవర! నీకు అందురూ గావల్ల. నేయం సెప్పు సర్పంచి" అన్నాడు నడిపాయప్ప.

"సణుగుతావేందిరా సన్నాసి, నీకేది నేయమో సెప్పు యిందాం"

నడిపాయప్ప అసహనంగా కదిలాడు.

"నడిపోబులేసూ! నీ నోటి మాట నోటిలోని ఉంటే మాకేం దెలుస్తాదప్పా? అది మాకేం ఎరికా? మాకు తెలసాల్నా వొద్దా? "

"తెలసాల్ల సాంవి"

"మడి సెప్పు"

"సర్కారు గడ్డి మొత్తం యావత్తు మీరే జమురుకుంటే, మాకేందుంది నోట మట్టే"!

"గడ్డంటే మాటలా? లెక్కగావల్ల! లెక్కప్పా! లెక్క!"

"యాదోలే సామి, మాకు కూడక యంతో కొంత లెక్క ఉండకపోతదా దేవర"

"లెక్క ఉంటే సెప్పు! నీ మాట నలుగురూ ఇనాల్లగందా!"

మాదిగ్గేరి ఓట్లు సర్పంచి కళ్ళలో మెదులుతున్నాయి. ఎన్నికలు ఎప్పుడైనా, ఓట్లు పోగొట్టుకోకూడదు. తనవాళ్ళ ఓట్లు తనకు గేరంటీ. ఎటు పోతాయో తెలియని మాదిగ్గేరి ఓట్లు తనకు దక్కేలా చూసుకోవటం సర్పంచికి అవసరం.

"సోఁవీ! ఊరికెన్ని గడపలో - మాఁదిగ్గేరి గడపలు అంతకెక్కువే కాదేం సాఁవి!"

"నిజమే" అన్నాడు సర్పంచి.

"ఊరికో లారీ,గేరికోలారీ నేయం దేవరా!"

ఎవరూ మాట్లడలేరు. సర్పంచి ఎవరు ఏమి అంటారో విందామని మౌనంగా ఉన్నారు. నడిపోబులేసు అసహనంగా కదులుతూ ఉన్నాడు.

ఎవరూ ఏమీ అనలేకపోవడంతో సర్పంచి "నడిపోబులేసూ!" అన్నాడు

"దేవరా" అని పలికాడు.

"నువ్వనేది నేయమే కదేంరా"

"నేయమే దేవరా!"

"సిన్న సిక్కుందిరా నడిపోబులేసూ" అని సర్పంచి చిన్న మెలిక వేశాడు.

"తమ దయ దేవరా"

"ఊరి గడప, గేరి గడప సరిసమానఁవే గాని, ఊరికి పశువులెక్కువ, గేరికి పశువులు తక్కువ. కాదేంరా? "

"ఔదప్పా దేవరా. కాదంటినేమప్పా. నీ మాట నిజమే సాఁవి. కానీ దేవరా! ఊరి పసులకు ఇంకా మేత, వాములుండాయి సాఁవీ. గేరి పసులకి మేత లేదు, వాములేవు. యీపొద్దో యాపొద్దో వాటిల్ని పూడ సాల్ల!"

"నిజమే నడిపోబులేసు! ఊరి వారికంద రికీ పశువులుండాయి. గేరి వారందరుకూ పశువుల్లేవు కదేమప్పయ? "

"ఈ గడ్డి ఉంటే సరి. లేకుంటే గేరిలో ఉన్న పశువులన్నీ సస్తే వల్లకాటిలో పూడ సాల్ల. ఈ గడ్డి లేకపోయినా ఊరి గొడ్లు సావ్వు!"

"అట్టా వచ్చినావా? " అన్నాడు సర్పంచి. ఊరివాళ్ళ పక్షాన వాదించాడు. ఊరివాళ్ళు సంతోషించారు. తలలూపారు.

"దేవరా మా గేరిలో పశువుల మంద లకేం కొదవలేదు సాఁవీ. పశువులే కదా మా పేణం, బతుకు, ఆధారం"

"నిజమే లేరబ్బా" అంగీకరించాడు సర్పంచి.

"సిత్తం దేవరా!"

"నడిపోబులేసూ! వరి గడ్డి తగాదాలు రాకుండా గేరిలో కావసినోల్లకు పంచు తావా? "

"పంచుతాను దేవరా! దుడ్డు కట్టినోల్లకు అందరకూ ఇచ్చేదే!"

"లెక్క కట్టాల్ల!"

"కాదంటినా దేవరా? "

"రేపే లారీలు వచ్చేది"

"రానీ సాఁవీ!"

"లెక్కా? "

"కానీ దేవరా!"

రేపు వచ్చే రెండు లారీల సర్కారు వరి గడ్డి ఒకటి ఊరికి, మరొకటి గేరికి చేర తాయి.

మాదిగ్గేరిలో గడ్డి పంపకం రాఁవుడిం టిలో జరుగుతుంది.

గేరిలో పసువులు తక్కువ. దుడ్డు కట్టగ లవాళ్ళు తక్కువ.

అందువల్ల సొమ్ము తెచ్చి భాగం అడిగిన వాళ్ళకు ఇవ్వగా చాలా భాగం తమకు మిగులుతుందని నడిపాయప్పకు బాగా తెలుసు.

మరో వారంలో మరి రెండు లారీలు వరి గడ్డితో రావచ్చునని, ఆ రెండూ ఊరివాళ్ళకే అని చెప్పి సర్పంచి నడిపాయప్పను ఒప్పించాడు. ఆ ఏర్పాటుతో ఊరివాళ్ళలో సంతోషం కలిగింది. గేరినీ, ఊరినీ సంతృప్తి పరచి తన ఓటు బ్యాంకులు భద్రం చేసుకొన్నాడు సర్పంచి.

నడిపాయప్ప మాదిగ్గేరికి వచ్చి జరిగిన ఏర్పాటు వివరించాడు. అన్నదమ్ములు, గేరి వాళ్ళు సంతోషించారు.

రాఁవుడు సంతోషించాడు, అయినా ముఖం మాడ్చుకొన్నాడు.

"ఇది బాగానే ఉండాదిరా నడిపోడా!

బాగా సర్దుబాటు చేసుకొని వచ్చినావు. మేలే! నా బయిం నాది! పోయినేటికి, మల్ల ఈ యేటికి యావవుతాదోనని చింత"

తండ్రి ముఖం చూస్తుంటే నలుగురికీ గతం గుర్తుకు వచ్చింది.




అనంతపురం రైల్వే స్టేషన్‌లో నాలుగు బ్రాడ్‌గేజ్ ట్రాకులు, రెండు మీటర్ గేజ్ ట్రాకులు ఉన్నాయి. తూర్పున బి.జి. స్టేషన్, పడమట యం.జి. స్టేషన్ ఉన్నాయి. రైళ్ళు రాకపోకలు ఉత్తర దక్షిణాలలో ఉన్నాయి. ఉత్తరాన కల్లూరు, గుత్తి, గుంతకల్లున్నాయి. దక్షిణాన ధర్మవరం మీదుగా తిరుపతి, బెంగుళూరు లైన్లున్నాయి.

బి.జి. నాలుగు ట్రాకుల్లో రెండు రైళ్ళకు, రెండు గూడ్సుకు ఉపయోగిస్తున్నారు. బి.జి, యం.జి. ట్రాకుల మధ్య గూడ్సు షెడ్డు ఉంది. అక్కడికి ఉత్తరం నుంచే రాకపోకలు. ఎక్కువగా వచ్చేది పోయేది లారీలే! గూడ్సు షెడ్డులో గడ్డి నిలవ వుండదు. ఎప్పుడయినా ఎరువుల మూటలు నిలవ ఉంటాయి.

షెడ్డు నుంచి ఉత్తరానికి బయలెల్లిన లారీలు ఫర్లాంగు దూరం పోయి, పడమటికి తిరిగితే కొత్తూరు, తూర్పుకు తిరిగితే పాతూరు.

షెడ్డు చుట్టూ లారీలు బెల్లం చుట్టూ ఈగల్లాగా, సూర్యుడి చుట్టూ కిరణాలు లాగా, నాయకుని చుట్టూ అనుచర గణం లాగా, గుడి చుట్టూ భక్తుల్లాగా తీరని పనిలో తిరుగుతూ, హారన్లు కొట్టుకుంటూ అరుస్తూ అల్లరి చేస్తున్నాయి.

ఉదయం ఎనిమిది గంటలు. గూడ్సు రాలేదు. సర్కారు గడ్డి తెచ్చే గూడ్సు బండి గార్లదిన్నెలో ఆగి ఉందని సమాచారం.

లారీ డ్రైవరుకో, యజమానికో రూట్ పర్మిట్ బిల్లు పత్రం, ఇతర కాగితాలు ఇచ్చే పశువుల సంవర్ధకశాఖ ప్రభుత్వ ఉద్యోగులు వచ్చి పూలచెట్టు పక్కన నీడలో కుర్చీలు, టేబుళ్ళు వేసుకొని సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు గూడ్సు రాక, చేసే పనిలేక, కాఫీలు చప్పరిస్తూ కూర్చున్నారు.

గూడ్సు వస్తే దాని మూతి పగలగొట్టి, ముక్కుపిండి, గడ్డి వసూలు చేసుకొనే హమాలీలు రడీ, స్టడీ, గో అన్నట్లున్నారు. నిక్కరుకానీ, డ్రాయరు కానీ వేసుకుని దాని మీద అడ్డపంచలు కట్టి, పైకి మడిచి, బొడ్లో చెక్కుకున్నారు. ఎవరి పయీ మీద అంగీ లేదు. అందరి శరీరాలు సర్వసాధారణంగా బొగ్గు రంగులో కానీ, కాఫీ రంగులో కానీ ఉన్నాయి. ఎర్రగా, తెల్లగా లేవు.

పొద్దు పొడిచి బారెడెక్కింది. పెద్ద స్టేషన్ మీదినుంచి చిన్న స్టేషన్ మీదికి సూర్యుడు తన కిరణాల చర్నాకోలలు విదిలిస్తే మాంత్రికుడి మంత్రదండంలో నుంచి పావురం బయలెల్లి రెక్కలల్లార్చినట్లు వెలుతురు పరుచుకొంటూ ఉంది.

డ్రాయరో, నిక్కరో కనిపించేటట్టు పైకి ఎగ్గట్టిన అడ్డపంచె పిండిన బట్టలాగా లుంగ చుట్టుకొనిపోతే, హమాలీలు ఉత్తబిత్తలుగా ఉన్నట్లున్నారు. ఉదయం ఎండే అయిన సూర్యుడి ప్రతాపానికేం కొదవలేదు. పయి సుర సురలాడటమే కాదు, చిరుచెమట ప్రతి వెంట్రుక పాదులోంచి తలపైకెత్తి చుట్టూ ఉన్న పరిసరాల, పట్టణాల, ప్రపంచాల పరిస్థితులు పరికించటానికి, శ్రమైక జీవన సౌందర్యం తిలకించి, అందంగా మెరిసిపోవటానికి చూస్తూ ఉంది. తల్లి తెచ్చే మేత



కోసం తేపతేపకు గూటి లోపలి నుంచి వెలు పలికి చూచే పసి లేత చిన్న పిచిక పిల్ల ల్లాగా వెంట్రుకల పాదుల కన్నాల్లోంచి చెమట చుక్కలు నిక్కినిక్కి చూస్తున్నాయి.

హమాలీలు మొత్తం పద్నాలుగు ముఠా లుగా ఏర్పడ్డారు. వీళ్ళందరికి పెద్దదిక్కు ముఠా మేస్త్రి. ఒక్కొక్క ముఠాలో ఏడుగురు హమాలీలుంటారు. వాళ్ళలో ఒకడు ఒక చిన్న మేస్త్రీ. అతను లోడింగు, అన్‌లోడింగు పరిస్థితులు, అవసరాలు, మెలకువలు, సులవు సూత్రాలు చెబుతూ పనులు పూర్తి చేయిస్తూ ఉంటాడు.

ఈ మేస్త్రీలకు మేస్త్రే ముఠామేస్త్రి. వానలు పడి నిండితే బుక్కరాయ సముద్రం ఎంతుంటుందో దాదాపు అంతుంటుంది అతడి కడుపు. నిండు నెలల ఆడమనుషులు



ముగ్గుర్ని కలేసి కట్టేసినా అంత లావుం డరు. కదలటం, లేవటం, నడవటం, అతడికి కష్టమని ఎవ్వరైనా అనుకొంటారు కానీ, అత డికేమీ ఇబ్బంది లేదు.

ముఠామేస్త్రీ గూడ్సు షెడ్డు గోడకు వీపు మోటించి కూర్చున్నాడు. ఏం సమస్యలు వచ్చినా నిమిషాల మీద పరిష్కరిస్తాడు. చాలా తెలివైనవాడు. గొప్ప మాటకారి. పది మంది పిల్లలు, ముగ్గురు భార్యలు. అంతా ఒకటే పొయ్యి. కుయ్యిమంటానికి వీలు లేదు. కిక్కురుమంటే అంతే సంగతులు. బండెడు సంసారం. సులువుగా లాక్కొస్తు న్నాడు. నల్లేరు మీద బండి నడక.

సాధారణంగా సర్కారు గడ్డితో గూడ్సు వాగన్లు నలభై రెండు ఒక్క ఫార్మేషన్‌లో వస్తాయి. పద్నాలుగు ముఠాలు ఒకదాని తరువాత ఒకటి చొప్పున మొత్తం నలభై రెండు వాగన్ల గడ్డి రెండు గంటల్లో అన్‌లో డింగు, లోడింగు చేస్తారు. దించటానికి వాగెనుకు రూ. 250/-, ఎత్తటానికి రూ. 150/- కూలీ. ఒక ముఠా మూడు వాగన్లు దిగుమతి, లారీల కెగుమతి చేస్తే రూ. 1200/- వస్తుంది. ఆరుగురు పంచుకుంటే ఒక్కొక్కరికి రూ. 200/-, చిన్న మేస్త్రీకి రూ. 250/- ప్రత్యేకం. ముఠామేస్త్రీకి రూ. 500/- రొక్కం.

ఎవరికి ఎంత పంచగా ఇది వీళ్ళకు మిగు లుతోంది, అది స్పష్టం కాదు. డిపార్టుమెం టుకెంతో, లోకల్ పోలీసులకెంతో, రైల్వే పోలీసులకెంతో, స్టేషన్ మేష్టరుకెంతో, ఎవ రెవరికి ఎంతెంతో ముఠామేస్త్రీకి తెలుసు. అందరికీ తెలుసు. ఎవరూ ఎవరికీ చెప్పరు. నోరెత్తరు. చెవి ఒగ్గరు. గాంధీ సూత్రం, వినకు, అనకు, కనకు. ప్రశ్నలుండవు. జవా బులుండవు. అంతా చిదంబర రహస్యం. సత్‌చిత్ ఆనందం.

ముఠామేస్త్రీ మాత్రం నీతిమంతుడు. ఎంత వస్తుంది, ఎవరికెంత పోతుంది, ఎంత మిగులుతుంది. తనకెంత, చిన్నమేస్త్రీ లకెంత, అంతా సక్రమంగా పంపిణీ చేస్తా డు. ఎవరు ఏమీ ప్రశ్నించరు, ప్రశ్నించారో పనిలో ఉండరు. పంపకాలు నీతి నిజాయి తీగా సాగిపోతుంటాయి. ఎవరి కూలీ వాళ్ళు, ఎవరి వాటా వాళ్ళు తీసుకొని ఏమీ ఎరగనట్లు వెళ్ళిపోతారు.

## 6

గడ్డి గూడ్సు రాకకోసం ఎదురుతెన్నులు చూస్తున్న హమాలీల దగ్గరకు యువకుడు వచ్చి కూలిపని చేస్తానన్నాడు. గడ్డి మోపు లు దించుతాను, ఎత్తుతాను అన్నాడు. తమ ది దళిత కుటుంబమే అన్నాడు. చిన్నప్పటి నుంచి కాయకష్టం అలవాటేనన్నాడు. యు వకుడి ముఖంలోని పసితనం ఇంకా ప్రశాం

తంగానే ఉంది. చదువుకొంటున్నవాడిలాగా ఉన్నాడు. హమాలీలు ముఠామేస్త్రీని కలుసుకోమన్నారు. వెళ్ళి అతడి ఎదుట చేతులు కట్టుకొని నిలబడ్డాడు యువకుడు, ప్రిన్సిపాల్ ఎదుట 'సారీ' చెప్పే విద్యార్థి లాగా.

ముఠామేస్త్రీ యువకుణ్ణి ఎగాదిగా చూశాడు. తన కొడుకు కంటే పెద్దగా పెద్దవాడేమీ కాదు. జాలి కలిగింది. తన కొడుకు చదువుకోవటం లేదు. పెద్దవాడే అలా ఉంటే, పిల్లలు మాత్రం మాట వింటారా? వినరు. వినటం లేదు. వాళ్ళు స్కూళ్ళకు పోతున్నా, చదువుకుంటున్నట్లు చెప్పలేం. విద్యార్థిలాగా ఉన్న యువకుడి మీద ముఠామేస్త్రీకి ఇష్టం లాంటిది కలిగింది. అతనికి ఇష్టమైతే యువకుడికి కలిగే లాభం, హమాలీ కాగలగటం. చదువు పరారవుతుంది. చదువుకొంటున్నాడని సంతోషించే ముఠామేస్త్రీ సహాయం వల్ల చదువు చట్టుబండలవుతుంది.

"యాం జదివినావు? "

"యింటరు!"

"ఇబుడేం జదువుతున్యావు? "

"లే"

"యాలా? "

"సదివించేకి కాదు"

తాను చదివిస్తే చదువుకొంటాడేమో అనుకొన్నాడు. కడుపున పుట్టినోళ్ళు చదువు సంధ్యలు సక్రమంగా లేకుండా ఉంటే, చదువుకొందామనుకొన్న తన కోరిక తీరక, చదువబ్బకపోవటం వల్ల, చదువుకొంటున్న యువకుడిపట్ల అభిమానం వల్ల చదివిద్దామనుకొన్నాడు కానీ, గంపెడు పిల్లలున్న తాను అతన్ని చదివించగలడా? చదివించలేడు. కానీ చదివిద్దామనుకోవటం మంచి మనస్సుకు నిదర్శనం. చదివించలేకపోవటం ఆచరణకు సాధ్యం కాని, చాలా ఆలోచనల వరుసలో ఇదీ ఒకటి.

హమాలీగా తీసుకొంటే చదువుండదు. బరువులు మోసి బండబారిపోతాడు. ఎంతో కొంత చదువుంది కాబట్టి మనిషి అవసరమే! తెలివుంది కాబట్టి తిరగబడితే కష్టమే! ఈ దుడ్డు వాళ్ళకెందుకివ్వాలి, వీళ్ళకెందుకివ్వాలి అంటే తలనొప్పి.

చివరకు ముఠామేస్త్రి 'అప్పయ్యా, అది సరేగానీ, యియ్యాలగాదు' అని, ఆలోచించి 'మల్లీ' అన్నాడు. తృప్తిలేదు. 'యీలుగాదు' అన్నాడు. అంటే అర్థం అతనికీ తెలుసు. 'పోయిరా' అన్నాడు.

పని లేదన్నాడని యువకుడికి అర్థమయింది. కానీ యువకుడు వెళ్ళిపోలేదు. రోజూ హమాలీలుగా పనిచేస్తామని వచ్చేవాళ్ళకు కొదవలేదు. వాళ్ళు రైలు ప్రయాణికుల సామాన్లు మోస్తే లైసెన్సు కూలీలు వాళ్లను తిడతారు, కొడతారు, నెడతారు. పనిలేక, ఆకలికి ఆగలేక, ఏంచేయాలో తోచక వీళ్ళు దొంగతనాలు చేయవచ్చు, హత్యలు చేయవచ్చు అభిమానం ఉంటే, ఆశయాలు ఉంటే, అవి అర్థమయితే, ఇష్టమయితే నక్సలైట్లు కావచ్చు పనిలేని, తిండిలేని, ఏంచేయాలో తెలియని యువకులు ఏం చేసినా దేశానికి, ప్రభుత్వానికి కష్టమే! పనిచేసే జనాన్ని, ఎలా వాడుకోవాలి, ఏం చేసుకోవాలి, శ్రమశక్తి సామర్థ్యం వ్యర్థమయిపోతే, పక్కతోవలు పడుతుంటే ప్రభుత్వం ఏం చేయాలి? మార్గం చూపాలి కదా! ఎంతకని మార్గాలు వెతకగలదు? దాని వనరులు ఏమాత్రం? పెరుగుతున్న జనాభాను ఎవరు నియంత్రించగలరు? ప్రభుత్వం మాత్రం ఏం చేస్తుంది? పరిమిత ప్రదేశంలో అపరిమిత జనంతో అవసరాలు- అవకాశాలు దృష్టితో సక్రమంగా ప్రభుత్వం ఏం చేయాలి? ఏం చేస్తుంది? జనాభా నియంత్రణ చేస్తామంటే ప్రభుత్వాలే కూలతాయి. తీరుబడిగా ఉన్న జనాలకు, ఏ వినోదం లేనివాళ్ళకు, సంసారమే వినోదమయిన వాళ్ళకు, సంతానం కలక్క చస్తుందా? కలుగుతుంది. కష్టాల సుడిగుండాలు జనాలను

చుట్టుకొంటాయి. సుడిగుండంలో పడ్డ యువకుడు, ముఠామేస్త్రీ ఆలోచనల చక్రాల కింద నలిగిపోసాగాడు.

సంవత్సరం పొడుగునా హమాలీలకు పని ఉండదు. చాలా రోజులు అందరికీ పని ఉండదు. కొన్ని రోజులు కొందరికి ఉండదు. చాలా తక్కువ రోజులే అందరికీ పని ఉంటుంది.

అందరికీ పని ఉన్ననాడు ముఠామేస్త్రీకి ఆనందం. పని తక్కువగా ఉన్ననాళ్ళలో రోజు మార్చి రోజు వాళ్ళు పనిచేసేటట్టు చూస్తాడు. పని లేనినాడు రాబోయే పని కోసం నిరీక్షిస్తూ ఉంటారు హమాలీలు.

ఎక్కువ మందయితే మజ్జిగ పలచన అవుతుంది. అసలే మజ్జిగ. పెరుగు కాదు, పాలు కాదు. ఇక ఆ మజ్జిగ కూడా పలచబడితే, బక్కజీవులు టపా కట్టేస్తారు. అందుకే కొత్తగా హమాలీలను చేర్చుకోవటం సాధ్యం కాదు. కానీ జాలీ, దయా, సానుభూతీ పాడూ పరదేశీ వచ్చి తలకాయ పురుగులు తొలిచే పేడ ముద్దలాగా అయిపోయి, కన్నీళ్ళు మిగులుతాయి.

హమాలీలలో ఎవరయినా చనిపోయినా, పనిచేయలేక జబ్బు వచ్చినా, పని ఇష్టం లేక మానేసినా, ఊరిడిసినా, కొత్త హమాలీలను పనిలోకి తీసుకోవచ్చు. ఆ పరిస్థితి కూడా అంత అనుకూలంగా ఉండదు. చనిపోయిన వాడికి కొడుకో, అల్లుడో ఉంటే వాళ్ళను కాదనటానికి ఉండదు. ముసలితనం వచ్చిన వాళ్ళు ఎవరయినా, తనవాళ్ళే అని యువకుల్ని తీసుకొని వచ్చి పనిలో పెట్టుకోమంటే తప్పదు. ఎవరయినా వద్దని మానేస్తే, వూరిడిస్తే ఇలాంటి యువకులను ముఠామేస్త్రీ పిలిపిస్తాడు. పని చూపిస్తాడు. వచ్చినవాళ్ళు వస్తారు. పనిలో చేరినవాళ్ళు చేరతారు.

ముఠామేస్త్రీని హమాలీలు చెడ్డవాడు అనకపోవచ్చు కానీ, మంచివాడని మాత్రం, అత్యవసరమయితే తప్ప, తప్పని సరయితే తప్ప, అనరు. ఎందుకంటే తన కులం వాళ్ళకే హమాలీగా చేరే అవకాశం ఇస్తాడనీ,


**రాష్ట్ర ఉత్తమ ఉద్యాన రైతు (APMIP ఉత్తమ రైతు)కు అభినందనలు**



గౌ॥ రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ డా॥ వై.ఎస్.రాజశేఖర్‌రెడ్డి గారి చేతుల మీదుగా రాష్ట్ర ఉత్తమ ఉద్యానరైతు అవార్డును అందుకొంటున్న ఎం. శివశంకర్‌రెడ్డి గారు, ప్రసన్నాయపల్లి (గ్రామం), రాప్తాడు (మం.), అనంతపురం (జిల్లా)

రాష్ట్ర స్థాయిలో రాష్ట్ర ఉత్తమ ఉద్యాన రైతుగా ఎంపికైన మా మిత్రుడు **ఎం.శివశంకర్‌రెడ్డి గారు** హైదరాబాద్ రవీంద్ర భారతిలో **గౌ॥ ముఖ్యమంత్రి శ్రీ డా॥ వై.ఎస్.రాజశేఖర్ రెడ్డి గారి** చేతుల మీదుగా అవార్డును అందుకొన్న సందర్భంగా వారికి మా అభినందనలు. వీరు ఇలాంటి అవార్డులు అనేకం అందుకోవాలని కోరుకుంటూ...

ఇట్లు

**బంధుమిత్రులు**
**శ్రేయోభిలాషులు**
**అనంతపురం జిల్లా**

లంచం తీసుకొంటాడనీ, ఇంట్లో పని చేయిం చుకొంటూ ఉంటాడనీ, అట్లాంటి వాడిని పనిలో పెట్టుకొంటాడనీ, ప్రత్యేకంగా ప్రచారం చేయకపోయినా లోపల్లోపల గుస గుసలుగా చెవులు కొరుక్కొంటారు. కానీ తమకేం కష్టం లేదు కాబట్టి, తమ కూలీ తమకు ఠంచనుగా ఇస్తాడు కాబట్టి, తమ పట్ల దయగా, జాలిగా ఉంటాడు కాబట్టి, వాళ్ళేమి వ్యతిరేకంగా మాట్లాడరు. కార ణాలు చెప్పటం కుదరదు కానీ, హమాలీ లలో నాలుగింట మూడొంతుల మంది దళి తులే.

ముఠామేస్త్రీ తాగడు, జూదమాడడు, చీట్లా డడు, మట్కా ఆడడు. ముగ్గురు భార్యల్ని కాక మరో పరాయి స్త్రీని కన్నెత్తి చూడడు. హమాలీలను కన్నబిడ్డల్లాగా చూసుకొం టాడు. ఎప్పుడయినా పయిసంత స్వార్థం చూపకపోడు. కానీ అది లెక్కలోకి రాదు.

అందరినీ సమంగా చూసుకుంటాడు. లేక పోతే కళ్లు మూసుకుంటాడు. అతనికున్న గొప్ప వరం నిద్ర. నిద్రపోయాడా, గురక పెట్టాడే! ఇంట్లో అతడి మాటయినా, పాట యినా, గురకయినా వినబడకపోతే, రైల్వేస్టే షన్‌లో గూడ్సు షెడ్డు మూలన వీపు మోటించి కూర్చున్నాడన్నమాటే. ముఠామేస్త్రీ లేచాడంటే రైలింజనే! లారీ ఇంజనే! టకటక లాడిస్తాడు. దడదడలాడిస్తాడు. పరిష్కారం కాని పని ఉంటే తప్ప లేవడు. లేచాడంటే హడలు!

ఎండకాలం మూణ్ణెల్లు, నాలుగేళ్ళ నుంచి ఎండు వరిగడ్డి వస్తూ ఉంది. వానలు పడే సమయంలో ఎరువులు వస్తాయి. అదీ రెండు మూడు నెలలు. మిగతా సమ యంలో చెదురుమదురుగా పనులుంటాయి. రెండూ మూడు నెలలు పనులే ఉండవు.

అనంతపురం నుంచి ఎగుమతి చేసే సరు కేమీ పెద్దగా ఉండదు. అంతా దిగుమతే! చీనికాయలు తొందరగా గమ్యం చేరాలి కాబట్టి లారీలే శరణ్యం. ఎప్పుడయినా సెన క్కాయలు, సెనగ నూనె ఎగుమతి అవు తాయి, అంతే.

గూడ్సు బళ్ళు నిండుగా వచ్చి ఖాళీగా వెళ్ళిపోతాయి. వేగన్లకు అనంతపురం ఆటవి డుపు. ఎండు వరిగడ్డి తెచ్చే గూడ్సు బళ్ళు అన్నీ కల్లూరు మీదగానే వస్తాయి. ఈ గడ్డి కాకినాడ, రాజమండ్రి, భీమవరం, ఏలూరు, గుడివాడ, బెజవాడ, గుంటూరు నుంచి వస్తుంది.

గడ్డి గూడ్సు కల్లూరు వచ్చిందని ఉప్పంద గానే ఖడేరావ్! అంతా రడీ! లైన్ రడీ! హమాలీలు రడీ! లారీలు రడీ!

గూడ్సు బండి అనంతపురంలో ఆగిందా, ఇక పని వేగానికి ఎవరూ తట్టుకోలేరు. ఒకటే దూకుడు! ఒకటే రద్దీ! ఒకటే కూతలు, మోతలు, అరుపులు, ఆర్భాటాలు.

గడ్డి కోసం నోరు తెరచి నిలబడ్డ ఎద్దు లాగా ఉన్న గూడ్సు షెడ్డు, ఆకలయి మేత మేస్తున్న కోడెదూడ లాగా ఉన్న గూడ్సు బండిని చూసి, ఉరుకులు, పరుగుల మీద ఉంటుంది స్టేషను.




లారీ ఓనర్లకు ఒక అసోసియేషన్ ఉంది. దానికి ప్రెసిడెంటు, సెక్రటరీ, ట్రెజరరు మెంబర్లు ఉన్నారు. కానీ సెక్రటరీ మాటే చెలామణి అవుతుంది. డిపార్టుమెంటులతో కానీ, లారీ అవసరాలున్న వాళ్ళతో కానీ, మాట్లాడేది, లారీలు ఏర్పాటు చేసేది సెక్రట

రీనే! ఆ పదవిది కీలకస్థానం. అతను అవునంటే ఔను, కాదంటే కాదు. అంతే! తిరుగులేదు. ఇవాళ సమ్మె అంటే సమ్మె! గో అంటే గో, నో అంటే నో.

చీనీకాయలు మద్రాసు తోలాలంటే లారీలు పంపుతాడు. కాంట్రాక్టర్లు లారీ కావాలంటే సెక్రటరీని అడగాలి. రాజకీయ పార్టీల ఊరేగింపులకు, మీటింగులకు, ఎలెక్షన్లకు, జమాబందికి, బందోబస్తుకు, కంకర, ఇటుక, సిమెంటు, కొండరాళ్ళు, ఇనుము, ఎరువులు, గడ్డి తోలటానికి, లారీలు అవసరం వస్తే సప్లై చేసేది సెక్రటరీయే.

ఎక్కడికెంత బాడిగ, ఎంత బత్తా, డ్రైవరుకెంత, క్లీనరుకెంత నిర్ణయించేది అతనే! ఆఫీసు ఖర్చుకింత, ఆర్టీవోకింత, లోకలోళ్ళకింత, రూటులో ఇంత, చెక్‌పోస్టులో ఇంత, సాదరుకింత సెక్రటరీ చెప్పిందే వేదం. చేసేదే చట్టం దానికొక పట్టిక, అందుకొక రూలు బుక్కు. గాలి పీల్చేవాళ్ళు- యజమానులు, డ్రైవర్లు, క్లీనర్లు, పెట్రోలు, డీజిలు పీల్చేవి- లారీలు, మినీ లారీలు, ట్రక్కులు, వేన్‌లు, సరుకు రవాణా చేసే వాహనాలు ఎవరైనా, ఏ వాహనమయినా సెక్రటరీ చెప్పినట్లు వినాలి.

మద్రాసు, బెంగుళూరు, గుంటూరు, బెజవాడ, హైదరాబాద్, బొంబాయి, కలకత్తా పోయిన లారీలు తిరిగి వచ్చేటప్పుడు లోడెత్తటానికి అనంతపురం ఆఫీసులో కూర్చుని అన్ని ఏర్పాట్లు చేస్తాడు. లారీలు ఎప్పుడు నిండుగా రాకపోకలు చేసే ఏర్పాట్లు నిక్కచ్చిగా చేస్తాడు, నిర్భయంగా అమలు చేస్తాడు.

అసోసియేషన్‌కు చెప్పకుండా ఎవరూ లోడెత్తరు, దించరు. ఒకవేళ ఎత్తితే, వెంటనే కబురు చేయాలి. చేయకపోతే సభ్యత్వం రద్దవుతుంది. సభ్యత్వం మనిషికి కాదు లారీకి. ఆ రూపంలో దాని యజమాని అయిన మనిషికి. సభ్యత్వం రద్దయితే మామూళ్ళ దగ్గర తబిశీళ్ళు వస్తాయి. లోడుల దగ్గర


HIV అనగానే ఎయిడ్స్ కాదు ఎయిడ్స్ అనగానే మరణం కాదు

ఎయిడ్స్ వ్యాధుల చికిత్స కొరకు సంప్రదించండి.



కె.ఆర్. పాలీక్లినిక్ & నర్సింగ్ హోమ్
గరల్స్‌హైస్కూలు ఎదురుగా,
మంగళగిరి,
గుంటూరుజిల్లా
Ph: 08645-236429

విజయనగర్‌కాలనీ
బ్లాక్ నెం: 11, ఫ్లాట్ నెం: 4
మాసబ్‌ట్యాంక్,
హైదరాబాద్
Ph: 040-32408648

డాక్టర్: కొతరపు రవీంద్ర M.B.B.S.,D.V.
Cell: 9848115017, 9346630017

నక్కలరోడ్
విజయవాడ-2, కృష్ణాజిల్లా
Ph: 0866- 2439200

చెడు అలవాట్లు మానండి ! ఎయిడ్స్ వ్యాధికి దూరంగా వుండండి!!

పేచీలు వస్తాయి. హమాలీల కాడా అగచాట్లు వస్తాయి.

లోడెత్తితే లారీ డీజిలో, పెట్రోలో తాగుతుందని లోకానికి తెలిసినట్టే, డ్రైవరు సారాయి తాగుతాడని కోర్టులో గీత మీద ఒట్టేసి చెప్పవచ్చు కానీ నోరు మెదపరాదు. అంత దూరం అంతసేపు లారీ తోలే డ్రైవరు కూడా మనిషే! తాగకపోతే చావడూ! అది సెక్రటరీ వాదన.

తాగినా డ్రైవరు లారీ నడపాలి కానీ, రోడ్డును వీరంగం ఆడించకూడదు. యముడికి ఏజంటు కాకూడదు. యాక్సిడెంటు చేయకూడదు. చేస్తే మనుషులను చంపకూడదు. కారు, స్కూటరు, సైకిల్ తప్పు వల్లే ప్రమాదం జరుగుతుంది కాని, లారీ డ్రైవరు తప్పువల్ల కాదు. అదీ రూలు. పోలీసులు, డాక్టర్లు, ఆర్డీవోలు సర్టిఫికెట్లు సరిగ్గా ఇస్తారు. కోర్టు తీర్పులు ఘోరంగా ఉండవు. లాయరు తెలివితేటల ముందు జడ్జీల తెలివితేటలు ఏ మూలకు వస్తాయి? సాధారణంగా లైసెన్సు రద్దు కాదు. శిక్ష పడదు. జైలుకు పోడు. ఫైను కట్టడు. ఒకవేళ మనిషి చనిపోతే జైలుకు పోతే పోతాడు, కాని డ్రైవరు ఆరు నెలల కంటే అక్కడ ఉండడు. ఈ ఏర్పాట్లు అన్నీ సెక్రటరీ చేస్తాడు. సెక్రటరీ చక్రం తిప్పితే పట్టణంలోని రక్తనాళాల వంటి రోడ్లు కదలికలతో కళకళలాడుతూ ఉంటాయి.

పశుసంవర్ధక శాఖవాళ్లు ప్రభుత్వం గడ్డిని మండలాలకు, గ్రామాలకు సరఫరా చేసేటప్పుడు సెక్రటరీని పిలిచి మాట్లాడి ఒప్పిస్తాడు. పేమెంటు అసోసియేషన్‌కే చెల్లిస్తారు.

ఇందులో ఒక సులువు సూత్రం ఉంది. రవాణా చార్జీలు ఒక్కొక్క లారీ ఓనరుకి చెల్లించే బదులు అన్ని లారీల సొమ్ము ఒక్కసారే ఏకమొత్తంగా సెక్రటరీకి చెల్లిస్తే ఎవరికెంత ఇవ్వాలో అతనే చూసుకొంటాడు. ఎవరికెంత ఇవ్వాలో అన్నమాటకు చాలా అర్థం ఉంది. లారీల ఓనర్లకు రావలసింది ఇవ్వటమే కాదు. మిగతా బట్వాడాలు కూడా ఒక్కచేతి మీదగా జరిగిపోతాయి. పదిమందికి ఇచ్చే పని, పదిమంది దగ్గర నుంచి వసూ లు చేసుకొనే శ్రమ తగ్గిపోతుంది, డిపార్టుమెంటుకు.

అనంతపురం జనాభాలో నూటికి అయిదోవంతున్న దళితులకు నూరు లారీలు, లారీలలో మూడింట ఒకవంతు ఉన్నాయి. ఇది ఆశ్చర్యకరమైన విషయం. దేశం అభివృద్ధి చెందిందని అందరూ ఆనందించే పరిస్థితి. ప్రభుత్వం లెక్కలు చెప్పటానికి, చూపటానికి సాక్ష్యంగా లారీ ఓనర్ల సంఘం సంసిద్ధంగా ఉంది.

ఎవర్నికైనా ఆశ్చర్యం కలగటం సహజమే! దళితులింతగా అభివృద్ధి చెందారా? చెందారని ప్రభుత్వం రుజువులు చూపుతుంది. అసోసియేషన్ లెక్కలు చూపుతుంది.

తాత ముత్తాతల కాలాల నుంచి పొలం పుట్రా ఉన్నవాళ్ళు వ్యసనాలకు బానిసలు కాకుండా ఉంటే సంపన్నులుగానే ఉన్నారు. వ్యసనాలకు బానిసలు కాకుండా ఉండటానికి వాళ్ళేమయినా దేవుళ్ళా? దేవుళ్లకే తప్పలేదు. ఇక మనుషుల మాటేమిటి? వీళ్ళు మనుషులే కదా! ఉప్పు కారం తింటున్న వోళ్ళే కదా!చీమూ నెత్తురు ఉన్న మనుషులే కదా! సలపరం, తీపరం తప్పవు కదా! దళితులు సాధారణంగా ఒక్క భార్యతో ఊరుకోరు. ఒక్క కల్లు ముంతతో ఆగరు. ఒక్క సారా పాకెట్టుతో తరించరు. ఒక్క కోడి, పొట్లి కురాకుతో ఊరుకోరు. వారి భోజన ప్రీతి, పరాక్రమం ప్రపంచ చరిత్ర వ్రాసే వాళ్ళు పరికించవలసిన చారిత్రక అంశం. గిన్నెస్ బుక్కు వాళ్లు పరిగెత్తుకుంటూ వచ్చి రాసుకుపోవలసిన విషయం. శివుడిలాగా ఇద్దరు భార్యల్ని, కల్లు సారాయిల్ని సేవించి కడుపు నిండా తిని, కంటి నిండా నిద్రపోయి, ఆకలయితే తప్ప, మళ్ళీ మెలకువరాని పరమా



మహిళా మణులందరికీ
మా ఆత్మీయ ఆహ్వానం..

భారీగా
తగ్గించిన ధరలు

# 4వ

## వార్షికోత్సవ సేల్



సొసైటీ కంచి పట్టుచీరలు
హై ఫ్యాన్సీ వర్క్ శారీస్ పై

## ప్రత్యేక ఆఫర్స్

# డి. నాగేశ్వరరావు

శా • రీ • హౌ • స్



గాయత్రినగర్, విజయవాడ - 8. ఫోన్ : 2487409

త్మలైన దళితులకు, పనిపాటలకు తీరికెక్క డది? పేదరికానికి విరామమెక్కడిది? అటువంటి వారసత్వం, పౌరసత్వం, పౌరుషం, పరమార్థం ఉన్న దళితులు నిరంతరం పేదలుగా ఉండవలసింది పోయి లారీ ఓనర్లు ఎలా అయ్యారా అని ఎవరికయినా అనుమానం పెనుభూతంలా ఆవరించటం సహజమే.

స్వాతంత్ర్యం రాకపోతే, దళితుల జీవితాలలో పెద్ద మార్పు వచ్చేది కాదు! బంజర్లు పంచటం, దున్నేవాడికే భూమి ఇవ్వటం, ఎడ్లు, బండ్లు ఏర్పడటం,వ్యవసాయం, పంట పండటం, బావులు, బోరులు, నీళ్ళివటం, మోటార్లు కరెంట్లు రావటం, ఆకలిని ఆమడ దూరం పారదోలటం మొదలు పెట్టినప్పుడు, మేల్కొన్న దళితులు కళ్లు తెరిచినట్లే లెక్క. గ్రామాల్లో మాలమాదిగ పల్లెలు జయిళ్ళుగా ఉన్నప్పుడు స్వేచ్ఛలేని దళితులు దౌర్భాగ్యం క్రీనీడలో దాక్కొన్నప్పటికీ, స్వేచ్ఛా భారతంలో చైతన్యం వాసన తగిలి ముక్కుపుటాలు ఎగరేయటంలో వింతేమీ లేదు.

పట్టా తన పేరిట ఉండి, పొలం అనుభవం మరొకరికి చెందుతుంటే తెలుసుకోవటం దళితులలో ఆరంభమయింది. ప్రభుత్వం ఇచ్చిన మోటారు కాలిపోయి, ఎడ్లు మాయమయితే, మూల హేతువు వాళ్ళకు చూచాయగా తెలియసాగింది. తన భూమి పండినా, పంట ఇంటికి తెచ్చుకోలేని పరిస్థితి అర్థం కాసాగింది.

ఎనుంగొడ్లనిచ్చినా, గొర్రెల్ని, మేకల్ని ఇచ్చినా అవి ఏవీ ఎక్కువ కాలం ఉండకపోవటం, పరిస్థితుల ఒత్తిళ్ళు, ప్రమాదాల తొందర్లు, ఎలా వస్తాయో, ఎలా పోతాయో అనుభవపూర్వకంగా తెలుసుకోసాగారు వాళ్ళు.

తరతరాలుగా తమ కాళ్ళకింద ఉన్న వాళ్ళకు కాళ్ళు మొలవటం కానీ, తిండికి తిప్పలు పడేవాళ్ళు తినగలగటం కానీ, ఇల్లూ వాకిలీ లేనివాళ్ళు సొంత ఇంట ఉండటం కానీ, చదువు సంధ్యలు లేనివాళ్ళు చదువుకోవటం కానీ, ఉద్యోగం, సద్యోగం లేనివాళ్ల ఊళ్ళు ఏలటం కానీ జనంలో కొందరు చూడలేకపోతున్నారని దళితులు గ్రహించసాగారు.

విరామం- నిరం



తర విరామం- నిర్విరామ విరామం- నుంచి, శ్రమ జీవనంలోకి, శ్రమశక్తిలోకి, శ్రామిక జీవన సుఖసంతోషాలలోకి ప్రయాణం చేస్తున్నప్పుడు దళితులు పడుతున్న తడబాటులు, తొట్రుపాటులు,ఎదురుదెబ్బలు, నేల

బడటాలు, నిలబడటాలు వాళ్ళు గ్రహించగలుగుతున్నారు.

గ్రామంలో గ్రామస్థుల అనుమతి లేకుండా, దయాదాక్షిణ్యాలు లేకుండా, అంగీకారం లేకుండా, ప్రభుత్వం ఇచ్చినా, అధికారులు తెచ్చినా, రాజకీయ నాయకులు ఇప్పించినా, తామే సాధించుకొన్నా, ఏదీ... ఏదీ... ఏదీ కూడా నిలవదని దళితులు తెలుసుకొంటున్నారు.

దళితుల్లాగే పేదరికంలో మగ్గుతున్న గ్రామాలలోని చాలామంది ఏ వనరులు సమకూడక, ఏ రాయితీలు రాక, ఏ ఆసరా లేక, ఏ అండదండలు అందక కుమిలిపోతున్నవాళ్లు, అంటరానితనం మచ్చ పోగొట్టడానికి చేసే సహాయ చర్యల్ని, కార్యక్రమాల్ని చూస్తూ ఊరికే ఉండలేకపోతున్నారని దళితులు తెలుసుకొని శక్తియుక్తుల్ని పొందసాగారు.



ఎవరో ఇచ్చిన గోచిపాతను గ్రామస్థుల అనుగ్రహం లేకుండా దళితుడు పెట్టుకోలేడన్న సత్యం నిష్ఠూరమైనా నిజం కాకుండా పోదని వాళ్ళు గ్రహించారు.

చదువుకోవాలంటే సవాలక్ష సతాయింపులు. తన పొలం దున్నుకోవాలంటే దిక్కు

మాలినన్ని తిప్పలు. మంచి బట్ట, మంచి తిండి, మంచి ఇల్లు ఉండాలంటే కోటాను కోట్ల అగచాట్లు. తలెత్తుకొంటే తల దించు కొనేదాక హింస. ఊరొదిలి పెడితే వాళ్ళు నలుగురితో సమంగా బతకవచ్చు కానీ దళి తులు ఉన్న ఊరు విడిచి పెట్టలేరు. ఆ సాహసం ఇంకా పూర్తిగా అలవాటు కాలేదు.

ఆవేశ పరులైన యువకులు ఉన్న ఊళ్ళో నలుగురితో సమానం అనుకొన్నారా సమ స్యే! ఆరాటమే! పోరాటమే! ఫలితం అనుకూ లంగా ఉంటుందని అంచనా వేయటం కూడా సాహసమే! వాళ్ళు తిరగబడ్డారా? తిప్పలు తప్పవు. దెబ్బలు కానరావు. నెత్తురు కనిపించని చావులు.

అంటరానితనం అనే మచ్చవల్ల దళితు లకు సంక్రమించే సౌకర్యాలు అంతకంటే పేదలయిన దళితులు కానివాళ్ళు కాంక్షి స్తారు. ఇది ఓట్ల ప్రజాస్వామ్యం. ఓటున్న వాడే మొనగాడు. ఈ వైరుధ్యం విచిత్ర లోకాల సందర్శనం చేయిస్తుంది. అంటరాని తనం అలాగే ఉండాలి. దళితులకు వచ్చే సౌకర్యాలు పేదలందరికీ వర్తించాలి అనే పేచీకోరు పీకులాట కొనసాగుతూనే ఉంటుంది. అంటరానితనం లేకపోతే పేద లంతా ఒకటే. కానీ అదీ ఉండాలి. ఇదీ రావాలి. అవ్వా కావాలి! బువ్వా కావాలి!

ఈ గ్రామ వ్యవస్థలో రాంవుడు తన యాభై ఎకరాల చేను, పదెకరాల తరి, పదె కరాల తోట నిలుపుకోవటం సప్తర్షుల సాక్షిగా విశేషమే! అది పండించుకోవటం, పంట ఇంటికి తెచ్చుకోవటం, దేహి అనకుం డా బతకటం, నలుగురితో బాగుండటం, అందరిలో తాను ఒకడుగా జీవించటం నిజంగా విశేషమే.

అతనికీ ఆస్తి, తాను పుట్టకముందు నుంచీ, ఆ ఊళ్ళో ఇప్పుడున్నవాళ్ళు అందరూ పుట్టకముందు నుంచీ, తాతముత్తాతల కాలం నుంచీ ఉంది. అతని పూర్వీకులు రాయల కొలువులో సైన్యాధికారులుగా పొందిన ఫర్మానావల్ల సంక్రమించిన భూమి కావటంవల్ల, ఆంగ్లేయులు భూమి ప్రతి అంగుళం కొలిచి సర్వే నంబర్లు ఇచ్చి, ఎవరి హక్కులో, స్వానుభవంలో, స్వాధీనంలో ఉన్న భూముల్ని వాళ్ళకి ఇవ్వటంవల్ల, తరత రాలుగా రాంవుడు కుటుంబం వాళ్ళు అనుభ విస్తూ వచ్చి ఉండటం వల్ల, ఆ భూమి వాళ్ళకు చెందే విషయంలో ఎవరికీ కంట గింపు లేదు. భూ పరిమతి చట్టం వచ్చిన అనంతరం కూడా ఆ భూమి వాళ్ళకే హక్కు భుక్తంగా మిగిలిపోయింది. వాళ్ళకా భూమి ఉండటం విశేషం కాదు. వాళ్ళు దాన్ని పోగొట్టుకోక పోవటం విశేషమే! విచిత్రమే! వింతే! విడ్డూరమే!

బంజర్లు పంచినప్పుడు వచ్చిన- తనకూ తన ముగ్గురు కొడుకులకు వచ్చిన- ఇరవై ఎకరాలకు తాను పట్టా పుచ్చుకోలేదు. తనకు భూమి ఉందని, ఏమీలేని పేదకు ఇమ్మని తానే తాసీలుదారుతో అర్జీ రాసి మొరపెట్టు కొన్నాడు. ఈ త్యాగలక్షణం గ్రామస్థుల్ని మెప్పించింది. భోగం వీధి కొల్లబోతుందంటే నాకొకతి, నా కొడుక్కొకతి అని ఎగబడే మనుషులు, మనిషికింత అని డబ్బు చెల్లిం చాలంటే నాకెందుకు నేను ముసలివాడిని, నా కొడుక్కెందుకు పసివాడు అని వెనక డుగు వేసే తరహా మనిషి కాకపోవటంతో రాంవుడికి గ్రామంలో మంచి పేరుంది.

అయిదెకరాల పట్టా చేతికి రాగానే మిడిసిపడే వాళ్ళు అది అన్యాక్రాంతం అయిందాకా ఎగురుతూనే కొందరు ఉంటా రు. చెరువెండుతున్నప్పుడు చేపలు ఎగిరెగిరి పడ్డట్టు పడి, అది ఎండిపోగానే చచ్చి ఊరు కొనే చేపలులాగా పట్టా భూమి పోగొట్టుకొ నేదాకా నిద్రపట్టని కొందరు కొత్త బంజరు నేల యజమానుల మాదిరిగా రాంవుడు ప్రవర్తించడు.

అంత భూమిని నిలుపుకొన్న రాంవుడి

పట్ల సహజంగానే ప్రేమగా ఉండే గ్రామస్థులకుగానీ, తెలిసినవాళ్ళకుగానీ, అనంతపురం జిల్లావాసులకుగానీ, దళితులకు నూరుకు పైగా లారీలున్నాయని తెలిస్తే 'ఈ జిల్లా ఎంత ముందంజ వేసిందిరా' అని పులకించి పోతారు.

సహజంగా అనంతపురం జిల్లా దళితుల పరిస్థితి ఘోరంగా ఉంటుంది. అట్టాంటిదే మహబూబ్‌నగర్ జిల్లా దళితుల పరిస్థితి. రాయలసీమ దళితుల జీవనం, తెలంగాణా దళితుల బతుకుల లాగా బండబారిపోయి ఉంటుంది. సర్కారు జిల్లాల దళితులే కొంత మేలు.

ఇంతగా చైతన్య శూన్యమైన అనంతపురంలో ఒక్క పట్టణంలో నూటికి పైగా లారీలు దళితులకు సొంతంగా ఉన్నాయంటే ఆంధ్రప్రదేశం, భారతదేశం పరమానందపడిపోవటం ఖాయం.

ఈ పరమానందం వెనుక ప్రపంచ చరిత్ర అంత -రామాయణం ఉంటుందని ఎవరయినా ఊహించుకోగలరు. అదిగో ఆ పురాణం బండారం బట్టబయలు కావటం అవసరమే!

శింగనమలలో దళితులకు తరిమెల నాగిరెడ్డి సమానత్వం అనే తారకమంత్రం ఉపదేశించారు. ఐదుకల్లు సదాశివన్ భిక్షాటనం చేసి, ఆ మంత్రానికి వ్యాఖ్యానం చెప్పాడు. వాళ్ళ పిల్లలకు చదువు వచ్చేటట్లు చేశాడు.

ఆ పరిస్థితుల్లో వాళ్ళు శింగనమల వదిలి అనంతపురం వచ్చారు. పంటలు లేకపోతే ప్రశాంతంగానూ, పంటలు పండితే ఫ్యాక్షన్ మండేటట్లుగానూ ఉండే రాయలసీమలో కర్నూలు- కడప కెనాల్ వచ్చి పంటలు బాగానే పండసాగాయి. తుంగభద్ర కెనాల్ అనంతపురంలోంచి సాగిపోతుంటే అనంతపురంలో కొంత భాగంలో పంట నమ్మకం ఏర్పడి కడప- కర్నూలు నుంచి అనంతపురానికి బాంబుల సంస్కృతి, ఫాక్షిక నాగరికత సంక్రమించాయి.

లాసే?

వంగర చమత్కార ప్రియుడు. మామూలు మాటల్ని కూడా హాస్యానికి వాడడంలో దిట్ట. ఎవరైనా తనను 'అయ్యా..కులాసానా? ' అంటే-

'కు' లేదు.. అంతా 'లా సే' అనేవారు.

క్షేమమా? అంటే-

'ఆహా.. అంతా క్షామమే' అని బదులిచ్చి నవ్వించేవారు.

ఈ నాగరికత సంస్కృతుల్లో పావులు దళితులు. వైరి వర్గాలు కొట్టుకు చచ్చినప్పుడు జమాబంది లెక్కలు చూస్తే ఇరు వర్గాలలో చంపినవాళ్ళు, చచ్చినవాళ్ళు దళితులే! శింగనమల దళితులకు సంక్రమించిన చైతన్యమేమంటే తాము చావరాదని, చంపరాదని. గొంగళ్ళో తింటూ వెంట్రుక లేరటం సాధ్యం కానట్లే పల్లెలో ఉండి, చంపక, చావక ఉండటం అసాధ్యం. అందుకు వాళ్ళు శింగనమల వదిలి అనంతపురం చేరారు. వాళ్ళు ఒక్కపట్టాన ఊరు విడిచి పెట్టలేదు. కంతుల వారీగా వారా ఊరు వదిలి వచ్చారు. అనంతపురంలో చిన్నాచితకా పనులు చేసుకోసాగారు. శ్రమజీవులై ఏ పనయినా చేయగలిగారు. బేల్‌దార్లు అయ్యారు. హమాలీలయ్యారు. కూలీలుగా మారారు.

చాలాకాలం అనంతపురంలో బస్సు, రైలు ప్రయాణం మినహాయిస్తే కాలినడకే ప్రయాణ సౌకర్యం. ఆ మధ్య గుర్రబ్బళ్ళు ప్రయాణ సాధనాలు కాగలిగాయి. గుర్రాలు ముసలివై, బళ్ళు పాతవై, వాటికి రిపేర్లు లేక, గుర్రాలకు మేత లేక, గుర్రబ్బళ్ళ సాయిబులకు కూడు లేక బళ్ళు పడటం, ఇరగటం, గుర్రాలు ముక్కటం, మూలగటం, నేల కూలటం, సాయబు తోలలేక, కొట్టలేక, తిట్ట

లేక సొమ్మసిల్లటం, ప్రయాణికులు పడటం, కాళ్ళూ చేతులూ విరగటం డా.నారాయణప్ప దగ్గరకు ఉరుకులు పరుగుల మీద పోయి కట్టు కట్టించుకోవటం రివాజుగా మారి పోయి ఎవరూ వద్దనకుండానే గుర్రబ్బళ్ళు కనుచూపు మేరలో పొలిమేరలోకి చేరుతున్న ప్పుడే మనిషి లాగే రిక్షా అనంతపురంలోకి వచ్చి ఉండాల్సింది. నేటికీ హజరత్ నిజా ముద్దీన్ ఢిల్లీలో, కలకత్తాలో, బొంబాయిలో, హైదరాబాద్‌లో మనుషుల్ని రిక్షాలో కూర్చో బెట్టుకొని మనుషులే లాగే రిక్షాలు ఉండగా, చిత్రంగా అనంతపురంలో అవి ప్రవేశించను కూడా ప్రవేశించలేదు. మనిషిని మనిషి లాగే సంస్కృతిని అనంతపురం తిరస్కరిం చిందో, మనుషులే వ్యతిరేకించారో, కమ్యూ నిజం ప్రాధాన్యం వహించిందో, మానవ సమానత్వ దృష్టి పనిచేసిందో, మనుషులు లాగే రిక్షాలు మాత్రం అనంతపురంలోకి ప్రవేశించలేదు.

అప్పుడొచ్చాయి సైకిల్ రిక్షాలు. ముసలి గుర్రబ్బళ్ళ వాళ్ళకు, యువక సైకిల్ రిక్షా వాళ్ళకు మొదట్లో ఘర్షణలు జరక్కపోలేదు. గుర్రబ్బళ్ళ వాళ్ళ ఎఫెన్సు, సైకిల్ రిక్షావాళ్ళ డిఫెన్సు- పోలీసుల నాన్ ఎలైన్‌మెంటు- భారతదేశ తటస్థ విధానం- కొనసాగుతున్న సమయంలో పిల్లిపోరు, పిల్లిపోరు పిట్ట తీర్చిందని, కాగల కార్యాలు గంధర్వులు నెర వేర్చినట్లు, ప్రయాణికులు పోలీసులకు పని పెట్టకుండా సైకిల్ రిక్షాలను ప్రోత్సహిం చారు.

ఇక సైకిల్ రిక్షాలు అనంతపురి పట్టణ మంతా షికార్లు చేయసాగాయి. చక్రాలు దొర్లటం, చైన్లు తిరగటం, బెల్లు మోగటం, బ్రేకు ఆపటం అంతా అద్భుతంగా మారి పోయింది.

బండోడు, నల్లోడు, కర్రోడు ఒక తల్లి పిల్లలే. వాళ్ళు శింగనమలలో ఉంటే, ఉంటారో, ఊడతారో అన్న భయంతో వాళ్ళ అమ్మ వాళ్ళను అనంతపురం పంపించింది.

ఆ పనీ, ఈ పనీ చేసుకుంటూ బతుకుతూ బాగుపడుతున్నవాళ్ళు సైకిల్ రిక్షాలు యస్‌సి కార్పొరేషన్ సహాయంతో, బ్యాంక్ అప్పుతో కొనుక్కోవటం అద్భుత పరి ణామం. వాళ్ళు ముగ్గురూ ఆ ఊపులో పెళ్ళి చేసుకొన్నారు. అప్పులు తీర్చారు. రిక్షాల యజమానులయ్యారు. అది వాళ్ళకు అంత పెద్ద విషయం కాదు. పెద్ద విషయం ఏమి టంటే...

రిక్షా ఎక్కే పాసింజరు ఏ కులం మనిషి అయినా, ఏ మతం అయినా, ఎంత సంప న్నుడయినా, ఎంత పేదవాడయినా, ఎంత మహాత్ముడయినా, ఎంత మహనీయుడయి నా తను కూర్చోమంటే కూర్చోవాలి. ఎక్క మంటే ఎక్కాలి, దిగమంటే దిగాలి. అతన్ని వెనక కూర్చోబెట్టుకొని, తాను ముందు కూర్చొని రిక్షా తొక్కుతుంటే తనకు సమా నత్వం వచ్చినంత సంతోషం. తాను యజ మాని అయినంత ఆనందం. తాను చెప్పి నట్లు వినే ప్రయాణికుడు దొరికిన ఉత్సా హంతో శింగనమల దళితులు ముగ్గురు బ్రహ్మ-విష్ణు-మహేశ్వరుల్లాగా అనంతపురం ప్రయాణ బాధ్యత తమ కాళ్ళ బలంలో దాచుకొన్నట్లు పొంగి పోసాగారు. వాళ్ళి ప్పుడు బండోడు, నల్లోడు, కర్రోడు కాదు. బండన్నగారు, నల్లప్పగారు, కర్రెన్నగారు. అట్టా పిలిపించుకొంటారు. అట్టా పిలిస్తేనే పలుకుతారు. అలా పిలవకపోతే రిక్షా తొక్కరు.

ఈ త్రిమూర్తులెప్పుడయినా శింగనమలకు పోతే చెప్పనలవి కాని సంతోషం. శింగన మల దళితులు వీళ్ళ అభివృద్ధి విని, చూసి, తెలుసుకొని ఆనందించేవాళ్లు. ఆ ఆనందం లోనే పనులు ఏవైనా చేయగల శక్తియుక్తు లుండేవాళ్ళు, దళితులు పల్లెనొదిలి అనంత పురం పట్టణంలోకి రాసాగారు.

చుట్టుపక్కల ఉన్న పల్లెల నుంచి, ఎంత

# All that glitters is not gold

Similarly, all black tanks are not SINTEX



WORLD'S Sintex NO. 1 WATER TANKS

MADE WITH VIRGIN PLASTIC







Reno WATER TANKS



INSULATED (ICE) BOXES




MILK CANS




DRUM

Bins




KEERTIKAAR

## hindustan traders

VISAKHAPATNAM: 0891-2569727, 5566727
RAJAHMUNDRY : 0883-2471335
VIJAYAWADA : 0866-2576411

మంది దళితులు అనంతపురంలోకి వచ్చినా, బుక్కరాయ సముద్రంలోకి ఎంత వర్షం కురిసి, ఎన్ని వంకలు, వాగులు పారి పండ మేరు పొర్లి నీళ్ళు వచ్చినా, ఇంకా నిండనట్లే, ఖాళీ ఉన్నట్లే, మొరవ పారనట్లే, పుష్పక విమానంలో ఎందరెక్కిన మరొకరికి చోటు ఉన్నట్లుగానే ఎందరు దళితులు అనంత పురం పట్టణంలోకి వచ్చినా, ఇంకా పట్టణా నికి మనుషుల అవసరం ఉండనే ఉంది.

స్వాతంత్ర్యం వచ్చినప్పుడు అనంతపురం జనాభా ముప్పైవేలు. ఇప్పుడు మూడు లక్ష లు. మరో పాతికవేలు రోజూ వచ్చీపోయే జనం. వాళ్ళకు ఎన్నో పనులు, అవసరాలు. వాటిని తీర్చి సమకూర్చి సదుపాయలు కల్పించటానికి ఇంకా జనం అవసరం ఉంది.

చుట్టు పక్కల పల్లెల నుంచి బతుకుదెరు వులు వెతుక్కొంటూ అనంతపురం వచ్చిన దళితులు అంబేద్కరు నగర్‌లో స్థిరనివా సాలు ఏర్పాటు చేసుకోవటంతో పాటు, ఎక్కడ కొత్త కాలనీ పుడితే అందులో చేరు కోసాగారు. ఆవిధంగా అనంతపురంలో కొత్తగా వచ్చిన దళితులు, కొత్త కాలనీలో చేరి, శ్రమజీవులందరితో కలసి ఇరుగుపొరు గుగా జీవించే విచిత్ర సామాజిక పరిస్థితి లోకి నెట్టబడ్డారు.

మునిసిపాలిటీ పారిశుద్ధ్యం పని వీళ్ళదే! వీధులూడ్చేది వీళ్ళే! పాయిఖానా దొడ్లు శుభ్రం చేసేది వీళ్ళే. చెప్పులు కుట్టేది వీళ్ళే. పొలాలు కాపలా కాసే వాచ్‌మెన్ పనులూ వీళ్ళవే! రిజర్వేషన్లతో నిమిత్తం లేకుండా పనులన్నీ వీళ్ళవే! ఎవరూ వీళ్ళ పనుల మీదికి ఎగబడరు. పోటీ లేదు. పేచీ లేదు.

బండెన్నగారు, నల్లప్పగారు, కర్రెన్నగారు తమ రిక్షాలు తాము తొక్కుకుంటూ, 'తొక్కే వాడిదే సైకిల్ రిక్షా' అన్న నినాదంలో నినది స్తున్న ప్రశాంత సమయంలో, బొందలేడు నారపరెడ్డి వచ్చి ముగ్గురు అన్నదమ్ముల్ని లారీలు కొనుక్కోమని చెప్పాడు. సొమ్ము లేదంటే తానిస్తానన్నాడు. యస్.సి. కార్పొరే షన్ సహాయం చేస్తుందని చెప్పాడు.

లారీ ఖరీదు పది లక్షలయితే తాను లక్ష, కార్పొరేషన్ మూడు లక్షలు, బ్యాంకు ఆరు లక్షలు మంజూరు చేయగా ముగ్గరన్నద మ్ముల్ని మూడు లారీలకు ఓనర్లుగా చేశాడు నారపరెడ్డి.

దుడ్డు దూగాణి పెట్టుబడి లేకుండా నార పరెడ్డి పుణ్యమా అని లారీలకు ఓనర్లు అయినందుకు, మూడు ఏనుగుల వంటి లారీలు రోడ్డు మీద తమ పేరు చెప్పుకొని తిరుగుతున్నందుకు అలవిమాలిన ఆనందం పొందారు అన్నదమ్ములు.

వీళ్ళు ముగ్గురూ లారీల మోజులో పడి సైకిల్ రిక్షాలు పక్కనబెడితే, వాళ్ళ ముగ్గు రికీ తమ్ముడు ఎర్రోడు అనబడే ఎర్రన్న పదోతరగతి శింగనమలలో పాసయి అన్నల దగ్గరకు చేరి, రిక్షాలు ఖాళీగా ఉన్నప్పుడు తాను తొక్కుకోసాగాడు.

లారీ అనగానే డ్రైవరు కావాలి. డ్రైవింగు లైసెన్సు ఉండాలి. త్రిమూర్తులకు లైసెన్సులు లేవు. క్లీనర్లు కావాలి. తాము క్లీనర్లు కాగ లరు. డ్రైవింగు నేర్చుకోగలరు. లైసెన్సు నెమ్మదిగా తెచ్చుకోగలరు. డీజిల్ కావాలి. బాడిగలు కావాలి. లారీ ఓనర్ల సంఘంలో సభ్యత్వం ఉండాలి. ఠంచనుగా బాడిగ రావాలి. బ్యాంకు కంతులు క్రమం తప్ప కుండా కట్టాలి. కట్టకపోతే వడ్డీ మీద వడ్డీ. అప్పటికీ కట్టకపోతే లారీలను బ్యాంకు వశం చేసుకొంటుంది.

బ్యాంకు అప్పు కింద లారీలు పోతే, కార్పొ రేషన్ రాయితీ గంగలో కలిస్తే, నారపరెడ్డి లక్ష అప్పు తీర్చటానికి తన లారీలో తాను క్లీనరుగా పనిచేయాలి. లారీ సొంతదారు లారీలో క్లీనరు. యాజమాని కాని యజమా ని. కాని యజమాని నారపరెడ్డి బాడిగ వసూలు చేసుకొని, బ్యాంకు కంతులు కట్టి

డ్రైవర్లకు, క్లీనర్లకు ఇంత జీతమిచ్చి ఇంత వడ్డీ కింద అసలు కింద జమ చేసుకొని అన్నదమ్ముల్ని క్లీనర్లుగా పెంచి పోషిస్తు న్నాడు.

సొంత లారీలో క్లీనర్లుగా ఉన్న త్రిమూర్తులు వచ్చిన జీతంతో అప్పులు తీరుస్తూ మిగిలిన జీతంతో డ్రైవర్లు, క్లీనర్లు అందరికీ అలవాటు అయ్యే కల్లు సారాయి తాగుతూ పెళ్ళాం పిల్లలకు ఏమీ ఇవ్వకుండా పోతుం టే, ఎర్రన్న తన అన్నల సైకిల్ రిక్షాలు బాడుగకు తిప్పి వసూలైన సొమ్ముతో వదినలకు తిండికి తీర్థానికి తిప్పలు తప్పేటట్లు చూస్తున్నాడు.

లారీ ఓనర్ల

**ఆర్టీవోతో తంటా! పోలీసులతో గొడవ. లోకలోళ్ళతో తలనొప్పి! ట్రాఫికోళ్ళతో పీకులాట. బ్రేకు లేదని, హారన్ లేదని, కండిషన్ సరిగా లేదని చలానా రాయటం... ఎన్నని...**

సంఘంలో సభ్యత్వం ఉన్న వంద దళితుల లారీలలో నాలుగు మాత్ర మే దళితులు నడుపుకొంటున్నారు. మిగతా లారీలన్నిటిలో లారీ ఓనర్లే డ్రైవర్లుగా, క్లీనర్లుగా, కూలీలుగా మిగిలిపోయారు.

సొంతంగా లారీలు నడిపే నలుగురికీ సంఘంలో సభ్యత్వం లేదు. అది ఉన్న రోజుల్లో ఎన్ని తిప్పలో, ఎన్ని పాట్లో వాళ్లకు మాత్రమే తెలుసు. దళితులంటే సెక్రటరీకి చిన్నచూపు. పెద్దగొంతు, బండబూతులు, బాడిగలు చెప్పడు. సొమ్ము ఇవ్వడు. అడిగితే మండి పడతాడు. మిగతావాళ్ళకు ధర్మాత్ముడే! దళితులకు దగాకోరు! ఎందుకు? వీళ్ళు ఏమీ అనలేరు. మిగతావాళ్ళు చించి చెండాడతారు. వాళ్లతో సవ్యంగా ఉండాలి. వీళ్ళతో ఎలా ఉన్నా నెట్టుకురావచ్చు

సొంతంగా బాడిగలకు పోతే అన్నీ సమస్యలే! పర్మిషన్ గిర్మిషన్ అంటారు. ఆర్టీవోతో తంటా! పోలీసులతో గొడవ. లోకలోళ్ళతో తలనొప్పి! ట్రాఫికోళ్ళతో పీకులాట. బ్రేకు లేదని, హారన్ లేదని, కండిషన్ సరిగా లేదని చలానా రాయటం, కట్టటం, ప్రశ్నిస్తే సీజ్ చేయటం, లారీ కదలదు, మెదలదు, అరవదు. టైర్లు గాలిపోయి నేలకు ఒరుగుతాయి. బాడీ పాడవుతుంది. బేంకువోళ్ళతో పేచీలు, అప్పులవాళ్ళతో గొడవలు. నెగ్గుకు రావాలంటే దళితుల తరమా?

ఇటువంటి గొడవల నుంచి చాకచక్యంగా సర్దుబాటు చేసుకొంటూ వస్తున్నవాళ్ళను ఎలా ఇరకా

టంలో పెట్టాలా అని లారీ ఓనర్ల సంఘం సెక్రటరీ చూపెట్టుకొని ఉన్నాడు.

నారపరెడ్డి బుద్ధిమంతుడు. తన రెండు లారీలను పది, పదేడుగా పెంచుకుపోతు న్నాడు. ఈ నాలుగు లారీలు దళితుల యాజమాన్యం నుంచి నారపరెడ్డి షెడ్డులోకి ఏనాటికయినా వస్తాయని, దళితుల పేరుతోనే కొనసాగుతూ ఉంటాయని అందరికీ తెలుసు. నారపరెడ్డి లారీలన్నీ దళితుల పేరిటే ఉన్నాయి.

సంఘం బాడిగ, రైల్వే స్టేషన్ బాడిగలు, సెనక్కాయలు, వడ్లు బాడిగలు, మద్రాసు, బెంగుళూరు, హైదరాబాద్, పూనా, బొంబాయి బొప్పాయి బాడిగలు, ఐస్ చేపల కలకత్తా బాడిగలు, (రాయలసీమ చెరువులు, డ్యాములు, కాలవల చేపలకు కలకత్తాలో భీమవరం చేపల కంటే గిరాకీ) కర్నాటక, గోవా, మద్రాసుకు దొంగ సరకు రవాణా



బాడిగలు కొల్లగా వచ్చి లారీలు తిప్పటంలో నారపరెడ్డి రాటుదేలిపోయాడు.

ఆరున్నర శ్రుతిలో రాత్రంతా కురుక్షేత్రం పద్యాలు గొంతెత్తి గానం చేయగలిగిన ఘనాతి ఘనుడైన ఘనాపాఠి నటుడు, గాయకుడు, సాహితీవేత్త, సంగీతవేత్త, సరస రసిక రాజు. చెక్‌పోస్టుల దగ్గర తన నేర్పం తా చూపించి అసలు సిసలు గానం ఆలపిం చాడంటే చెక్‌పోస్టు కరిగి, నీరై, వాగై, ఏరై ప్రవహించి పోవలసిందే! చీనీ పళ్ళ కింద మందుగుండు సామాను తోలగలడు. టమాటో పళ్ళ కింద టయంబాంబులు పోనివ్వగలడు. పరుపుల్లో నాటు బాంబులు సరఫరా చేయగలడు. ఈ మధ్య బొంబాయి నుంచి ఏకే 47లు తెస్తున్నాడని, ఫ్యాక్షన్‌లకి ఇస్తున్నాడని వదంతి. వాళ్ళు మాత్రం ఎంత కాలం నాటు బాంబులు, వేట కొడవళ్ళు, గొడ్డళ్ళు, బరిసెలు, ఈటెలు, రాళ్ళు రప్పలు నమ్ముకొంటారు. నాగరికత పెరిగిపోలేదా?

రామగిరి మండలంలో నక్సలైట్లకు ఏమేమో తమ లారీల్లో సరఫరా చేశారని, సంఘంలో సభ్యత్వం లేని రెండు దళితుల లారీల మీద, సెక్రటరీ పోలీసులకు ఫిర్యాదు చేశాడు. పోలీసులు ఆ రెండు లారీలను



తెర మీద, గుండె తెరమీద, బ్రతుకు బండతెర మీద, అగచాట్ల అందాల తెరమీద, చిత్రవిచిత్ర చోద్యం రీళ్ళు రీళ్ళుగా ఎపిసోడ్‌లు ఎపిసోడ్‌లుగా చూడాలి.

8

సర్కారు గడ్డిని మోసుకొస్తున్న గూడ్సు బండి అనంతపురం చేరుతున్నకొద్దీ ప్రసవ వేదన ఎక్కువై ముక్కసాగింది. రాలేక రాలేక వస్తోంది. అరిసి అరిసి కేకలు పెడుతోంది. చుక్‌చుక్ మంటుంది. కిర్రుమంటోంది, కీచుమంటోంది. ఏడవలేదు, నడవలేదు. పట్టాలు పట్టుకొని పాకుతూ వస్తోంది. డ్రైవరు, ఫైర్‌మెన్, గార్డు తప్ప అంత అవస్థ పడుతున్న డెలివరీ ఘడియలు దగ్గరపడ్డ గూడ్సు బండిని సముదాయించేవాళ్ళు, స్వాంతన వచనాలు పలికేవాళ్లు లేకపోయారు.

డాక్టర్లు, కాంపౌండర్లు, తోటీలు, అంబులెన్సు రెడీ చేసి స్ట్రెచర్ సిద్ధం చేసినట్లు, పశుసంవర్ధక శాఖవాళ్ళు స్టేషన్ మాష్టరు,

సీజ్ చేశారు.

ఇప్పుడేం జరుగుతుంది? కేసు నడుస్తుంది. కేసు ఋజువైతే, ఓనర్లు జైలుకు పోతారు. లారీలు ప్రభుత్వ పరమవుతాయి.

నారపరెడ్డి సహాయం తీసుకొంటే, సెక్రటరీ సాక్ష్యం చెప్పడు. కేసు ఋజువు కాదు. జైలు శిక్ష పడదు. లారీలు ప్రభుత్వం వశం చేసుకోదు.

కానీ నారపరెడ్డి లారీలకు యజమాని కాని యజమాని అవుతాడు. తన లారీలో తానే డ్రైవరుగా, క్లీనరుగా రెండు లారీల యజమానులు జీతగాళ్ళు అవుతారు.

ఏం జరుగుతుంది?

ఏం జరుగుతుందో, వెండితెరమీద, బుల్లి

సిబ్బంది, పోలీసులు, హమాలీలు, లారీలను సిద్ధం, సర్వసన్నద్ధం చేశారు.

అందరూ ఉత్తర దిక్కుగా చూస్తున్నప్పుడు, ముందుగా శబ్దం వినబడి, ఆపైన ఇంజను కనబడి, హెచ్ఎల్సి కెనాల్ బ్రిడ్జి మీద దడదడలు వినబడి, గూడ్సు బండి కనబడి, ఎర్నేలకొట్టాలు దాటి, రెవిన్యూ కాలనీ పక్కగా రామచంద్రనగర్ దాటుతోంది గూడ్సు. టిటిడి కళ్యాణమండపం చూచేసరికి గూడ్సు బండి ప్రాణం కుదుటపడింది.

గూడ్సుబండి మెయిన్ లైన్ వదిలి, పాసింజర్ లైనులోకి మారి, గూడ్సు లైన్లలో నాలుగో లైను మీదికి ఇంజను వచ్చింది. వచ్చినప్పుడది పాములాగా వంకరగా, పొట్లకాయలా వంపు తిరిగి ఉంది.

హమాలీలు అనగా డిపార్టుమెంటువాళ్ళు నిట్టూర్పుగా, యంజిబీజి ప్రయాణికులు నిర్లక్ష్యంగా, రైతులు ఆబగా, పశువులు ప్రేమగా, లారీలు దీక్షగా చూస్తున్నప్పుడు గూడ్సు బండి పూర్తిగా వచ్చి నాలుగో లైన్లో నిలబడిపోయింది. ఇన్ని కళ్ళు పడితే దానికి ఏం దిష్టి తగులుతుందోనని ఎవరికీ భయం లేదు. అది అసలే ఇనపబండి. మొత్తం అయోమయం. లోపల సర్కారు గడ్డి. దానికే శల్యమూ లేదు.

అనుమతి రాగానే కోట గోడలు ఎగబ్రాకే సైనికులు లాగా హమాలీలు వేగన్ల మీదికి ఎగబడ్డారు. సీళ్ళు ఊడగొట్టారు. రాళ్ళతో గొళ్ళేలు జారగొట్టారు. బలవంతంగా తలుపులు తెరిచారు. రెండువైపులా వాకిళ్ళు తెరుచుకోగానే పద్నాలుగు వేగన్ల దగ్గరకు లారీలు వచ్చి బ్యాక్ చేసుకొని, వేగన్ వాకిట్లోకి వచ్చి నిలబడ్డాయి. వేగన్కూ లారీకి మధ్య లారీ బ్యాక్ డోరు వంతెన అయింది.

ముఠామేస్త్రీ 'లెండిరా', 'రండిరా', 'పొండిరా' అంటున్నాడు. 'ఎక్కండిరా','తీయండిరా', 'వేయండిరా' అంటున్నాడు. 'ఇటు ఇటు', 'అటు అటు' అంటున్నాడు గ్రూపు మేస్త్రీ. గ్రూపు సభ్యులు వేగన్లోకి పోయి గడ్డి మోపు తెచ్చి లారీలో వేస్తున్నారు. వేగన్ ముందు భాగం ఖాళీ అవుతుంటే లారీ ముందు భాగం నిండుతూ ఉంది.

ఆసులో కండెలాగా హమాలీలు వేగన్ల లారీల మధ్య తిరుగుతుంటే వేగన్ ఖాళీ అవుతూ, లారీ నిండుతూ ధర్మవరం పట్టు పంచ నేసినట్లుగా ఉంది. పనిచేయని ముఠామేస్త్రీ, చిన్న మేస్త్రులు అరుస్తున్నారు. పనిచేసే హమాలీలు చెమటతో పరాచికాలు ఆడుతున్నారు. నాయకులెప్పుడూ అరుస్తారు. సామాన్యులెప్పుడూ మౌనంగా పనిచేస్తారు. చెమట చిందిస్తారు.

గడ్డి మోపులు ఎలా వేయాలో, ఎలా తీయాలో హమాలీలకు తెలుసు. అవసరమైతే అజమాయిషీ చేసే గ్రూపు మేస్త్రీ సలహాలిస్తాడు. లారీ డ్రైవరు గానీ, క్లీనరు గానీ లారీ ఎలా లోడ్ చేయాలో హమాలీలతో చెప్పరు. చెప్పినా వాళ్లు వినరు. గ్రూపు మేస్త్రీతో చెప్పాలి. అతను హమాలీలకు సూచనలు చేస్తాడు. పని చేయిస్తాడు. అంతా క్షణాల మీద పని అయిపోతూ ఉంది.

డ్రైవరు యంజి పట్టాల మీద కూర్చుని బీడి తాగుతున్నాడు. క్లీనరు బీడీ ముట్టించుకొని డ్రైవరు సలహాలు గ్రహించి లారీ దగ్గరకు వస్తున్నాడు. అంత లావున్న ముఠామేస్త్రీ క్లీనర్ని చూసి చెంగున లేచి ఠక్కున జుట్టు పట్టుకొని పైకి లేపాడు. ఏమీ చేయలేదు, బీడి నోట్లోంచి తీసి కాలికింద పడేసి నలిపి క్లీనర్ని వదిలాడు. బీడి ఆరిపోయింది. 'లారీ తగల బెట్టుకుంటావా?' అన్నట్లు చూశాడు. 'సారీ' అన్నట్లుగా క్లీనరు వెళ్ళిపోయాడు. క్లీనరు పరిస్థితి చూసి, డ్రైవరు గుండెల నిండా దమ్ము పీల్చి బీడి తీసి, ఆర్పి, ఎటో చూస్తూ నోట్లోంచి పొగ గుప్పు గుప్పుమని వదిలాడు.

హమాలీలు గడ్డి ఈ పక్క ప్లాటుఫారం మీద లారీలోకి లోడ్ చేస్తుంటే, ఆ పక్క

ఆడాళ్ళు, పిల్లలు, మగవాళ్ళు ఎగిరెగిరి గడ్డి గుంజి, లాగి, పోగేసి మూట కడుతున్నారు. మోపులు కడుతున్నారు.

ప్లాటుఫారం మీద స్థిర నివాసం, చర నివాసం ఏర్పరచుకున్న పిల్లలు, రైళ్ళు వచ్చినప్పుడు చీపుర్లు తీసుకొని కంపార్టుమెంటులోకి చొరబడి ఊడ్చి, తుడిచి, డబ్బులు అడుక్కొని దిగిపోయి, ఎవరయినా పెట్టింది తిని, ఏమయినా కొనుక్కొని తిని, తాగి, రైలు లేనప్పుడు ప్లాటు ఫారం మీద తీరుబడిగా తిరిగే పిల్లల్ని పిలిచి బతిమాలితే వాళ్ళు వచ్చి గూడ్సు వేగన్ ఎక్కి గడ్డి పనల కొద్దీ లాగి కింద పారేస్తుంటే కింద ఉన్న జనం దాన్ని పోగేసి కట్టలు కట్టుకొంటున్నారు. పిల్లలది నిష్కామ కర్మ, పెద్దలది నిర్వికార చేష్ట. ఒక వేగన్ అన్‌లోడ్ అయ్యే సరికి పది కట్టలు పది దిక్కులకుపోయి పశువులకు ప్రాణదానం చేస్తున్నాయి.

ముందు ముందు మంచి మంచి దొంగతనాలు చేయబోయే రేపటి పౌరులకు ఈ కృషి తర్ఫీదు, ట్రయినింగు- అప్రెంటిస్‌షిప్. పనయిపోతే ప్లాటుఫారం ఎక్కి బెంచీల మీదో, బ్రిడ్జీల కిందో కూర్చుంటారు. లేదంటే పడుకొంటారు. కాదంటే నిద్రపోతారు. ఇష్టారాజ్యం వాళ్ళకు. వాళ్ళే పాలకులు, యజమానులు, దొరలు. ఎప్పుడైనా దొరికితే బీడీలు, సిగరెట్లు కాలుస్తారు. రైళ్ళ రాకపోకల నిరీక్షణే వాళ్ళ డ్యూటీ. ఊడవడమే పని. అడుక్కోవటమే విద్య. ఎవరూ ఏమీ పెట్టకపోతే, కొట్టకపోతే, తిట్టటమే వాళ్ళ హక్కు.

సర్కారు గడ్డి సరఫరా చేసిన మొదటి ఏడు ఒక వేగన్ గడ్డి,ఒక లారీలో నిండుగా, ఎత్తుగా లోడ్ చేసి పంపిన మాట వాస్తవమే! లారీ పైన క్లీనర్ కూర్చుని పంగల కర్రతో కరెంటు తీగలు ఎత్తి పట్టుకొంటూ పోవలసివచ్చేది.

ఒక క్లీనరు పైనుంచి పడి కాలు విరగ్గొట్టుకున్నాడు. మరొకడు చనిపోయాడు. మరొక లారీ కాలిపోయింది. అప్పటి నుంచి మూడు వేగన్ల గడ్డి నాలుగు లారీల లోడుగా మారింది. ప్రమాదాలు లేవు.

లారీలు నిండాయి. వేగన్లు ఖాళీ అయ్యాయి. ముఠామేస్త్రీ అనుమతి ఇచ్చాడు. డిపార్టుమెంటువాళ్ళు రూటు పర్మిట్ పత్రాలు ఇచ్చారు. డ్రైవర్లు ఎక్కారు. క్లీనర్లు వైతాళికులయ్యారు. లారీలు హారన్లు వేశాయి. ఒక దాని వెంట మరొకటి బయలుదేరాయి. ఉత్తరానికి సాగాయి. గేటు దగ్గర తూర్పుకు కొన్ని, దక్షిణానికి కొన్ని బయలుదేరాయి.

హమాలీలు విశ్రాంతి తీసుకొంటున్నప్పుడు, ముఠామేస్త్రీ షెడ్డు నానుకొని కూర్చున్నప్పుడు, డిపార్టుమెంటు వాళ్ళు కాఫీలు, టీలు తాగబోయినప్పుడు, స్టేషన్ నెమ్మదిగా ఉన్నప్పుడు, గోనెసంచి భుజాన వేసుకొని, చీపురు, చేట చేత బట్టుకొని, కూతుర్నో, మనవరాలినో, కోడలినో జబ్బ పట్టుకొని ఫెన్సింగ్ పక్కనో, చెట్టు నీడనో, బ్రిడ్జి కిందనో, ప్లాట్ ఫారం మీదనో, మెట్టు దిగువనో గుంటకాడ నక్కల్లా కాచుకు చూస్తున్న ఆడవాళ్ళు వేగన్ల కసుపూడ్చి తూర్పారబట్టి, తాలూ తప్పా పోను గట్టి గింజలు సంచికెత్తుకోవటానికి రడీ, స్టడీ, గో అన్నట్లు నిలబడ్డారు. అరక్షణంలో వేగన్లను చుట్టుముట్టి అయిదు నిమిషాల్లో వేగన్లు సుప్తాగా శుభ్రం చేసి వెళ్ళిపోయారు.




గూడ్సు షెడ్డు దగ్గర హమాలీలు మూగి ఉంటే లచ్చువక్క వస్తుంది. వెంట యంగటేసు ఉంటాడు. వస్తూ ఆమె రెండు

.గంపలు-గంప మీద గంప పెట్టుకొని మోసుకొస్తుంది. అతను రెండు కెటిళ్ళు, ఒక బకెటు తెస్తాడు. బక్కెటు కొక్కెం, దాని మీద పెట్టుకొన్న కెటిల్ కొక్కెం కలిపి పట్టు కొని యంగటేసు తేవటం సర్కసు చూచి నంత వినోదంగా ఉంటుంది.

ఒక కెటిల్‌లో కాఫీ, ఇంకొక దాంట్లో టీ, బక్కెట్‌లో నీళ్ళు, గ్లాసులు, ప్లేటులు, దబరా గిన్నె. లచ్చువక్క గంపల్లో ఒకదానిలో తిళ్ళు, మరొకదానిలో కూరలు. గడ్డి పరిచి, దాని మీద వేరు వేరు పాత్రలు బిర్రుగా పెట్టి ఉన్నవాటిలో కుష్కా, పరోటా, పూరీ, దోసె, ఆమ్లెట్ పాత్రలు. మరో గంపలో గుడ్డు కూర, చికెన్ కూర, చికెన్ పులుసు, చట్నీ పాత్రలు ఉన్నాయి. ప్రతి దానికీ ప్రత్యేకంగా గరిటెలు, స్పూన్‌లు, నీళ్ళ పాకెట్లు అదనం. ప్లాస్టిక్కు కప్పులు తోడు.

గడ్డి గూడ్సు బళ్లు వస్తున్నా, ఎరువుల వేగ న్‌లు వస్తున్నా, ఏ లోడింగు, అన్‌లోడింగ్ పనులున్నా హమాలీలు కనబడితే లచ్చువ క్కకు పండగ. ఒక గడ్డి గూడ్సుబండి వెళ్ళి పోగా ఖాళీ అయిన లైనులోకి మరో గూడ్సు బండి రాకకోసం హమాలీలు ఎదురు చూస్తున్నారు.

లచ్చువక్క గంపలు దింపుకొని కూర్చుం ది. యంగటేసు బక్కెటు, కెటిళ్ళు కింద బెట్టి నిలబడి ఉన్నాడు. లచ్చువక్కను చూస్తే హమాలీలకు అన్నం పెట్టే అమ్మను చూచి నంత సంతోషం. వాళ్లు ఆమె చుట్టూ మూగారు.

దోసె, చట్నీ చౌక. దోసె, చికెన్ పులుసు కొంచెం రేటెక్కువ. దోసె గుడ్డుకూర ఖరీదే! దోసె చికెన్ కూడా బాగా ఖరీదు. ఏదైనా చట్నీతో తింటారు కానీ కుష్క మాత్రం కూరాకుతోనే తింటారు. లేదంటే చికెన్ పులుసుతోనయినా తినాలి. ఒక్కొక్కదాని రేటూ, ఒక్కొక్క కాంబినేషన్. రేటూ హమాలీలందరకూ కంఠోపాఠం. కాఫీ, టీలకు ఒకటే రేటు. నీళ్ళ పాకెట్టు అర్ధరూపాయి.

కప్పులతో కాఫీ ఇవ్వటం మాయమయిపో యింది కదా. అరకప్పులు అంతరించాయి. వన్‌బైటూలు, త్రీలు పోయినాయి. ఈ ప్లాస్టిక్ కప్పులు, ఉగ్గు గిన్నెల కన్న చిన్నవి. ఉగ్గు గిన్నెలు చూడనివాళ్ళు, ఒక కప్పు కాఫీ ఆరు ప్లాస్టిక్ కప్పుల్లో పోయవచ్చునంటే అర్థం చేసుకోవచ్చు. అందులో కాఫీ, పుక్కి లించిన నీరంత కూడా ఉండదు. తాగి తేనేం? తాగకపోతేనేం? పిట్టతిళ్ళు, పిదప బుద్ధులు, పాడు కాలం, పాడు మనుషులు. పాడు లోకం!

ఆ చిట్టెడు కాఫీ అవురావురుమంటూ ఆరు పొరుపుకొని అమృతం సేవించినట్లు ఒక్కొ క్క చుక్క పీలుస్తుంటే అదో ఆనందం. అదో ఆహారం. అదో తృప్తి. కడుపు నిండే నా? కాలు నిండేనా? ఏదో తినాలి, తాగాలి తప్పదు, బతకాలి కదా!

లచ్చువక్క తన గంపలు హమాలీల కోసమే తెస్తుంది. అయితే మేస్త్రీలు, డ్రైవర్లు, క్లీనర్లు, డిపార్టుమెంటువాళ్ళు, కూలీలు, ప్రయాణికులు, ప్లాటుఫారం పిల్లలు, బిచ్చ గాళ్ళు వచ్చి తింటారు. కాఫీ, టీలు తాగే వాళ్ళు కాదు కానీ టిఫిన్ తినేవాళ్ళు పదీ-ఇరవై రూపాయల వరకు తింటారు. సాధా రణంగా నాలుగొందలు దాకా వ్యాపారం జరుగుతుంది. ఏ రోజయినా అయిదు వందలు రావచ్చు.

లచ్చువక్క అప్పు ఇవ్వదు. ఎవరూ అడ గరాదు. అడగటం నేరం. ఇంతెత్తున లేస్తుంది. ఆమె నోరంటే అందరికీ భయం. అప్పు అడిగేవాడికి హడలు. ఆమె దాన గుణం తెలిసినవాళ్ళు లేకపోలేదు.

లచ్చువక్క చేతికి భగవంతుడు ఏం వరం ఇచ్చాడో కాని ఆమె ఏం వంటకం చేసినా రుచిగా, శుచిగా, పసందుగా పంటికే కాదు, కంటికింపుగా ఉంటుంది. వాటిని వేడివేడిగా ఉంచటం, వడ్డించటం ఆమెకే చెల్లు. ఆమె

నోరంటే భయం కాని, వంటంటే వల్ల మాలిన ఇష్టం.

యం.జి. స్టేషన్ పక్కనే ఫస్టు రోడ్డులో ఇడ్లీ, వడ, దోసెలు ఉడుకుడుకివి వేస్తుంటారు, రెండు తోపుడు బళ్ళవాళ్ళు. పొగలెల్లుతుంటాయి. అయినా హమాలీలు అక్కడికి పోరు. ఈ గడ్డి మోసేవాళ్ళు ఆ గడ్డిని తినరు.

లచ్చువక్క రాగానే బెల్లం చుట్టూ ఈగలు మూగినట్లు నాయకుడి చుట్టూ అనుచర గణం చేరినట్లు, ఉత్తబిత్తల శ్రమజీవులు ఉన్న టవలు నెత్తికి చుట్టుకొని, డ్రాయరు కనిపించేట్టు అడ్డపంచె పైకి ఎగ్గట్టుకొని కుందు కూర్చుంటారు. ఆమె అందరికీ ఆదరంగా, తృప్తిగా కొసరి కొసరి వడ్డిస్తుంది. ఒకటో రెండో తృప్తిగా ఉండే మాటలు చెబుతుంది. ఆమె వడ్డించిన టిఫిన్ తింటే కడుపు నిండటమే కాదు, సంతోషం నిండిపోతుంది.

లచ్చువక్కకు అన్నదమ్ములు వీళ్ళే. కొడుకులు, కూతుళ్ళు లేరు. వీళ్ళే కొడుకులు, కూతుళ్ళు. ఆమెకెందుకో తల్లి గుణం వచ్చింది. వండి వార్చి వడ్డించే పనివల్ల కావచ్చు స్వభావమే కావచ్చు తల్లిలాగే ప్రవర్తిస్తుంది. తిట్టినా సరే, కోపం రాదు. పెద్దరికం వచ్చేసింది. ఆమెకు వయస్సు ముప్పై అయిదుకు మించదు. కొత్తగా చేరిన హమాలీకి ఎవరో ఏమో చెబితే, వాడు కల్లు తాగిన, కాలు కాలిన కోతిలాగా ఎగిరాడు.

"మాదిగోడు కడిగిన ఆ ప్లేటులో నేను తినను" అన్నాడు.

"మారాజు లెక్క మానేయి" అంది, లచ్చువక్కకు మండి.

"తినాల్ల" అన్నాడు.

"తినూ" అంది.

"ప్లేటు? "

"కడుక్కో!"


# కృతజ్ఞతాభివందనాలు



శ్రీ ఎన్. చంద్రబాబునాయుడు గారు
తెదేపా అధ్యక్షులు



శ్రీ వేం నరేందర్‌రెడ్డి గారు
శాసనసభ్యులు - మహబూబాబాద్



శ్రీ చల్లా చెన్నకేశవరెడ్డి గారు
తెదేపా జిల్లా ఉపాధ్యక్షులు - వరంగల్

మాజీ ముఖ్యమంత్రి వర్యులు
శ్రీ నారా
చంద్రబాబునాయుడు గారికి
యువ నాయకులు,
మహబూబాబాద్ నియోజకవర్గ
అభివృద్ధి ప్రదాత, స్నేహశీలి,
అనునిత్యం పార్టీ కోసం
పాటుపడుతూ మా
వెన్నంటి మాకు రాజకీయ
ప్రోద్భలాన్ని ఇస్తున్న

శ్రీ వేం నరేందర్‌రెడ్డి MLA మహబూబాబాద్ గారికి, శ్రీ చల్లా చెన్నకేశవరెడ్డి గారికి మరియు
నెక్కొండ మండల ప్రజానీకానికి, వ్యాపార వాణిజ్య వర్గాలకు, కార్మిక కర్షకులకు, ఉద్యోగ వర్గాలకు, మా మిత్రులకు,
శ్రేయోభిలాషులకు నాపై నమ్మకంతో MPPగా ఎన్నికగుటకు సహకరించిన పార్టీ కార్యకర్తలకు, నాయకులకు,
MPTCలకు పేరు పేరునా నా కృతజ్ఞతాభివందనాలు...

మీ అందరి ఆశీస్సులతో నెక్కొండ మండలాభివృద్ధికి
నిరంతరం పాటుపడతానని మనవి చేస్తూ....

సదా మీ సేవలో...

## చిల్లా రాందాస్, MPP నెక్కొండ
జి॥ వరంగల్. సెల్. 9440049504

"కడుక్కోను? "

"ఆకులో పెట్టుకొంటావా? "

"వొద్దు"

"నీకు తిండి కావల్లా, వొద్దా? ఆకలయి నాదా లేదా? తింటావా, మానతావా? "

"వాని చేతులు - ప్లేటు- తినను"

"తింటే తినులే! పోతే పోలే! తినేకి లేనోనికి ఎవుల్లేగాని పెడతారేంలే!"

"తినాల్లా!"

"తినుమల్లా! లేదంటినా? అంటు గింటు అనే మొగోడు మొనగోడు యెల్లు కొచ్చి నాడు. తింటే తిను! పోతేపోలే బేవార్సి నా కొడక! లెయ్!"

అతను మరేమీ మాట్లాడలేదు. ఆమె మాటకి ఎదురు చెప్పేవాళ్ళు లేరు. ఎవరూ ఏమీ అనలేదు. ప్లేటు తీసుకొని ఏం కావాలో చెప్పాడు. లచ్చువక్క నటించిన కోపం మాయమైంది. మళ్ళీ తల్లి అయింది. ప్రేమగా వడ్డించింది. ఆదరంగా పలకరించింది. అభిమానంగా చూసుకొంది. తిట్లు తిన్న హమాలీ కడుపునిండా టిఫిన్ తిని ఆనందంగానే ఉన్నాడు. అతడు నోరెత్తకుండా, నోరు మెదపకుండా ఎంత సుతారంగానో తిని ఆనందించాడు.

పిల్లి శాపానికి ఉట్లు తెగుతాయా అన్నట్లుగా ఆమె నోటి ప్రవాహానికి ఆ ప్రాంతం మునిగిపోయి ఉండాలి. ఆమె శాపనార్థాలకి ఆ హమాలి వంశం ఆ క్షణంలో అంతరించిపోయి ఉండాలి. కానీ అతను తిని త్రేన్చిన తరువాత అతని వంశం దినదినాభివృద్ధి చెంది, మూడు కడుపులు, ఆరుగురు పిల్లలులాగా వర్ధిల్లుతుంది.

అతణ్ణి ఆమె తిట్టిన తిట్లు మానం మర్యాద ఉన్న ఎవరినయినా ఆత్మహత్య చేసుకొనేట్లు చేసేవి అని ఎవరో గొణిగారు. ఆమె ఉరిమి చూచింది. ఆమె అలా తిట్టకపోతే అతను తగ్గడు. ఒకడు అలా మాట్లాడి వెళ్ళిపోతే ఆమె పరువు పోతుంది. అందరికీ లోకువ అవుతుంది. వాణ్ణి తిట్టాలి. తినేట్టు చేయాలి. ప్రేమగా వడ్డించాలి. మరొకరు అలా మాట్లాడకుండా, ప్రవర్తించకుండా చూచుకోవాలి. ఆమె అవస్థ ఆమెది. పరిస్థితి చేయిదాటితే ప్రమాదం. వాళ్ళ నోటికాడి కూడే కాదు తన నోటికాడి కూడు కూడా పోతుంది. అందుకే కోపం! అందుకే ప్రేమ!

లచ్చువక్క ఇటువంటి మాటలు మునుపు కూడా వింది. బదులు చెప్పింది. ఎంత డోసు అవసరమో అంత డోసు తిట్లమందు ఇచ్చి వాళ్ళ రోగం కుదర్చి, తన ఆరోగ్యం బాగుపడేట్టు చూసుకొంది. తన జోలికి ఆనాటి నుంచి ఈనాటిదాకా ఎవరూ రాలేదు. ఇప్పుడీ హమాలి. రేపటి నుంచి ఈ కొత్త కోతి మామూలు మనిషే!

అనంతపురంలో, ఆ మాటకొస్తే రాయల సీమలో మగవాళ్ళకో మంచి బుద్ధి ఉంది. వాళ్లు ఆడవాళ్ళను కొట్టవచ్చు తిట్టవచ్చు కానీ చంపరు. ఫ్యాక్షన్ తగాదాలలో కూడా చంపరు. వంశం పుటమార్చేటప్పుడు కూడా చంపరు. శత్రువు భార్య కొడుకును కంటుంది. తమ పగవాణ్ణి కని పెంచుతుంది అని భావించినప్పుడు కూడా చంపరు. ఆడవాళ్ళకు ప్రతీకార దృష్టి ఎక్కువ. శత్రువుల్ని హతమార్చటం కోసం విరోధుల ముఠాను పెంచి పోషిస్తుందని తెలిసినా . ఆమెను చంపరు. ఆమె పక్షాన జనం చేరి, చెప్పిన మాట విని, చేయమన్న పనిచేసి, చంపమన్న శత్రువుల్ని చంపి, ఆమె నాయకత్వంలో, పోషణలో నాయకురాలినిగా ఆమెను ఆరాధిస్తారు. అటువంటి నాయకురాలిని కూడా శత్రువులు చంపరు. ఆమె బలగాన్ని అంతం చేస్తే, ఆమెను హతమార్చినట్లుగానే భావిస్తారు. చెదురుమదురుగా మాతృస్వామిక సమాజ లక్షణాలు కనిపిస్తాయి.

లచ్చువక్క నాయకురాలి స్థానంలోకి చేరినట్లుంది. ఎవరేం అన్నా యంగటేసును వదలదు. అన్నవాడి పుర్రెలో బూజు

దులిపిందాకా వదలదు. మనుషుల్ని పోగొట్టుకోదు, అదే స్థితిలో తన మానం మర్యాదకు భంగం కలగనీదు. ఆమె గట్టిది. ఆ గట్టితనం ముందు జనం పరవశులు కావలసిందే. ఆమె చేతి వంటలు రుచి చూచిన వాళ్ళు ఆమె మాటలు పట్టించుకోరు.

యంగటేసు పనివాడా? అన్నా? తమ్ముడా? అయినోడా? మొగుడా? ఎవరికీ ఏమీ తెలియదు. కూలివాడిలాగా ప్లేటులు కడిగే పనిచేయిస్తుంది. ఎవరైనా ఆమెను తిట్టినా, తిమ్మినా ఆదుకునే పోలీసులాగా నిలబెట్టుకుంది. ఇంటిపనిలో, వంటపనిలో గొడ్డుచాకిరీ చేస్తాడు. ఆమె మాట జవదాటడు. చెప్పినపని చెప్పినట్లు చేస్తాడు. ఆమె కాలితో పని చూపితే చేత్తో చేసి చూపుతాడు. ఆమె సైగకు పరుగులు తీస్తాడు. ఆమె అంటే అతనికి అలివిమాలిన ఇష్టం! ఆమె యజమాని. తాను కూలి! ఆమె పెడుతుంది, తాను తింటాడు.

లచ్చువక్కకు యంగటేసు ఏమవుతాడు? అందరికీ ప్రశ్నే! వాళ్ళిద్దరూ ఎందుకలా ఉంటారో అందరికీ ఆశ్చర్యమే. వాళ్ళిద్దరికి మాత్రం ఏమీ ఆశ్చర్యం లేదు.




మూడు గదుల ఇల్లు లచ్చువక్క యంగటేసుల కష్టార్జితం. వంటగది పెద్దది. అందులోనే వాళ్ళ ఉద్యోగం. మధ్య గది వాళ్ళ పడగ్గది. ముందు గది స్టోరు. వంట గదిలో సరుకంతా ఉంటుంది. నాలుక్కుర్చీలున్నాయి. ఎవరైనా వస్తే కూర్చుంటారు.

పడగ్గది మహారీవిగా ఉంది. టీవీ ఉండ


# అపోలో నర్సింగ్ హోమ్

ప్రభుత్వ హాస్పిటల్ రోడ్, కరీంనగర్

ఫోన్స్: 0878 - 2265999, 2248999, 2249999

డా॥ శ్రీమతి సర్దారున్నీసా

MBBS, DGO



- ★ ల్యాపరోస్కోపిక్ సర్జరీ
- ★ అల్ట్రా సౌండ్ స్కానింగ్ (Rt 3200) Wipro-GE
- ★ ఎలక్ట్రానిక్ Foetul Monitoring
- ★ మహిళలకు అధిక ఋతుస్రావానికి ఆపరేషన్ లేకుండా ఆధునిక బెలూన్ థెరపి

సంతానం లేని వారికి ప్రత్యేక చికిత్స

టమే కాదు షోగ్గానూ ఉంది. కరెంటు లేనప్పుడు మోగే ట్రాన్సిస్టరుంది. పాత రేడియో కూడా ఉంది. పాటలు వింటూ ఆమె ఎంత పనయినా చేస్తుంది.

ఇంటివి ఇటుక గోడలు, తీరుబండల ఇల్లు. కడప బండల ఫ్లోరింగు, ఇల్లు శుద్ధంగా ముచ్చటగా ఉంది. వంటగదిలో సామాన్లు, ముందు గదిలో సరుకులు, మధ్య గదిలో మంచం. ఆ మంచం డబుల్ కాట్. ఇనపది. శుభ్రంగా దోమతెర. ఆరంగుళాల మందమున్న బూరుగ దూది పరుపు. ఎంబ్రాయిడరీ కవర్లున్న రెండు దిళ్ళు. చలువ చేసిన తెల్లటి బెడ్‌షీటు. పెద్ద రగ్గు.

మరుగుదొడ్డి బయట బాత్‌రూం. స్నానం చేసిన యంగటేసు టీ.వి. చూస్తూ మంచమెక్కి కూర్చున్నాడు. లచ్చువక్క ఆ పనీ, ఈ పనీ చేసుకుంటున్నంతసేపు మంచం మీద కూర్చునే టీవి చూస్తూ ఉన్నాడు. ఆమె ప్లేటులో అన్నం పెట్టి ఇస్తే నడి మంచం మీద కూర్చునే తిన్నాడు. ఆమె చేయి కడిగింది. మూతి కడిగింది. తుడిచింది. పడక పరీక్షగా చూసింది. మెతుకు పడలేదు. తడి అంటలేదు. అన్నం బాగా తినగలిగిన మనిషి అక్కడ అన్నం తిన్నాడని చెప్పే, చూపే, అనిపించే ఆనవాళ్ళు ఏమీ లేవు.

యంగటేసుకు చుట్ట, బీడి, సిగరెట్టు అలవాటు ఇప్పుడు లేదు. ఒకప్పుడు ఉండేదో లేదో చెప్పటం కుదరదు. అలవాటు ఉంటే మానేశాడో, ఆమె మాన్పించిందో కూడా తెలియదు. సారాయి, బ్రాందీ, విస్కీ, కల్లు గిల్లు జాన్తానై. ఆమె ఇస్తేనే మంచినీళ్ళు, సోడానీళ్ళు, నన్నారి, చీని జ్యూసు తాగుతాడు. ఆమెకు ఇష్టంలేని పని చేయడు, ఇష్టమున్న పని మానడు, కష్టం కలిగించడు. తనకు ఇష్టమైనా ఆమె కష్టమనుకుంటే చేయడు. ఆమెను మాట అనడు. కొట్టటం అతనికి చేత కాదు. ఆమె ఎంత చెబితే అంత. వీధిలో వాళ్ళు ఇద్దరూ మాట్లాడుకోరు. ఎవరి పని వాళ్ళకు తెలుసు. ఇంట్లో మాత్రం 'కద్రిదానా' అంటాడు. 'యాం యద్రోడా' అంటుంది.

లచ్చువక్క అన్నం తిని, అన్నీ సర్ది, మూతి తుడుచుకొని, తమలపాకులు - మంచి కారపాకులు - ఈనెలు తీసి, సున్నం రాసి, వక్క పలుకులు వేసి మడుపు చుట్టి ఇస్తే తీరికగా నములుతుండగా, ఆమె వక్కలు నమిలి, ఆ సున్నం రాసిన ఆకులు కొరుకుతూ ఉంది.

తమలపాకు రసం మింగి ఒక్కొక్కమాట చెబుతూ ఉంది. ఆ మాటలకేం పెద్దగా అర్థం పర్థం లేదు. కాళ్ళ దగ్గర కూర్చుంది. ఊరికే కూర్చోలేదు. కాళ్ళు వత్తుతూ



ఉంది. ఊరికే నవ్వింది. కాసేపు నవ్విం చింది. 'ఇంత పని జేసినావు యంతోపికే నీకు' అని మెచ్చుకొన్నాడు ఆమెను యంగ టేసు.

' "పాపం నీకు మాత్రం!"

"ఇటురా!" అన్నాడు. పోయింది. పైట కొంగు పట్టుకొన్నాడు. ఒద్దికగా జరిగింది. ఒదిగింది.



"యేందీ సెంగు-యేందీ తడి?" అన్నాడు.

"తడా?"

"ఊ! మార్చుకో!" యంగటేసు ఆ మాట అంటే సిలుకు చీరె కట్టుకోవాలి.

మారు మాట లేకుండా పోయి సిలుకు చీర మార్చుకొని వచ్చింది.

వాళ్ళిద్దరూ అనంతపురం వచ్చి ఇరవై ఏళ్ళయింది. వచ్చినప్పుడు వాళ్ళ వయస్సు పదిహేను, ఇరవై యేళ్ళ మధ్య ఉంది. ఇప్పు డూ అంతే! అప్పట్లో పొద్దుటిపూట దోసెలు పోసి అమ్మేది. క్రమంగా ఇడ్లీ, వడా వేసి అమ్మసాగింది. పొట్టి శ్రీరాములు మునిసిపల్ హైస్కూలు పిల్లలు వచ్చినకాడ నుంచి వెళ్ళిపోయిందాకా బఠానీలు, దోసగింజలు, వేయించిన సెనగలు, సెనక్కాయలు, చాక్లెట్లు అమ్మేది. ఆపైన ఏ ఉద్యోగం లేదు. ఇంత వండుకొని ఇద్దరూ తిని పడుకోవటమే!

యంగటేసు ప్రత్యేకంగా ఏ పనీ చేసేవాడు కాడు. ఆమె ఏం చెబితే అదే చేసేవాడు. ఆమె వెంట ఉండేవాడు. ఒంటరిగా ఉండనిచ్చేవాడు కాడు.

స్కూలుకు సెలవులు ఇచ్చినప్పుడు వాళ్ళుండే ఐదో రోడ్డులోనే సాయంకాలాల్లో మిరబ్బజ్జీలు, ఆలుబజ్జీలు, అలసంద వడలు అమ్ముతూ ఉండేది. రాత్రయితే రకరకాల తాగుబోతులతో తలనొప్పులు వస్తుంటే బజ్జీల వ్యాపారం మానేసింది.

లచ్చువక్క పట్టింది బంగారం కావటంతో రెండు సెంట్ల స్థలం, మూడు గదుల ఇల్లు, సంపాదించుకోగలిగింది.

ఎత్తూ పొడుగు, ఠీవీ దర్పం ఉన్న శోభన్ బాబు లాంటి యంగటేసును పక్కింటి

విధవ, పైసలున్న ఆడది, పట్టుకోవాలనో, పెట్టుకోవాలనో, కట్టుకోవాలనో చూస్తుందని గ్రహించిన లచ్చువక్క ఉరిమిన పిడుగై ఆమె నెత్తిన పడేసరికి అయిదో రోడ్డులో ఆమె అంటే హడలయింది.

బజ్జీలమ్మి రాత్రిపూట లచ్చువక్క తిరిగి వస్తుంటే తాగుబోతు టలారోడు 'రావే నా రంగుల సిలకా, పదవే పంచవన్నెల రాం సిలకా, సూడవే నా సుందరాంగి సినిమా ఏకటరా! రంగుల రాట్నవా, బంగారు కముజుపిట్టా, బఠానీ బుట్టా' అంటూ చేయి పట్టుకుంటే చెంప పగలగొట్టింది. వాడు తిరగబడి, ఎగిరిపడి, జారిపడి, అడ్డం పడితే, సున్నం కట్టు కట్టటానికి పనికి రాకుండా ఎముకలు నున్నగా విరగ్గొట్టింది. నెలరోజులు దాకా వాడు ఇల్లు కదల్లేదు, కల్లు, సారాయి తాగలేదు. వాడి కాళ్ళ చేతుల కట్లు విప్పలేదు. ఏ ఆడపిల్ల చేయీ పట్టుకోలేదు. రోడ్డు మీదికి రాలేదు, వచ్చి కుంటకుండా పోలేదు. నడక బాగుండాలంటే నడత బాగుండాలని నలుగురు చెప్పుకోటానికి ఉదాహరణగా మారాడు.

ఎప్పట్నుంచో పీర్ల సావిడికాడ అల్లం గుండుంది. దాన్ని ఎత్తి ఈ మధ్యకాలంలో భుజం మీదగా వెనక్కు పడేసిన వాళ్ళు లేరు. అప్పుడెప్పుడో పిల్లలంతా అక్కడ చేరి, దానిమీద కూర్చునే ఆట ఆడుతుంటే, అది దొర్లే ఆట ఆడుతూ ఉండేది. అటే వస్తున్న యంగటేసు దొర్లుతున్న దాన్ని ఆపి, అనుకోకుండా పట్టుకొని, ఉన్నట్టుండి ఎత్తుకొని, అదేందో అని నెత్తిన పెట్టుకోబోయి భయపడి వెనక్కు పడేసి వెళ్ళిపోయాడు.

అప్పటి నుంచి అల్లం గుండెత్తిన హీరో అయిపోయాడు యంగటేసు. పిల్లలకు అతడే టార్జాన్, స్పైడర్‌మేన్. బాలయ్య అభిమానుల సంఘంలో నాయకుడు యంగటేసే! అప్పటి నుంచి యంగటేసును జయప్రద మొగుడనీ, హీరో అని, రుస్తుం అనీ పిలవసాగారు జనం. జయప్రద అంటే లచ్చువక్క. ఆమె జయప్రదలాగా ఉంటుందని అందరూ చెప్పుకొంటారు. ఎవ్వరైనా ఆమె ఎదుట ఏమైనా అంటే మెట్టేట్లు పడతాయి.

యంగటేసు అంటే నలుగురికీ భయమున్నా కాళ్ళిరిగి నడక నేర్చుకున్న తాగుబోతుకు మాత్రం కోపం ఉంది. దూరంగా ఉన్నప్పుడు 'మాదిగోడు' అని పిలిచేవాడు. దగ్గరగా ఉంటే 'మాదిగోడు' అని గొణిగేవాడు. ఒకసారి చేయి పట్టుకొని తాగుబోతును వదల్లేదు. 'యాం' అంటే, 'ఇడిపిచ్చుకొని పో' అన్నాడు. వాడు పెనుగులాడాడు. సాధ్యం కాలేదు. ఏడుపు ముఖం పెట్టాడు. వాడు వీధికంతా రౌడి! లీడరు. వాడు యంగటేసు చేతిలో గిలగిలలాడుతుంటే అందరూ ఎగతాళిగా పకపకా నవ్వారు. వాడికి ఏడుపు వచ్చింది. ఏంచేయాలో తోచలేదు. యంగటేసు చేయి వదిలి 'భద్రం పై భద్రం' అన్నాడు.

తాగుబోతుకు లచ్చువక్క యంగటేసులతో అవమానమయి, పూలమ్మిన చోట కట్టెలమ్మలేక రౌడీయిజం చెల్లక, ఎవరినైనా ఏమన్నా అంటే వాళ్ళ అక్కతో చెబుతామనో, అన్నతో చెబుతామనో బెదిరించేది చాలక, 'ఇంకా కాళ్ళిరగాలా, చెయ్యిరగాలా' అని అడిగేవాళ్ళు ఎక్కువ కావటంతో, వాడు కనబడకుండా పోయాడు. అయిదో రోడ్డులో అయిపు లేదు. అనంతపురంలోనే పత్తా లేదు. ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో!

లచ్చువక్క తెగింపుకీ, నోటికీ, యంగటేసు కండపుష్టికీ, పిడికిలి బిగింపుకీ జడిసి జనం వాళ్ళను ఇబ్బంది పెట్టటం మానేశారు. క్రమంగా గౌరవించేది నేర్చుకొన్నారు.

లచ్చువక్క తెలివయింది. యంగటేసు బలమైనవాడు. ఆమె మాట అతనికి వేదవాక్కు. ఆమె వంటిమీద ఈగ వాలితే చచ్చిపోతుంది. చంపేస్తాడు. యంగటేసు మీద ఎవరి కన్నయినా పడిందా, గుడ్లు పీకి

చేతిలో పెడుతుంది లచ్చువక్క.

వీళ్ళ అన్యోన్యత పెద్దవాళ్ళకు సంతోషం, చిన్నవాళ్ళకు ఆసక్తి, తోటివాళ్ళకు ఆశ పుట్టించేది. వాళ్ళిద్దరిని అందరూ మొగుడూ, పెళ్ళాం అనుకునేవాళ్ళు. కొందరు కాదనేవాళ్ళు, మిండగాడు, మిండగత్తె అనేవాళ్ళు. వాళ్ళ పెళ్ళి ఎవరూ చూడలేదు. మెడలో మంగళసూత్రం ఉంది. పిల్లల్లేరు. ఇరవై ఏళ్ళు గడిచాయి. వాళ్ళిద్దరూ ఎవరిని ఎవరో లేపుకువచ్చారని చెప్పుకుంటారు. వాళ్ళ వాళ్ళు ఎవరూ రారు. ఏ ఊరివాళ్ళో తెలియదు. ఏ కులంవాళ్ళో తెలియదు. ఆమెను శూద్రపామె అంటారు. అతన్ని మాదిగ మనిషి అంటారు. ఏది నిజమో తెలియదు.

యంగటేసును పనిమనిషిగా భావించి పనులన్నీ చెప్పి చేయిస్తుంది. కాపలా మనిషిగా చూచి కాపలా పని చెబుతుంది. ఆమె మిసమిసలు చూస్తే పసి మీసాలు కూడా నిక్కబొడుచుకొంటాయి. ఆమెకో అండ కావాలి. తోడు కావాలి. నీడ కావాలి. గొడుగు కావాలి. గోడ కావాలి. కోట కావాలి. ఇవన్నీ కావటంతో పాటు యంగటేసు అండ అయ్యాడు. కొండ అయ్యాడు. కోట అయ్యాడు. అనంతపురంలో ఆమెను అందాల సుందరాంగిని చేశాడు. ఆమెకు అవయవాలే ఉన్నాయి. అవి అందాల మందిరాలుగా మారటం అతడి ఆదరణలోనే అని ఆమె నమ్మకం.




లచ్చువక్కది బెళుగుప్ప దగ్గర పల్లె. యంగటేసుదీ అదే! ఇద్దరిదీ ఒకే హైస్కూలు. లచ్చువక్క ఆరు నుంచి ఏడు కొచ్చింది. యంగటేసు తొమ్మిది నుంచి పదికి వచ్చాడు. ఆమెకు పైట వచ్చింది. అతనికి మీసం వచ్చింది. ఆమె బొంగరంలాగా తిరుగుతూ ఉంది. అతను చెరుకుగడ మాదిరిగా రెపరెపలాడుతున్నాడు.

అప్పుడు వచ్చింది హోలి. అంతలోనే వచ్చింది ఉగాది. వసంతం ఊరుకుంటుందా? లేదు. పరీక్షలు తెచ్చింది. స్కూలుకు వస్తూపోతూ ఉన్న యంగటేసును శోభన బాబు అనుకొంది లచ్చువక్క. ఆమెను చూచి కొండపల్లిబొమ్మే అనుకొన్నాడతను.

ఏడు లచ్చువక్కగానీ, పది యంగటేసుగానీ పాసు కావటానికి వాళ్ళేమయినా సామాన్యులయిన యువతీయువకులా? కాదు. పరీక్షల్ని కిందికీ, పైకీ, కుడికి ఎడమకి, ఎగరేసి పడేసి, తిరగేసి, బోర్లేసి, పడేసి లేపి చదివేరు. అసాధ్యమని తేల్చుకున్న యంగటేసు మాట వాస్తవమేనని లచ్చువక్క అంగీకరించింది.

తోవ పొడుగునా, చెట్టు నీడనా, బావి గట్టున, చేన్ల మధ్యన వీళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకొంటున్నారనీ, చేయి చేయీ పట్టుకొంటున్నారనీ, రాసుకు పూసుకు తిరుగుతున్నారనీ తెలిసి లచ్చువక్కను తల్లిదండ్రులు చదువు మానిపించారు. అయినా వాళ్ళు కలుసుకోవటం మానలేదు.

"మాదిగోనితోడి నీకేలనే ముదనష్టపు ముండా" అని లచ్చువక్కను వాళ్ళు తిట్టారు, కొట్టారు.

"ఉన్నింటి బిడ్డతో నీకేల నప్పొ" అని యంగటేసుని సొంతంవాళ్ళు అదమాయించారు. ఎవరూ వాళ్ళ మనసు మార్చలేదు.

"యంగటేసే నా మొగుడు" అని తిరుక్కుంది లచ్చువక్క.

"ఆయమ్మే నా బసేలి" అని ప్రకటించాడు యంగటేసు.

"సంపుతామన్నారు, సస్తామన్నారు. సావ

## పురాణం...

పొరపాటున ఎవరైనా 'ఎక్కడ నుంచి వస్తున్నారు స్వామీ?' అని అడిగితే వంగర పెద్ద పురాణమే చెప్పేవారు.

'ఏముంది? ఈ సినిమా ప్రపంచంలో తిరగడాలెక్కువ. ముందు వేషాల కోసం తిరగాలి. తర్వాత షూటింగ్ ఎప్పుడో తిరగాలి. తర్వాత డబ్బు కోసం తిరగాలి. తర్వాత సినిమా ఎప్పుడు వేస్తారో తెలుసుకోవడానికి తిరగాలి. దానికి మమ్మల్ని పిలుస్తారా అని కనుక్కోవడానికి తిరగాలి. ఆ తర్వాత మళ్లీ సినిమా ఎప్పుడో తెలుసుకోవడానికి తిరగాలి..'

మన్నారు, యాడన్నా సావమన్నారు. పోయి యాడనన్నా సావండి" అని వాళ్ళను బెదిరించారు. ఆ యువతీ యువకుల్ని తోవలోకి తేలేకపోయారు. కానీ ఈ రెండు కుటుంబాల మధ్య గొడవలు పెరగలేదు.

ఒక సుదినాన, తెల్లవారుజామున ఇళ్లు వదిలి వాళ్ళు వెళ్ళిపోయారు. 'లేచి పోయారన్నారు. 'లేపుకు పోయాడు' అనీ, 'లేపుకు పోయిందీ' అని చెప్పుకొన్నారు.

రెండు కుటుంబాల వాళ్ళు పీడ వదిలింది అనుకొన్నారేమో కాని, వాళ్ళు మాట్లాడుకోవటం లేదు. రెండు కులాల మధ్య సంఘర్షణలూ జరగలేదు. ఆ రెండు కుటుంబాల వాళ్ళ మధ్య పిలిస్తే పలికే సంబంధం ఎప్పటికి ఏర్పడుతుందో తేల్చి చెప్పటం కష్టం. ఒక్కటి మాత్రం సత్యం.

వాళ్ళెవరూ కూడా వీళ్ళ కోసం వెతకలేదు. అనంతపురంలో అయిదో రోడ్డులో ఉన్నారని తెలిసినా పోయి ఊరికి రమ్మని పిలవలేదు. "కుక్క మూతి పెట్టిన కుండ" అని లచ్చువక్కను, "వళ్ళూపైగాని మదపు ముండాకొడుక"ని యంగటేసుని వాళ్ళు పట్టించుకోలేదు. అది మొదలు వీళ్ళను చూడటానికి, పలకరించడానికి, పిలవడానికి, చివరకు తలవటానికి కూడా తల్లితండ్రులు, అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములు, అయినోళ్ళు ఎవరూ వాళ్ళ దగ్గరకు రాలేదు. ఈ రాకపోకలు లేకపోవటంతో ఆ రెండు కుటుంబాల మధ్య పచ్చగడ్డి భగ్గుమనటం లేదు. ఎండుగడ్డి కూడా మండటం లేదు. అసలు మంటే లేదు. అయితే మాటలు లేవు.

ఊళ్ళొదిలి, ఇళ్లొదిలి, బయలెల్లిన వాళ్ళిద్దరూ పెన్నోబులంలో ఆగారు. లక్ష్మీనరసింహస్వామి సాక్షిగా పెళ్ళి చేసుకొన్నారు. అంటే లచ్చువక్క మెడలో యంగటేసు పసుపుతాడు, పసుపుకొమ్మున్న పసుపు తాడు కట్టాడు. అది అనంతపురంలో గట్టిపడేసరికి సూత్రమయింది. మరికొద్ది కాలానికి బంగారు గొలుసుకున్న సూత్రమయింది.

ఇన్నేళ్ళయినా వాళ్ళకు పిల్లలు కలగలేదు. గుళ్ళు, గోపురాలు తిరిగారు. తిరుపతి వెంకటేశ్వరుణ్ణి, శ్రీశైల మల్లికార్జునుణ్ణి వేడుకొన్నారు. మేలు కలగలేదు.

డాక్టర్లను కలిశారు. ఆడ డాక్టర్లు పరీక్షించారు. మగ డాక్టర్లు టెస్టులు చేశారు. వీళ్ళు మందులు మింగారు. ఇంజక్షన్లు చేయించుకున్నారు. పరీక్షలకు నెత్తురిచ్చారు. ఏం చేయమంటే అది చేశారు. ఏమయింది? ఏమీ కాలేదు, పిల్లలు లేరు.

చేసేదేమీ లేక, పిల్లల్లేకపోయినా ఫరావా లేదనుకున్నారు. మనమిద్దరం మనిద్దరికీ పిల్లలం అనుకొన్నారు. అప్పటినుంచి వాళ్ళు పిల్లలు అయిపోయారు. వాళ్ళు ఒకళ్ళనొకళ్ళు పసిపిల్లలుగా చూసుకొన్నారు. సాకు కొన్నారు. అంతే వాళ్ళ మధ్య విశేషంగా ప్రేమ పెరిగింది. సఖ్యత పెరిగింది. ఒకరిమీద మరొకరికి గౌరవం పెరిగింది. ఒకరి అవసరం మరొకరికి ఎక్కువ

యింది. చివరికి 'నాకు నువ్వు - నీకు నేను' అనుకొన్నారు. దానితో లచ్చువక్క ఏం చెప్పినా యంగటేసు మారుమాటాడ కుండా వింటాడు, చేస్తాడు. లచ్చువక్క యంగటేసుకు నొప్పి కలగనివ్వదు, మాట రానీదు.

తమ వాళ్ళు ఎవరూ తమకాడికి రావ టం లేదు కాబట్టి, తామెవరికాడికి పోవటం లేదు. రాకపోకలు ఇరుపక్షాల నుంచి బందే!

వాళ్ళ చదువులు వాళ్ళకు కూడు పెట్ట లేదు. వాళ్ళ రెక్కల కష్టమే వాళ్ళను పోషించింది. లచ్చువక్కకు వంట బాగా చేయటం వచ్చు. అదే వాళ్ళ వరం. అదే వాళ్ళ జీవనమార్గం. అదే బ్రతుకుదెరువు.

ఇల్లూ వాకిలీ ఏర్పడ్డాయి. ఇంటికి కావ లసిన సామాన్లు సమకూరాయి. బేంకులో సొమ్ము పెరుగుతూ ఉంది.

రేపు కాలూ చేయీ ఆడకపోయినా, ఏమీ ఇబ్బంది లేకుండా, అన్నీ మామూ లుగా ఉండేటట్లు అన్ని ఏర్పాట్లు చేసుకొ న్నారు. ఆరోగ్యంగా ఉన్నప్పుడే పనిచేస్తే శక్తి ఉన్నప్పుడే కూడబెట్టుకొనే దృష్టి పెట్టు కొన్నారు. పిల్లాజెల్లా లేరు కాబట్టి, ముసు ముందు తమని తామే చూసుకోవాలి కాబట్టి, భవిష్యత్తును గూర్చిన జాగ్రత్తలు తీసుకున్నారు.

యంగటేసు ఎవరినీ ఏమీ అనడు. ఎవ రన్నా అతన్ని ఏమన్నా అంటే లచ్చువక్క ఊరుకోదు. లచ్చువక్క కూడా మాట అనదు, పడదు. భార్య జోలికి ఎవరొచ్చినా అతనూరుకోడు. ఎప్పుడు మాట్లాడని, ఎదు రాడని యంగటేసు ఎప్పుడైనా, ఏమయినా చెబితే ఆమె వెంటనే వింటుంది. ఆచరి స్తుంది. చాలా అన్యోన్య దాంపత్యం.

పెందలాడే నిద్రలేచి, స్నానం చేసి, ఉతి కిన చీర కట్టుకొని బొట్టూ, కాటుక పెట్టు కొని, తలనిండా పూలు పెట్టుకొని, మంచం కాడికి వచ్చి, యంగటేసు కాళ్ళకు మొక్కి, కళ్ళకద్దుకొని అతడు కదులుతుంటే 'బజ్జోమారాజా బజ్జో' అంటూ వంట గది లోకి పోయింది.

సూర్యోదయం కంటే ముందే వాళ్ళు బయలెల్లాలి. ఆకలయిన లోకం ఎదురు చూస్తుంటుంది.

లచ్చువక్క గంపలెత్తుకుంటే మగరా యుడే. కమాండర్, మంచి లీడరు.

యంగటేసు మంచి అనుచరుడు. 'ఊ' అంటే 'ఊc', 'ఆ' అంటే 'ఆc!' రాత్రి అతను నాయకుడు, లచ్చువక్క నాయిక, అతనో హీరో, ఆమె హీరోయిన్.

తెల్లవారితే ఆమె యజమాని, అతను సేవకుడు, ఆమె మాట, అతను చేత.

లచ్చువక్క రాత్రిపూట అసలు సిసలు ఆడ మనిషి, తెల్లవారితే మగమనిషి, మీసాల్లేకపోయినా ఆమె సింహం, మీసా లున్న అతను మేకపోతు.

ఆమెది అందమయిన ఆడమనిషి ఆకా రమే! లోపల ఇనుం, ఉక్కు, స్టీలు, కాఠి న్యమూ, లౌక్యమూ కలగలసిన వ్యాపారి ఆమె.

తిని లెక్క ఇవ్వకుండా ఎవరే కానీ వెళు తుంటే ఉరుముతుంది. ఆపుతుంది. లెక్క వసూలు చేస్తుంది. వాళ్ళు సక్రమంగా ఉంటే ఆదరం చూపుతుంది. అక్రమంగా ఉంటే భద్రకాళి అవుతుంది.

కోపం, దయ కలగలసి ఉంటుంది ఆమె. ప్రేమను కోపంగా చూపుతుంది. కోపాన్ని దయగా చూపుతుంది. ఒక్కోసారి మనస్సు వెన్న, మాట గుండు. మరోసారి మాట వెన్న, మనస్సు గుండు.

ఆమె రాయిగా ఉంటే అతను వెన్నగా ఉంటాడు. ఆమె వెన్నగా ఉంటే అతను రాయిగా ఉంటాడు. వాళ్లిద్దరూ ఒకేసారి రాయిగా, వెన్నగా రాత్రి తప్ప ఉండరు.

వాళ్లు ఎప్పుడు ఎలా ఉన్నా ఇద్దరి

మాటలు, మనసులు, ఆలోచనలు, ఆచరణలు ఒక్కటే!




గూడ్సు షెడ్డులో నుంచి బయలుదేరిన గడ్డి లారీలు గేటు దగ్గరకు రాకముందే లెవల్ క్రాసింగ్ గేటు వేశారు. న్యూఢిల్లీ నుంచి బెంగుళూరు పోయే కర్ణాటక ఎక్స్‌ప్రెస్ బి.జి.లో వస్తుంది. గుంతకల్ నుంచి పాకాల పోయే పాకాల పాసింజరు యం.జి.లో వస్తుంది.

గేటు వేసినా, నడచిపోయేవాళ్లు నడుస్తూనే ఉన్నారు. సైకిళ్ల వాళ్లు దిగి, వంగి సైకిల్ వంచుకొని లేచి, సైకిలెపి తీసుకొని వెళ్తున్నారు. మోపెడ్లు, స్కూటర్లు, మోటార్‌సైకిళ్లు కూడా వంచుకొని దాటిపోతున్నారు జనం.

గేటు వేసినందువల్ల ఆగిపోయిన ఆటోలో నుంచి 'కర్ణాటక'లో బెంగుళూరు పోవాలని, గేటు తీయమని ముసలామె గోల చేస్తూ ఉంది. ఆటోలు చిక్కురొక్కురుగా ఇటూ అటూ నిలబడ్డాయి. రైళ్లు వస్తేగాని గేటు తీయరు. గేటు తీస్తే కాని ఆటో పోదు. ఆటో స్టేషనుకు పోయేలోగా 'కర్ణాటక' వెళ్లిపోతుంది. ఆమె లబోదిబోమంటూ ఉంది.

ఎండాకాలం ఇళ్లు కట్టేది ఎక్కువ. రాళ్లు తోలే లారీలు, కంకర తోలే ట్రాక్టర్లు, ఇసుక తోలే బళ్లు ఆగి ఉన్నాయి. తాడిపత్రి నుంచి కడప బండల లోడుతో వచ్చిన లారీ విరామం లేకుండా హారన్ కొడుతోంది. పూర్వం నుంచి ఉన్న స్కూలు బస్సులు, ఈ మధ్య పుట్టుకొచ్చిన ఇంజనీరింగు కాలేజీ బస్సులు, పది గంటలకంటే ముందుగా గమ్యస్థానాలు చేరాలని ఇంజన్లు ఆపుకోకుండా తుర్రుబుర్రు మంటున్నాయి. అటొక ఫర్లాంగు, ఇటొక ఫర్లాంగు దూరం మనిషిని వేస్తే బయటికి రాలేనంతగా కిక్కిరిసి వాహనాలు నిలబడి పోయాయి.

ఇటు వందగజాలు దాటితే ఫస్టు రోడ్డు, అటు యాభై గజాలు దాటితే రామచంద్రనగర్. గేటు పడ్డప్పుడు ఈ దూరం దాటటమే గండం. గండం గడిచి పిండం బయటపడే సరికి ఆగిన వాహనాలు కదలటానికి మొండికేస్తాయి. గేటు ఎత్తినా వాహనాల కదలిక చీమ నడకలా, నత్తనడకలా నెమ్మదిగా సాగుతుంది.

బళ్లారి రోడ్డుమీద ఓవర్‌బ్రిడ్జి వేసినట్లుగానే ఇక్కడా అవసరమని జనం అనుకొన్నారు. గవర్నమెంటూ అంగీకరించింది. బడ్జెట్ అప్రూవ్ అయింది. యం.పి. లాడ్స్ నుంచి నిధులు కేటాయించిన సైపుల్లా తన పేరిట బ్రిడ్జి ఉండాలని కోరటమూ అంగీకరించారు. కొందరింకా తిరస్కరిస్తూనే ఉన్నారు. రామచంద్రనగర్ వైపు పనిపూర్తి అయింది. రైలు ట్రాక్‌ల మీద పని జరిగిపోయింది. ఫస్టు రోడ్డువైపు పని ఆగిపోయింది.

కారణం? టిటిడి కళ్యాణమండపం ఉంది. దానికంటే ఎత్తులో బ్రిడ్జి ఉండకూడదని ఒక ఆటంకం, వాటర్ టాంక్ పక్క స్థలం బ్రిడ్జి కోసం కేటాయించటంలో మరో ఆటంకం కాగా పనులు ఆగిపోయినట్లు అభిజ్ఞవర్గాల భోగట్టా!

ఏమయితేనేం? బ్రిడ్జి పూర్తికాలేదు. పని ఆగిపోయింది. కానీ ట్రాఫిక్కు సాగిపోతూనే ఉంది. మనుషులు తిరుగుతూనే ఉన్నారు. జనం పెరుగుతూనే ఉన్నారు. పిల్లలు పుడుతూనే ఉన్నారు.

ఈ గేటు, ఈ రోడ్లు, ఈ ఏర్పాటు అనంతపురంలో ముప్పైవేల జనాభా ఉన్నప్పుడు

జరిగాయి. మూడు లక్షలయినప్పుడు కావల సిన మార్పులు జరగటానికి ఆటంకాలకేమీ కొదవలేదు.

'కర్ణాటక' వస్తుందని గేటుమేన్ చిన్న వాహనాల వాళ్లని, కాలినడకల వాళ్లను వారించాడు. అయినా వాళ్లు క్రాసు చేస్తూనే ఉన్నారు.

'కర్ణాటక' వస్తుంటే భూమి అదురుతుంది. భూమిమీద నిలబడ్డవాళ్లు అదురుతారు. అది దగ్గరయిన కొద్దీ అదురుడు ఎక్కువవు తుంది. కర్ణాటక రూపం చూసి, దానివేగం చూసి, నేల అదురుడు గుర్తించి ఏమయిం దో ఏమో తల్లి చంకలో ఉన్న పాపోడు ఉచ్చలు పోసుకున్నాడు. ఆమె రొండి తడి సింది.

'కర్ణాటక' స్టేషన్‌లోకి పోయినా గేటు తీయలేదు. వెళ్దామని సిద్ధమవుతున్న వాహ నాల వాళ్లకు చికాకు కలిగింది. పాకాల పాసింజరు కోసం వేసిన గేటు వేసినట్లే ఉంది.

బెంగుళూరు పోవాలన్న ముసలామె అరుపు ఏడుపుగా మారింది. స్కూళ్లకు ఆల స్యమవుతుందని పిల్లల గోల. ఆటోలు హారన్లు మోగిస్తూ వాటి అసహనం ప్రకటి స్తున్నాయి.

పాకాల పాసింజరు కూత వినిపించేసరికి అందరికీ ప్రాణం లేచి వచ్చింది. అది మలుపు తిరిగింది. వచ్చిందనుకొన్న రైలు స్టేషన్‌కు చేరటానికి చాలా సమయం పట్టిం ది. అది మీటర్‌గేజ్ బండి. అంతే! అంత కంటే వేగం రాదు, పోదు. 'కర్ణాటక'ను చూసిన కళ్లతో ఈ పాసింజరును చూస్తే- రాజును చూసిన కళ్లతో- అన్న సామెత గుర్తుకు వస్తుంది.

రైళ్లు రెండూ వచ్చి లెవలు క్రాసింగు దాటి పోయాయి. అయినా ఫోను రాలేదు. వస్తే గాని తాళం రాదు. అదృష్టం. తొందరలోనే ఫోను వచ్చింది. తాళం చెవి గేట్‌మేన్ బయటికి తీశాడు. అది మోచేయి అంత పొడుగుంది. దాన్ని పెట్టి లాక్‌తీస్తే గేటు పోల్స్ రెండువైపులా ఆకాశంలో వింతలు చూద్దామని లేచి నిలబడ్డాయి.

అప్పుడు వాహనాల ప్రవాహం కావాలి. కాలేదు. అందరూ ముందే పోవాలి. ఎవరూ పోవటం లేదు. సందు లేదు. అరు పులు, కేకలు, తిట్లు, హారన్లు! చీమల నడక మొదలైంది. నత్తనడక సాగింది.

ఫస్టు రోడ్డులోకి పోవటానికి రామచంద్రన గర్ వాహనాలు, రామచంద్రనగర్‌లోకి పోవ డానికి ఫస్టు రోడ్డు వాహనాలు పోటీ పడు తుంటే, రెండు పక్కలకూ పోవటానికి గూడ్సు షెడ్డు నుంచి వచ్చిన గడ్డి లారీలు దేబిరిస్తూ నిలబడ్డాయి.

ఫస్టు రోడ్డులో టిటిడి కళ్యాణమండపం ఉంది. ఇంకో గంటలో అక్కడొక పెళ్ళి. సీతా వెడ్స్ రామా చెమ్కీబోర్డు. పెళ్ళి బస్సులు రోడ్డు మీదే ఉన్నాయి. మండపం లోపల కార్లు, టైరు బళ్ళు, స్కూటర్లు, మోటా ర్ సైకిళ్ళు, సైకిళ్ళు స్నేహంగా చెట్టాపట్టాలే సుకుని నిలబడి కబుర్లు చెప్పుకొంటున్నాయి. అప్పటికీ మండపం బంధుమిత్ర సపరివార సమేతంగా నిండిపోయింది. వండుతున్న వంటకాల వాసనలు ఆకలి రేపుతూ జీవితం మీద ఆసక్తిని కలిగిస్తున్నాయి.

మండపం ఎదుట షాపులున్నాయి. అక్క డ కొనేవాళ్ళు వస్తూపోతూ పద్మవ్యూహంలో ప్రవేశించటం, నిష్క్రమించటం తెలుసుకున్న అభినవ అభిమన్యుల్లాగా ప్రవర్తిస్తున్నారు. వాళ్ళు వాళ్ళ సైకిళ్ళు తీసుకొని క్రాస్ వర్డ్ పజిల్ పూర్తి చేస్తున్నట్లు వెళుతున్నారు.

పెళ్ళి బస్సుల పక్క అరటిపళ్ళ బళ్ళు, పూల అంగళ్ళు, ఎల్నీరుగాయ తోపుడుబళ్ళు, నాగపూరు కమలాల బండి సందు లేకుండా చేశాయి. నేల మీద ముసలమ్మ బొప్పాయి కాయలు పెట్టుకొంటే, పెద్దాయన కళింగర పుచ్చకాయల అంగడి పేర్చాడు.

ఇప్పుడు రోడ్డుమీద ఒక్క లారీ మాత్రమే రాగలదు. లేదా పోగలదు. కార్లు, ఆటోలు ఇరుక్కుపోతే ఏవీ పోవు, రావు.

ఇద్దరు డ్రైవర్లు తమ లోడు లారీలు తెచ్చి ఎదురెదురుగా పెట్టుకొని, హారన్లు వేస్తూ అరుస్తూ గోల చేస్తున్నారు. ఎవరూ మాట వినటం లేదు. ఒక లారీలో కాలుపు బండలు, మరో లారీలో సర్కారు ఎండుగడ్డి.

ఏ లారీ ఏ లారీకి తోవ ఇవ్వాలి. ఎటు పోవాలి. ట్రాఫిక్ పోలీసు లేడు.

"హారన్లు! అల్లరి! గోల!"

"తప్పుకో! తప్పుకో!"

"తట్టుకో! తట్టుకో!"

"నెట్టొద్దు! తోయొద్దు!"

"పోలే! మూతి పళ్ళు రాలాల్ల!"

"ఇంట్లో అడ్రసు ఇచ్చి వచ్చినావా"

"పై బగలల్లా? "

"పోలే! పోలే నీ..."

"ఛీఛీ!" "థూథూ!"

బూతు పురాణం. విరామమెరుగని శబ్ద సామ్రాజ్యం.

బూతులకే శక్తి ఉంటే, శాపనార్థాలకే ఉట్లు తెగితే, ప్రాణాలు పోవా? చంపటం, చావటం ఎందుకు?

గడ్డి లారీని చూసి, రెండు ఎనుంగొడ్లు, రెండావులు, రెండు దూడలు ఎగబడి వచ్చాయి. వాటి ధాటికి గవర్నరుకు తోవ ఇచ్చినట్లు ఎక్కడివాళ్ళు అక్కడ తప్పుకొన్నారు.

అయినా రెండు ఎనుంగొడ్లు, ఒక సైకిల్‌ను తోసి ఇద్దరి పిల్లలను పడేసి ఆటోను గుద్ది, గడ్డి దగ్గరకు చేరి, తీరుబడిగా అందిన మేరకు మేస్తూ ఉన్నాయి. మండపంలో నుంచి వచ్చిన ఆవులు పూల మాలచ్చి పూల అంగడి పడేసి, వడ్డించిన విస్తరిలాంటి లారీ ని చేరుకున్నాయి. పూల మాలచ్చి గోమాతల్ని తిట్టరాని తిట్లు తిడుతూ పూల అంగడి సర్దుకొంటూ ఉంది.

గడ్డిలారీని పాల



నాగమ్మ చూడనే చూసింది. ఉరుకులు పరుగుల మీద వచ్చింది. లారీలో గడ్డి అందిన మేరకు పీకసాగింది. కిందపడ్డ గడ్డిని దూడలు మేయసాగాయి. మోయగలిగినంత గడ్డి పెరుక్కొని పాలనాగమ్మ వెళ్ళిపోయింది.

వాహనాలు కదులుతున్నాయి. బెల్లం చుట్టూ మూగే ఈగల్లాగా, పశువులు గడ్డి లారీలను వదలటం లేదు. దొరికినకాడికి పీక్కు తింటున్నాయి.

పాలనాగమ్మ పాత పోస్టాఫీసు సందులో రామచంద్రనగర్‌లో ఉంటుంది. వీధుల్లో తిరిగే ఆవులు, ఎనుంగొడ్ల గుంపులో ఆమె వాటా కూడా ఉంది.

మాయల ఫకీరు సినిమాలో కథానాయిక పాత్రధారిణి అందం, చందం నచ్చి తల్లిదండ్రులు ఆమెకు 'బాలనాగమ్మ' అని పేరు పెట్టారు. పెళ్ళయి, భర్తపోయి పిల్లల్లేని నాగమ్మ ఎనుంగొడ్లు మేపి, పాలు పిండి, అమ్ముతుంటే నలుగురూ ఆమెను బాలనాగమ్మ అనటం బదులు పాలనాగమ్మ అని పిలవసాగారు.

ఆమె ఇంటికి ఎదురుగా ఉన్న ఇమ్మాన్యుయేలు స్కూలు పిల్లలందరూ ఆమె పార్టీనే! ఆ స్కూలులో పాలు పోసేది ఆమే!

ఓటర్ల లిస్టులో, జనాభా లెక్కల్లో, ఇంటి గుత్త, కరెంటు బిల్లు, గ్యాసు పుస్తకంలో పేరు బాలనాగమ్మే. అందరూ పిలిచేది పాలనాగమ్మ అనే! తన పేరు ప్రఖ్యాతులు



తలచుకొని పులకించిపోయే పాలనాగమ్మ ముసిముసి నవ్వులు నవ్వుతుంది.

ఒక గడ్డిలారీ రామచంద్రనగర్, రైల్వే స్టేషను, గోవిందప్ప సర్కిలు దాటి ఆర్ట్సుకాలేజీ పక్కకు వెళుతూ ఉంది. ఆవులు, ఎనుంగొడ్లు అందినంత గడ్డి తిని నెమరు వేస్తూ రోడ్డువార పడుకొంటే, రోడ్డు డివైడరు పనిలో తోలగా వచ్చి నేలమీద పడుకొన్న రాళ్ళు, ఇసుక కాళ్ళారజాపుకొని పశువుల పక్క చూస్తూ ఆవులిస్తున్నాయి.

గడ్డి లారీని చూడగానే కాళ్లారజాపి పడుకొన్న పవిత్ర పశుసంపద ఒక్కసారిగా ఉలిక్కిపడి లేచింది. తగలబడుతున్న కొంప నిప్పు పేలి మరొక కొంప అంటుకొన్నట్లు, శత్రువు కోట ముట్టడించినట్లు లారీ మీదికి ఎగబడ్డాయి పశువులు.

లారీ స్పీడుగా తోలితే ఆవులు దెబ్బతిన వచ్చు, చావవచ్చు. గోహత్య చేయలేడు డ్రైవరు. చేయరాదు. ఆవు చచ్చిపోతే ఆవు పాలమీద బతికే బిడ్డలు చనిపోతారు. పశుహత్య, మానవహత్య కూడా చేసినట్లు అవుతుంది. పశువుల్ని తప్పించుకొని, లారీ తీసుకుపోదామనుకొన్న డ్రైవర్‌కు సాధ్యంకాక, పారిపోలేక, ఏమీ చేయలేక కూనిరాగం తీస్తూ షోగ్గా లారీ నిలిపి చిత్రం చూస్తున్నాడు. లారీ గడ్డి మేసే పశు చిత్రం.

ఆర్ట్సు కాలేజీ ముందు రాయదుర్గం బస్సు ఆగి ఉంది. ప్రయాణికులు ఎక్కుతున్నారు. అది కదిలితే కానీ లారీ పోదు. ప్రయాణికులకు మూటా సంచీ బరువు. ప్రపంచంలో ఉండే సమయమంతా బస్సుకే ఉన్నట్లు అది ఆగి ఉంది. వెనుక గడ్డి లారీ హారను కొడుతూ ఉంది. పశువులు తీరుబడిగా మేస్తూ ఉన్నాయి.

లారీ కుడిపక్క కాలేజీ. ఎడం పక్క ప్లే గ్రౌండు. ఆటస్థలమే పెరేడ్ గ్రౌండ్ అయింది. ఇప్పుడది లారీ స్టాండు. పెంటకుప్పల విరామ కేంద్రం. ప్రైవేటు టూరిస్ట్ బస్సుల బడలిక తీరే చోటు. అవేమీ లేనప్పుడు పబ్లిక్కు మీటింగుల ప్రదేశం. రోడ్డుకూ, గ్రౌండుకూ మధ్య కట్టిన గోడ, ప్లే గ్రౌండు అక్రమంగా దురాక్రమణ కావటాన్నిసక్రమంగా రోడ్డు ట్రాఫిక్ ప్రవేశించకుండా ఉండటానికి బందోబస్తుగా ఉండటంవల్ల, బస్సు కదిలిందాకా లారీ కదలదు. లారీ వెళ్ళిందాక పశువులు పోవు. అవి పోయిందాకా కారు, ఆటో, ఇతర వాహనాలు ముందుకు సాగవు.

ఈ బండిమీద ఎవరూ అప్పు ఇవ్వరాదన్న పబ్లిక్ నోటీసు పర్మినెంటుగా ఎంతో గొప్ప ఆర్టిస్టుతో అందంగా రాయించుకొన్న తోపుడు బండి లారీని తప్పించి, బస్సును దాటుకొని, పళ్ళబండిని ఢీకొట్టి, కంకర మీది కెక్కి, ఇసుకలో జారి, కట్టుబడిరాళ్ళ మీద కెక్కి, పునాది గుంటలో పడింది. దానిమీద ఇక అప్పు ఎవరూ ఇవ్వరు.

రాయదుర్గం బస్సు హారను వేసి స్టార్టు కాగానే గడ్డిలారీ కదిలింది. గడ్డి సంపద భుజించిన పశుసంపద హారన్ల మోతకు, అదిలింపులకు, తోక విరుపులకు, సడుగుల మీది చరుపులకు నెమ్మదిగా ప్రశాంతంగా నిష్కోపంగా కదిలి తోవ ఇచ్చాయి.

ఆగస్టు 14-15 అర్ధరాత్రి 1947లో పార్లమెంటులో నెహ్రూ ప్రసంగం చేస్తున్నప్పుడు కట్టిన స్వాతంత్ర్య చిహ్నం, టవరు క్లాక్కు, ఆగస్టు నెల పోలికగా ఎనిమిది మూలలు, పదిహేనో తారీఖు గుర్తుగా పదిహేను అడుగుల వెడల్పూ, నలభై ఏడుకు సాక్ష్యంగా నలభై ఏడు అడుగుల ఎత్తూ కలిగి నిలబడి, నెత్తిమీద నిరంతరం ఆగి ఉండే గడియారం చతుర్ముఖాలుగా పెట్టుకొని కదలకుండా, కదిలే రోడ్డును శాసిస్తున్నప్పుడు గడ్డిలారీ మలుపు తిరిగింది.

ఆ టవరుక్లాకు చుట్టూ సౌందర్యం కోసం ఏర్పాటు చేస్తున్న ఐలాండ్ పని ముమ్మరంగా సాగుతూ ఉంది. తెలుగుదేశం ప్రభుత్వం వస్తుంది. అందంగా ఐలాండ్ ఏర్పరు

స్తుంది. కాంగ్రెస్ ప్రభుత్వం వస్తుంది. ఐలాండ్ వల్ల రోడ్డు ఇరుకు గమనిస్తుంది. పడగొట్టి రోడ్డు వెడల్పు చేస్తుంది. మళ్ళీ తెలుగుదేశం, మళ్ళీ కాంగ్రెసు. ఐలాండ్ పుట్టుక, మరణం- పునరపి మరణం, పునరపి జననం. మట్టిలో కలుస్తున్న ధనరాసులు. పట్టించుకోని జనసమూహాలు. ప్రజాస్వామ్యం జిందాబాద్!

ఆర్ట్సు కాలేజీ నుంచి బయలుదేరిన గడ్డి లారీ అటు తిరిగి, ఇటు తిరిగి బళ్ళారి రోడ్డులోకి తిన్నగా వచ్చేసరికి లారీ నడుం లుకలుకలై, టకటకలై, కరకరలాడి, చరచరలాడి మెడ విరుచుకొని, డ్రైవరు అత్యద్భుత చోదక శక్తి సామర్థ్యం పరీక్షలో నెగ్గిన పట్టావల్ల ప్రాణభయం లేకుండా బయటపడింది.

కోర్టు రోడ్డులో దూకుడుగా పోతున్న గడ్డి లారీ, రోడ్డు గుంటల్లో పడి లేచి కోపంగా ఉందా? పక్కకున్న పోలీసుస్టేషన్‌లో ఫిర్యాదు చేస్తుందా? లేదా ఏకంగా జిల్లా కోర్టులో కేసు వేస్తుందా? అని ఆలోచించేంత నెమ్మదిగా పోతోంది.

పీస్ మెమోరియల్ హాలు పక్క మిట్ట ఎక్కుతూ లారీ ముక్కింది, మూలిగింది. కేర్‌మని సాగిపోయింది.

మొదటి ప్రపంచయుద్ధం ఆగిపోయినప్పుడు, ఏర్పడ్డ శాంతికి చిహ్నంగా కట్టించిన పీస్ మెమోరియల్ హాలు క్లబ్బుగా, పేకాట కేంద్రంగా మారి శాంతి స్థానంలో వినోదం వీరవిహారం చేస్తూ వచ్చింది.

ఆ రోజుల్లో పురప్రముఖులు, న్యాయవాదులు, ప్రభుత్వోద్యోగులు టెన్నిస్, షటిల్, బ్యాడ్‌మింటన్ ఆడే కోర్టులు, జాతీయ అంతర్జాతీయ వ్యవహారాలు, రాజకీయాలు చర్చించే హాళ్ళు, నేడు చుట్టలు, సిగరెట్లు, బీడీలు తాగే చోట్లుగా, బ్రాంది, విస్కీ, సోడాలు కలిపే ప్రదేశాలుగా, చీట్లాటలు, హార్ట్ అటాకులు తెచ్చే సుక్షేత్రాలుగా మారిపోగా, తెల్లటి పీసు మెమోరియల్ బిల్డింగు రంగు వెలిసిపోయింది. ఈమధ్యే పీసుకు సున్నం కొడుతూ రిపేర్లు చేస్తూ ఉన్నారు. పీసు వర్ధిల్లుగాక.




గూడ్సు షెడ్డునుంచి బయలెల్లి ముతామేస్త్రీ తిన్నగా ఇంటికి చేరాడు. అంతలావు మనిషి అంత సునాయాసంగా నడిచి ఇంటికి చేరటం ఆశ్చర్యంగా ఉంది.

ముగ్గురు భార్యల్లో పెద్దామె వంట చేస్తోంది. చిన్న భార్యలిద్దరూ స్నానాలు చేసి, తలలు దువ్వుకొని, జడలేసుకొని, జడల్ని ముడులేసుకొని, పూలు చెక్కుకొని, బొట్లు అతికించుకొని కడిగిన ముత్యాల్లాగా మొగుని కోసం ఎదురు చూస్తున్నారు.

ముతామేస్త్రీ పర్సు పెద్ద భార్యకిచ్చాడు. అడ్డపంచె నల్ల భార్యకిచ్చాడు. అంగీ తెల్ల భార్యకిచ్చాడు. డ్రాయర్తో పీటమీద కూర్చున్నాడు. అతి జాగ్రత్తగా పెంచి పోషించి కాపాడుకొంటూ, సంరక్షించుకొంటూ, సాక్కుంటూ వస్తున్న బొజ్జ అతని కాళ్లమీద కూర్చుంది.

చిన్న భార్యలిద్దరూ తలకు నూనె రాశారు. పయికి నూనె పట్టించారు. మర్దన చేశారు. 'సాల్ సాల్లే' అని ముతామేస్త్రీ అనే సరికి వేణ్ణీళ్లు తెచ్చారు. చన్నీళ్లు కలిపారు. నల్లామె శాంపు తెచ్చింది. తెల్లామె సోపు తెచ్చింది. ఇద్దరూ తల పులిమారు. పయి తిక్కారు. వాళ్లిష్టం. ఎవరికి దొరికిన శరీర భాగం వాళ్లు దుమ్ము దులిపేశారు. మురికి కడిగేశారు. స్నానం చేయించారు.

ముతామేస్త్రీ స్నానం ముగిసేసరికి ఉతికిన

డ్రాయరు, అడ్డపంచె, అంగీ పెద్ద భార్య తెచ్చి ఇచ్చింది. చిన్న భార్యలిద్దరూ తల తుడిచారు. పయి తుడిచారు. సాంబ్రాణి పొగ వేశారు. తాను మాత్రం డ్రాయరు వేసుకొని అడ్డపంచె చుట్టుకొని, అంగీ తొడుక్కొని నిటారుగా నిలబడ్డాడు.

పెద్దామె స్టూలు వంటి పీట వేసింది. కూర్చోగలడా? సునాయసంగా కూర్చున్నాడు. గోడకు వీపు ఆనించాడు. శుభ్రంగా కడిగి తుడిచిన స్టెయిన్‌లెస్ స్టీలు ప్లేటు పెద్దామె పెట్టింది. కూరలు నల్లామె వేస్తూ ఉంది. తెల్లామె విసనకర్ర తీసుకుని విసురుతూ ఉంది.

ప్లేటులో అన్నం మల్లెపూలరాశి లాగా తెల్లగా ఉంది. తెల్లదనం దిష్టి తియ్యటానికి వేసినట్లు ఉంది చేప పులుసు. రుచి బాగున్నట్లుంది, మళ్లీ మళ్లీ అడిగి అడిగి వేయించుకొని తిన్నాడు. పెద్దామె చేప పులుసు చేస్తే ముఠామేస్త్రీ నాలుక తెగిపోతుంది.

పాతికేళ్ల పూర్వం అనంతపురంలో ఎండు చేపలు తప్ప, మార్కెట్టులో పచ్చి చేపలు దొరికేవి కావు. బుక్కరాయ సముద్రంలో, శింగనమల చెరువులో పట్టిన చేపలు అక్కడికక్కడే, అప్పటికప్పుడే ఖర్చు అయిపోతూ ఉండేవి. మార్కెట్టు దాకా వచ్చేవి కావు. చేపల మార్కెట్టు లేదు.

టి.బి. డ్యాం, డ్యాం నుంచి నీళ్లు రాసాగినప్పుడు చేపలు కూడా దొరుకుతూ వచ్చాయి. కర్నూలు, నెల్లూరు చేపలు కూడా అనంతపురం రావటం క్రమంగా మొదలైంది. చేపల కూర వండాలంటే ఆడవాళ్లకు పెద్ద పని. అది గమనించిన నజీర్‌భాయి లాంటి వాళ్లు పచ్చి చేపల పొలుసు తీసి, కోసి, గలీజు తీసివేసి, ముక్కలు కొట్టి ఇచ్చే పని ప్రారంభించారు. కూరగాయల మార్కెట్టు దగ్గరే చేపల మార్కెట్టు వర్ధిల్లసాగింది.

చేపల రాకడ, వాడకం పెరగటంతో చేపల మార్కెట్టు ప్రత్యేకంగా కూరగాయల మార్కెట్టుకు దూరంగా మునిసిపాలిటీ ఏర్పాటు చేసింది. ఎన్నడూ లేనిది ఫీడర్ రోడ్డు ఇప్పుడు చేపల సుగంధ పరిమళంతో పరవశించిపోతూ ఉంది.

ఎవరయినా హమాలీ చేపల మార్కెట్టుకు పోయి, ఫ్రెష్ చేప ముక్కలు చేయించి తెస్తే పెద్దామె ఉప్పేసి నున్నగా తోమి, పులుసు కూరో, వేపుడో అద్భుతంగా చేసి పెట్టేది.

ముఠామేస్త్రీ మొదటి భార్య- పెద్దామె- కాకినాడ నివాసి. అతను చిన్నప్పుడు అక్కడ చేపలు పట్టేవాళ్లతో జీవించాడు. అసలూరు అనంతపురమే. చిన్నప్పుడు ఇల్లు వదిలి పారిపోయి, ఎట్లో చేరాడు కాకినాడ. పల్లెకారుల జీవితం చిత్రంగా ఉండేది. బెస్తవాళ్లతో బాగా స్నేహం ఏర్పడింది. కాకినాడే చేపల కూర రుచి చూపించింది. అంతకుముందు చేపలకూర అంటే తెలియదు. అందుకు మూలస్త్రీ పెద్దామె.

అప్పుడామె లంగా, జాకెట్టు సుందరాంగి. ఓణీ వేసుకోవటం అలవాటు కాలేదు. ఆ అవసరం కూడా రాలేదు. వాళ్లమ్మా నాన్న చేపలు పట్టి అమ్మేవాళ్లు. తండ్రి పడవలో సముద్రంలోకి పోతే, బీచ్‌లో తల్లీ కూతురు కూర్చునేవాళ్లు. వాళ్లకు కాపలా నేటి ముఠామేస్త్రీ.

చేపలకూర రుచితో అతనికి ఆమె చేయి పట్టుకొనే రుచి కూడా తెలిసివచ్చింది. హీరోకి మీసాలు మొలిచి, గోటికి దొరుకుతున్న సమయంలో ఆమె ఓణీలు కొనుక్కొని భుజాల మీద పారేసుకోసాగింది.

గాలికి మీసం ఎగరదు. ఓణీ ఎగురుతుంది. ఎగిరేదాన్ని ఎగరకుండా ఆపే హస్తలాఘవం హీరోకి అబ్బింది. ఎట్లా కుదిరిందో ఓణీకి, మీసాలకి లంకె పడింది. మెలిక పడింది. ముడిపడింది. అదే అదను, 'చెల్ మోహన్ రంగా'. అన్నాడు. 'నీకు నాకు జోడు కుదిరెను కదరా' అంది. 'నీకూ నీవారు లేరు, నాకూ నావారు రారు' అనీ అంది.

'ఏటిగట్టున కోట కడదాం పదవే' అన్నాడు.
ఇద్దరూ చెట్టాపట్టాలు వేసుకున్నారు. పట్టాలమీద రైలుబండి. 'పదవే పోదాము గౌరీ' అన్నాడు. రైలు బయలుదేరింది. రైలు ఎన్నిచోట్ల ఆగినా దిగలేదు. ఒకవేళ దిగుదా మని దిగినా ఎక్కారు. ఏకాయేకిన వచ్చారు. అనంతపురంలో రైలు అగేదాకా అడుగు బయటపెట్టలేదు. అనంతపురం స్టేషన్ చూసి 'జై పరమేశా' అన్నాడు. 'జైజై పర మేశా' అంది. 'దిగు దిగు నాగ' అన్నాడు. 'దివ్యాసుందరనాగ' అని దిగేసింది.

ఇక స్టేషన్ వాళ్ల సొంతమైంది. కూలి నాలి వ్యాపకం ఏర్పడింది. దొంగ కూలీ లైసెన్సు కూలీ అయ్యాడు. లైసెన్సు కూలీ బండెడు సామాను మోయసాగాడు. ఎంత సామానైనా అవలీలగా మోయసాగాడు. ట్రాలీ అతడిముందు బలాదూరు. లైసెన్సు కూలీ హమాలీ అయ్యాడు. హమాలీ మేస్త్రీ అయ్యాడు. మేస్త్రీ ముఠామేస్త్రీగా మారాడు. తనెంత ఉంటే అంత బరువు మోసే మని షిగా మారాడు. బరువు మోస్తున్నకొద్దీ మనిషి ఊరాడు.

ఈ పరిణామ కాలంలో మేనమామ కూతురు కనబడితే చెంగు పట్టుకున్నాడు. ఆమె చేయి పట్టుకొంది. పెద్దామె ఇద్దరికి అన్నం పెట్టింది. నల్లామె అన్నం వండి పెట్టసాగింది.

రైల్వే ప్లాటుఫారం మీద ఏడుస్తున్న ఎర్ర తేలు వంటి ఎర్రామెని 'ఎర్రా' అన్నాడు. కాదంది. 'రోగామా' అన్నాడు. లేదంది. 'తిక్కా' అన్నాడు. అది గాదంది. 'పిచ్చా' అన్నాడు. అవునంది. 'లే' అన్నాడు. లేచిం ది. 'రా' అన్నాడు నవ్వింది. 'కూర్చో' అన్నా డు కూర్చుంది. 'తినూ' అన్నాడు. తింది. 'పడుకో' అన్నాడు. పడుకుంది, నిద్రపో యింది. నాలుగు రోజులు లేవకుండా నిద్ర పోయింది. లేపాడు. లేవలేదు. కదిపారు, కదల్లేదు. నెట్టారు, దొర్లింది. 'సచ్చిందా?' చావలేదు. 'బతికిందా?' బతికింది. బట్ట కట్టింది. ఎక్కిన గడప దిగలేదు. మెట్టినిల్లు


Stay at **HOTEL**
**SURYA** *Residency*






**A/c Conference Halls Available**

**సూర్య రెసిడెన్సి**
పుణ్యమూర్తుల వారి వీధి, పవర్‌పేట,
ఏలూరు - 2 ☏ 253188, 253288

SNEHA, ELR 94408 32104

## ఏవీ ఇవ్వం

వేషాలకోసం తిరిగే వేళల్లోని దైన్యా న్నీ కూడా హాస్యభరితంగా చెప్పడం వంగర ప్రత్యేకత-'...భరణీవారి దగ్గరకు వెళ్లానా? మా సిన్మాలో బ్రాహ్మణ వేషా ల్లేవు పొమ్మంటిరి, నేను ఇంకెందుకూ పనికిరాని వాడినన్నట్లు. అక్కడి నుంచి బయటకు వచ్చేసరికి ఎ.వి.ఎం. కన్పిం చింది. లోపలికి వెళ్లాలా వద్దా అని తట పటాయించా. ఎంచేతేమిటండీ? ఏవీ ఇవ్వం అని అంతలావున బోర్డు పెట్టు కుంటే ఇంకెందుకు? చక్రపాణిగారి దగ్గ రకు వెళ్తే-ఎందుకొచ్చా? వేషం ఉంటే నువ్వడగాలా? ఉంటే మేమే పిలుస్తాం గా అన్నారు కోపంగా. పాపం ఎండలో వచ్చానని అలా అని వుంటార్లే. అందుకే ఇలా వచ్చా ఇదీ తిరుగుబాటు. ఇది లేకపోతే జరుగుబాటు లేదు మరి'

వదల్లేదు. పుట్టినిల్లు చెప్పలేదు. పుట్టింటోళ్ళు రాలేదు. తీసుకుపోలేదు. 'ఎర్రగుంది ఉణ్ణీ' అనుకున్నాడు. ఉండిపోయింది. ఊరికే ఉందా? లేదు. ఏం చేసింది? పిల్లల్ని కంది. వాళ్ళేమయ్యారు? పెరిగి పెద్దవాళ్ళ య్యారు. వాళ్ళకేమి ఇష్టం? చేపలకూర! ఎవరు చేయాలి? పెద్దామె.

పాతికేళ్ళకు పెద్దామెకు చేపలకూర వండ టంలో చేయి తిరిగిపోయింది. చేసిన కూర తిని పెట్టంలో ముఠామేస్త్రీ నోరు మెలికలు తిరిగింది. ఇంటిల్లిపాదికీ చేపలకూర వార సత్వం వచ్చింది. చేపలకూర అంటే వాళ్ళకు ప్రాణం లేచి వచ్చేంత రుచి, సువాసన మసాలా. నసాళానికంటేంత రంజు, పిల్లలు పిడుగులు. చేపలకూర అంటే, ఉంటే పండగ.

అనంతపురంలో ఇప్పుడు ఇబ్బడి ముబ్బ డిగా చేపలు దొరుకుతున్నాయి. మునుపు దొరికేవి కావు. అప్పుడు కూడా ఇటు బెంగు ళూరు నుంచో, అటు నెల్లూరు నుంచో- రైలు సొంతమే కదా- చేపలు తెప్పించేవాడు ముఠామేస్త్రీ.

ఇప్పుడు చేపలకు అనంతపురంలో కొదవ లేకపోయేసరికి చేపలకూర వంటకం ముఠా మేస్త్రీ ఇంట్లో నిత్య నైమిత్తిక కర్మకాండ అయి పోయింది. నిత్య ధూప దీప నైవేద్యాది కైంకర్య సేవగా మారింది. నిత్య పరిమళ ప్రస్తార ప్రపంచాల సృష్టి అలజడి అద్భు తంగా జరిగేది.

వాళ్ళింట్లో కూర వండుదామంటే ఆ పరి మళాలు వాళ్ళు మాత్రమే అనుభవించా రంటే అన్యాయం. అందరికీ పంచారు. వీధంతా సుగంధ ప్రవాహంలో తెప్పె తేలి పోయేది. రుచి మరిగిన వీధి ఇంకా సువా సన రాకపోతే ఎంక్వయిరీ ఆఫీసుగా మారి పోయేది.

కూర వండలేదా? చేపలు తేలేదా? చేపలు మార్కెట్టులోకి రాలేదా? తేవటం ఆలస్యమయిందా? పెద్దామె ఆరోగ్యం బాగా లేదా? పిల్లా జెల్లా బాగున్నారా? ముఠా మేస్త్రీ ఏడున్నాడు? ఏం చేస్తున్నాడు? ఏం అంటున్నాడు? ఏం తింటున్నాడు?

ముఠామేస్త్రీ ఇల్లు చేపలకూర వాసనను వీధికి దానం చేస్తే ఎంక్వయిరీ ఉండదు.

అన్నం తిని అతను లేవగానే పెద్దామె మంచం వేసింది. చిన్నవాళ్ళు దుప్పటి పరచి దిండ్లు సర్ది పక్కకు తొలిగారు. ఇంట్లో పిల్లలు లేరు. ఎవరి పనిమీద వాళ్ళు వెళ్ళి పోయారు. అతను టీవీ పాటలు పెట్టాడు. సౌండు పెంచాడు. మంచం మీదికి చేరాడు. పడుకోగానే గురక పెట్టాడు.

గురక టీవీ పాటలాగా ఉంది. పాట గురకలాగా ఉంది. గురక పాటలో కలిసిపో యింది. పాటలో గురక వినపడటం లేదు. పాట అందంగా లేదు. అలా అని వికారం గా లేదు. గురక పాట సొగసు దాని

సొంతం.

భార్యలు గురక వినబడకుండా ఉండటానికి పాటలు పెట్టాడనుకొంటారు.

ముఠామేస్త్రీ గురక పాట వినిపిస్తే ఇల్లు ప్రశాంతం. నిశ్శబ్దం. మరే శబ్దం వినరాదు.




ముఠామేస్త్రీతో వాళ్ళింటిదాకా వచ్చిన బక్కోడు గట్టి హమాలి. కడ్డీ లాంటి మనిషి. పిట్ట మనిషి అంటారు. కానీ పిడుగు. పనిలో యముడు. పాటలో గంధర్వుడు. అందంలో మన్మథుడు.

చుక్కపడిందా? భూమి దుమ్ము రేగిపోతుంది. ఎట్లుంటాడు? ఇనపరాడ్, నీలిగి నిలబడితే కాళ్ళు వంగవు, కీళ్ళు వంగవు. మనిషి వంగడు. నిటారుగా, నిట్రాడిలాగా నిగిడి నిగిడి నడుస్తాడు.

బక్కోడు బట్వాడా తీసుకొని రైలు ట్రాక్ దాటి, బాల్యంలో తమ మాదిగపల్లెలో విన్న 'నిన్ను రమ్మన్నాది, నన్ను రమ్మన్నాది, ఇద్దర్ని రమ్మని నిద్దరబోయింది. లబో లబో లబు జనక... అబ్బదాని సోకో జబ్బల మీద జాకెట్టు, అమ్మ దానిసోకో... పిర్రల మీద పిన్నీసు' అని పాడుకుంటూ వస్తే ప్రపంచం అతడి కాళ్ళకు సలాం చేసి పోతుందని విశ్వాసం. ఎవడి విశ్వాసం వాడిది. ఎవడిని ఎవడు ఏం చేయగలడు?

ప్లాటుఫారం దాటి, స్టేషను వదిలి రోజూ సారాయి దుకాణానికి పోయినట్లే ఈ రోజు కూడా పోయాడు. మొదట పాకెట్టుతో ముఖం కడుక్కొని పుక్కిలించి పరిశుభ్రంగా పరిశుద్ధుడైపోయాడు.

ఆపైన సారాయి అమ్మే ఆయక్క ఇష్టం. ఈయప్ప అదృష్టం. ఆ బాగ్గెశాలి ఇస్తుంటే, ఈ బంగారయ్య తాగుతుంటే, సోమపానం చేసే అసురులు, అమృతపానం చేసే అసలు సిసలు సురులు బిత్తరపోవాలి. ఎంత సునాయాసంగా తాగుతాడు! ఎంత నాజూకుగా గ్లాసు పట్టుకొంటాడు! ఎంత సులాగ్గా గ్లాసు మూతికి ఆనిస్తాడు! ఎంత షోగ్గా నోరు తుడుచుకొంటాడు!

అప్పుడు మొదలవుతుంది. నూత్నభాష, వినూత్న సంగీతం, టిక్కెట్టులేని సంగీత కచేరి. 'నిన్ను రమ్మన్నాది, నన్ను రమ్మన్నాది. జబ్బలమీద జాకెట్టు, పిర్రల మీద పిన్నీసు'.

బక్కోడు చీకు తింటూ కారం లేదని కారమేసి, ఉప్పు లేదని ఉప్పు వేయించి మళ్ళీ తాగి, మళ్ళీ తిని తుపుక్కున ఉమ్మేసి, అందమైన బూతు పురాణం అవలీలగా విప్పి అటునుంచి ఇటు, ఇటునుంచి అటు చదివి ఆపైన సంగీత సాధన చేసి, నిఖార్సయిన మగాడిలా నీలిగి కూర్చున్న బక్కోడు 'నిన్ను రమ్మన్నాది, నన్ను రమ్మన్నాది, ఇద్దరిని రమ్మని నిద్దరబోయింది, లబో లబో లబు జనక' పాట అందుకొన్నాడు.

బక్కోడు తాగినప్పుడు తినే చీకు నర్తకిలాగా డాన్స్ చేసి నోట్లోకి పోతుంది. దాన్ని వాడు కొరక్కముందే అది వాడి బుగ్గను కొరుకుతుంది. నమిలేటప్పుడు చిగుళ్ళ కిరువైపులా నర్తిస్తుంది. తనకు బుద్ధి పుట్టినప్పుడు పంటికిందికి చేరుతుంది. అనుకూలవతి అయిన భార్యలాగా నలిగిపోతుంది. మురుసుకొంటుంది. ముడుచుకొని, మునిరగ దీసుకొని, కలబడి, నిలబడి నోరంతా తిరిగి, నాలుకను నాలుగు వంకర్లు దిప్పి, సారం గొంతుకు, సుఖం నోటికి పంచి అంగిట్లో కొవ్వొత్తిలా వెలిగి, రుచి వెలుగులు పంచి, తెరమరుక్కు వెళ్ళిపోతుంది.

చుక్క సేవిస్తూ ముక్క నములుతుంటే

స్వర్గం బెత్తెడెడంగా వచ్చి నిలబడుతుంది. నింగి నేల మీది కొచ్చి పాదాలకు ప్రణమిల్లుతూ, ప్రాధేయపడుతుంది.

సారాయి గ్లాసు, చీకు చేతిలో ఉంటే ప్రపంచంలోని పరమాద్భుతాలన్నీ బలాదూర్. ఈ సుఖం తెలిసినవాడు, అంతే మరి, ఇక ఏ సుఖం కోరుకోడు. దేవతలు ఎందుకు దేవతలయ్యారు? సురాపానం వల్లే! అమృతం తాగకపోతే వాళ్ళు సర్కారు గడ్డితో సమానం. అది బక్కోడి స్థిరాభిప్రాయం.

బక్కోడు తీరుబడిగా కొట్టంలోకి చేరి దిండూ దుప్పటి లేని చిరిగిన చాప మీద పడి నిద్రపోయాడు. ఇక ఇప్పుడప్పుడే లేవడు. లేస్తే మనిషి కాడు. దేవేంద్రుడే! మళ్ళీ అమృతపానం. మళ్ళీ దేవేంద్ర పదవి. అమృతం ఉంటే రంభా, ఊర్వశి, మేనక, తిలోత్తమ ఉంపుడు గత్తెలు, పెళ్ళి అనవసరం. రేపు పొద్దుట హమాలీగా అవతారం ఎత్తిందాకా బక్కోడు దేవేంద్రుడే!

బక్కోడు దేవేంద్రుడి అవతారంలో ఉన్నపుడు దుబ్బోడు బుద్ధిమంతుడిలా ఇంటికి చేరాడు. బట్వాడా సొమ్మంతా భార్య చేతుల్లో పెట్టాడు. ఆమె నీతిమంతురాలు. మొగుని మాట జవదాటదు. వండుతుంది, వారుస్తుంది, వడ్డిస్తుంది. పిల్లల్ని కంటుంది, పెంచుతుంది.

ఇంట్లో అయిదుగురు పిల్లలు. చిన్న ఇల్లు. వాళ్ల కాళ్ళకు చేతులకు తగులుతున్నారు. ఆమె చంకలో ఒక బిడ్డ, కడుపులో ఒక బిడ్డ. కని పెంచే వయస్సు కదా, పిల్లలు పుడతుంటారు. పెంచాలి. ఏం చేస్తాం? అదీ ఆమె దృష్టి. శింగనమల ఎం.ఎల్.ఎ. ఒకరోజు దుబ్బోణ్ణి పట్టుకొని, 'మనకెందుకురా పిల్లలు, పెంచలేం, చదివించలేం, సరైన పౌరులుగా తీర్చిదిద్దలేం. నా మాట విను, ఆపరేషన్ చేయించుకో, నలుగురు చాలు' అనే ధోరణిలో బోధించాడు.

పిల్లల్ని దేవుడిచ్చాడు. మన అమ్మా నాన్నలు మనల్ని వద్దనుకుంటే మనం పుట్టే వాళ్ళమా? ఏమో ఎవడు చూశాడు, ఎవరు నీలా ఎం.ఎల్.ఎ. అవుతాడో, కలెక్టరు అవుతాడో, గవినేరు అవుతాడో చెప్పలేం కదా' అనే తీరులో దుబ్బోడు బదులు చెప్పాడు.

'మాదిగోళ్ళకు చెప్పలేం' అన్నాడు ఎం.ఎల్.ఎ. 'మాదిగోళ్ళు చెప్పలేరు' అని దుబ్బోడు ఎదురు చెప్పాడు. 'మంచి మాట చెబితే మర్యాద పోతుందా' అని బాధపడుతూ, యస్.సి. రిజర్వుడు నియోజకవర్గం శాసనసభ్యుడు దిగాలుగా వెళ్ళిపోయాడు.

భార్యభర్తలిద్దరూ పిల్లల్ని కనటం తెలికేగాని పెంచటం కష్టమని గుర్తించి, నారు పోసినోడు నీరు పోయడా అని భావించి, సంతానం ఇచ్చిన వాడే సంసారం సాగే మార్గం చూపుతాడని తలపోశారు.

సూర్యుడు భర్త. చంద్రబింబం భార్య, చుక్కలు పిల్లలు. లెక్కలేనన్ని చుక్కలు. చక్కని చుక్కలు. ముత్యాలవంటి బిడ్డలు.

జనాభా నియంత్రణం మాట వాళ్ళు విన్నారు. వినటం చాలాసార్లు చాలామంది చెప్పగా విన్నారు. ఆచరించటం వాళ్ళ ఇష్టం.

"ముద్ద" అడిగాడు

"లేదు!"

"మరి? "

"సంకటి!"

"కూర? "

"వంకాయ!"

"పెట్టు!"

"పెట్టుకో!"

ఆమె పిల్లల్ని సముదాయిస్తూ ఉంది. దుబ్బోడు తినే లోపల పిల్లల్ని నిద్రకు వేయాలి. లేకపోతే చిందులు వేస్తాడు. ఆమె బాలింత అయినా, చూలింత అయినా ఇది తప్పదు. ఆరోగ్యం బాగున్నా, బాగా లేకున్నా తప్పదు. 'నాకేదీ లేదు, ఇదీ లేకపోతే యెట్టా? ' అని ఎగురుతాడు.

దుబ్బోడు పేకాడడు. మట్కా ఆడడు.

సారాయి తాగడు. చుట్ట బీడి, సిగరెట్టు ముట్టడు. తిండి యావ కూడా తక్కువే. 'ఇదిగో ఈ పీడ, ఈ యావ. వీడి దుంప దెంచ, చంపుకు తింటున్నాడు' అంటూ చేతులు తుడుచుకొంటూ వచ్చి ప్లేటు తీసింది.

మంచం వేసుకొని, దుప్పటి పరుచుకొని, దిండేసుకొని మంచం పట్టెమీద కూర్చున్నాడు.

పిల్లలు చాపమీద నిద్రపోతున్నారు.

భార్య అన్నం తిని చేయి కడుక్కొని ప్లేటు కడిగి, బోర్లించి చేయి తుడుచుకొంటూ వచ్చి మంచంమీద కూర్చుంది.




ఈ ఏటికి మల్లే పోయినేడు సర్కారు గడ్డి కొనే పని లేదు. ఉద్దరగా వచ్చింది. ఆ ఏర్పాటు బాగానే ఉంది. కానీ పంపకం దగ్గరే ప్రమాదం వచ్చింది.

పోయినేడు పది గడ్డి కేంద్రాలు ఏర్పాటు చేశారు. పల్లె పశువులకే ప్రాధాన్యం. నీటి సదుపాయం, చెట్టూ చేమా ఉన్న చోటు చూసి దాన్ని ఏర్పరిచారు. పెన్నోబులం దగ్గర ఒక గడ్డి కేంద్రం పెట్టారు. పి.ఎ.బి.ఆర్. నీళ్ళున్నాయి. గుడి చుట్టూ దట్టంగా చెట్లున్నాయి. చిన్న అడవి. పందిళ్ళు కూడా వేశారు.

రాంవుడి పశువులు పెన్నోబులం కేంద్రంలో ఎండాకాలం మూడు నెలలు గడ్డి మేయ వచ్చు. కొడుకులతోపాటు పశువుల్ని తోలుకొని రాంవుడు కేంద్రానికి వచ్చాడు. పందిళ్ళ కింద పెద్దవాళ్ళ పశువులుండగా, తమ పశువుల్ని చెట్ల కింద కట్టేశారు.

రోజూ ఆరేడు లారీల గడ్డి వస్తూ ఉంది. ఒకరోజు ఎక్కువ, ఒకరోజు తక్కువ. మొత్తంమీద రోజూ గడ్డి దిగుమతి అవుతూ ఉంది. ఇక్కడా పొడుగు చేతుల పందేరం తప్పలేదు.

సంపన్నుల పశువులకు, నోరున్నవాడి గొడ్లకు మేత బాగా దొరుకుతూ ఉంది. అంతవరకూ నోరు లేనివాళ్ళు కూడా, నోరు లేని గొడ్ల మేత కోసం, నోరు చేసుకోవలసి వస్తోంది.

పలుకుబడిగల వాళ్ళ పశువులకు తిన్నంత గడ్డి, బీదాబిక్కి, చిన్న, సన్నకారు రైతుల పశువులకు అంతో ఇంతో గడ్డి. అసలేమీ లేని దానికంటే ఆ కొంచెమయినా మేలే కదా! పేదలు సర్దుకొన్నారు.

రాంవుడు కొడుకులు ముగ్గురూ గడ్డి పంపకం సమయంలో బతిమాలి బామాలి తమ వంతు గడ్డి తెచ్చి పశువుల్ని బాగానే మేపుతున్నారు.

ఊరి నుంచి సంగటి తెస్తే రోజూ సెనక్కాయ పచ్చడేనా అని నిన్న సన్నోడు విసుక్కొన్నాడు. అందుకే ఆరోజు వంకాయ కూర వచ్చింది. వానికి ప్రత్యేకంగా జొన్న రొట్టె, పప్పు తెచ్చారు. అన్నదమ్ములు ముగ్గురూ అంతా సమంగానే తిన్నారు. వీళ్లు తిండియావలో పడి చస్తున్నప్పుడు లారీలు వచ్చాయి. మేత పంపకం అయిపోయింది.

వీళ్ళు లబోదిబోమని నెత్తీ నోరు కొట్టుకొని పరుగు పరుగున బోయి, పంచగా మిగిలిన గడ్డి అడుగూ బొడుగూ తెచ్చి గొడ్లకేశారు. చాల్లేదు, ఆరోజు గడ్డి.

తమకు నోరుంది. పశువులకూ నోరుంది. తమ నోటికి రుచి తెలుసు. వాటికీ తెలుసు. తమకు కావలసింది తాము చెప్పగలరు! గొడ్లు చెప్పలేవు. వట్టి గడ్డి తినీతినీ నోరు సయితప్పి ఉండవచ్చు. తప్పితే మాత్రం ఏం? ఏదో గడ్డి తినటానికింత ఉంటే అంతే

చాలు!

ఒకరోజు మొక్కజొన్న చొప్ప లారీలు వచ్చాయి. పశువులు ఎంత ఆబగానో తిన్నాయి. దంట్లు కూడా మిగల్చకుండా నమిలేశాయి. ఆ చొప్ప నెల్లూరు నుంచి వచ్చిందని చెప్పారు. నెల్లూరులో వరి ధాన్యం కాక మొక్కజొన్న పండిస్తారంటే రైతులకు ఆశ్చర్యంగా ఉంది. జనుం రాదు. వచ్చినా కొంచెం, నెయ్యిలాగా ప్రియం. జనుం నారకే ఎక్కువ పోతుంది.

రోజంతా రైతులకు పని ఉండదు. వాళ్లు తినటం, చెట్ల కింద నిద్రపోవటం, ఇష్టంగానే ఉంది. పశువులు నెమరు వేస్తున్నప్పుడు వీళ్ళు నిద్రను వాటేసుకొంటారు.

మళ్ళీ మొక్కజొన్న చొప్ప వస్తే బాగుంటుందని ఒక రైతు ఆశించాడు. ఎర్రనేలలో పండిన వరిగడ్డి అయితే మేలని, రుచనీ మరో రైతు భావించాడు. ఏ గడ్డి అయితేనేం నమలటానికి అని ఇంకో రైతు కొట్టిపారేశాడు.

తూర్పు పడమటి గోదావరుల గడ్డి పొడుగు ఎక్కువ. ఆకు వెడల్పు. కృష్ణ, గుంటూరు, నెల్లూరు గడ్డి పొట్టి. రుచి. గోదావరి నీటికి, కృష్ణ నీటికి వడ్లలో రకాలనే కాదు, గడ్డిలో రకరకాలను కూడా పండించే గుణం ఉంది. చెరువుల కింద, బావుల కింద పండే పంటగడ్డి అనంతపురం రాదు.

తమ పశువులకు వంతులవారీగా గడ్డి లభించేది. మాట్లాడితే మరికొంత. పోట్లాడితే ఇంకొంత. బతిమాలితే కొంచెం. ప్రాధేయపడితే నాలుగు పనల గడ్డి ఇచ్చేవాళ్ళు వాళ్ళు. మొదట్లో పశువులకు గడ్డి సరిపోతూ వచ్చింది.

వర్ణ వ్యవస్థ బలంగా ఉన్న దేశంలో, రాష్ట్రంలో అందునా అనంతపురం జిల్లాలో రైతు కులం పశువులకూ సంక్రమిస్తుంది. అగ్రకులం పశువులు, సంపన్నుల పశువులు, ధనవంతుల పశువులు, బలవంతుల పశువులు మాదిరి గానీ, అధమకులాల పశువులు, పేదల పశువులు, బలహీనుల పశువులు, మాదిగల పశువులు వేరువేరుగా ఉన్నాయి.

గ్రామంలో అంటరాని వాళ్ళ అవస్థలే, కేంద్రంలో వాళ్ళ పశువులకు సంక్రమించాయి. అది అగ్రవర్ణం పశువు అయినా, అధమ వర్ణం పశువు అయినా, వాటి ఆకలి ఒకటేనని, వాటి మేత ఒకటే ఉండాలని గుర్తించవలసిన అవసరం పెన్నోబులం కేంద్రంలో తెలిసివచ్చింది.

రంకెలు, కేకలు, బొబ్బలు, పెడబొబ్బలు గడ్డి కేంద్రంలో మిన్ను ముడుతున్నాయి. కేంద్రం సంతగా మారిపోయింది.

పశువులు మేతకు, రైతులు మాటకు అల్లాడుతున్నారు. సాలె, బలిజ, గొల్లగొడ్లు కూడా ఎరికల, యానాది, సుగాలి, మంగలి, చాకలి, మాదిగ గొడ్లులాగా మేతకు అల్లాడుతున్నాయి.

కేంద్రంలో ఉన్నప్పటికి పశువులకు మేత అందటం లేదు. వాటి ఆలనా పాలనా చూసే రైతులకు తిండి అందకుండా పోతూ ఉంది. ఈ పరిస్థితిలో బీదా బిక్కీ కేంద్రంలో ఉండటం, అవస్థలు పడటం అనవసరమని పల్లెతోవ పట్టారు.

పశువులు తగ్గుతున్న కొద్దీ ఉన్న వాటికి మేత కొంతలో కొంత మేలు. ఏమీలేని దాని కంటే ఎంతో కొంత ఉన్న పరిస్థితి మేలు కదా అని రాచపుని కొడుకులు పసులు తోలుకుపోలేదు. కేంద్రంలోనే ఉన్నారు.

బీదాబిక్కి పశువులు తోలుకొని పల్లెలకు వెళ్ళిపోతే అర్థం ఉంది కానీ, సంపన్నులు కేంద్రం నుంచి పశువుల్ని తోలుకుపోవటం ప్రజలకు అర్థం కావటం లేదు.

ఈ అర్థం కానితనంలో అన్నదమ్ములు కొట్టుమిట్టాడుతుంటే, యేదో కిటుకుందని సన్నోడు తల బరుక్కోసాగాడు.

వేసవి మూణ్ణెల్లు పశుగ్రాసం ఉంటుందని అందరూ భావించారు. అందుకు సిద్ధమై

పశువులతో కేంద్రానికి వచ్చారు.

కేంద్రంలో పోటీకి నిలవలేక పేదలు గొడ్లు తోలుకుపోయారంటే అర్థం చేసుకో వచ్చు. మరి సంపన్నులు ఎందుకు?

సన్నోనికి తిక్కబట్టింది.

తొంభై రోజులు కేంద్రం నిర్వహిస్తారు, యాభై రోజులకే సగం గడ్డి తగ్గిపోయింది. గడ్డి లారీలు నాలుగోవంతు కూడా రావటం లేదు. గొడ్ల మేత తగ్గింది.

గడ్డి లారీలు ఎందుకు మునుపు వచ్చి నంత ఎక్కువగా రావటం లేదు?

సన్నోడు చిందులేస్తున్నాడు.

కేంద్రంలో దిగుమతి కావలసిన గడ్డి లారీలు గ్రామాల్లో, సంపన్నుల దొడ్లలో దిగుమతి అవుతున్నాయని తెలిసి కేంద్రం లోని రైతులు మండిపడ్డారు.

ఆ రోజు రావలసిన ఆరు గడ్డి లారీలలో ఒక్కటే కేంద్రం చేరింది. మిగతావి? ఎక్క డికో చేరాయి. అపహరించారా? అన్యా క్రాంతం అయ్యాయా?

ఎవరు ఎవరితో ఏం చెప్పుకొన్నా ప్రయో జనం లేకుండా పోయింది.

నిలదీయటం ఎలా? గడ్డి గడ్డిలో కలిసి పోతుంది. వచ్చిన లారీ వెళ్ళిపోతుంది.

పేద రైతుల నిఘా మొదలయింది. కేంద్రం దాటిపోతున్న లారీలను గుర్తించసా గారు. కొందరు లారీల వెంటబడుతున్నారు.

ఓ లారీ కేంద్రం దాటి ఉరవకొండ రోడ్డున పోతూ ముష్టూరు దగ్గర ఆగి, ఎడం వైపు తిరిగి, రోడ్డు దిగి, కరువు రోడ్డులో నుంచి కంకర రోడ్డు మీదుగా రాకెట్ల చేరు కొంది.

అది గమనించిన ఓ మోటర్ సైకిల్ యువకుడు దాన్ని ఆపలేదు, కాపీ లాగాడు. సర్పంచి దొడ్డిలో గడ్డి లారీ ఆగటం గురించి కేంద్రంలో ఉప్పందించాడు.

సేద్దెగాళ్ళు, పాలెగాళ్ళులాగా జబర్దస్తీ చేస్తూ గడ్డి దించుకొంటున్నప్పుడు వచ్చిన రైతుల్లో సన్నోడు కూడా ఉన్నాడు.

వాళ్ళంతా కలిసి ఇది సర్కారు గడ్డేనని నిర్ధారించారు. లారీని ఆపారు. ఇది కేంద్రా నికి వచ్చి ఉండవలసిన లారీ అని తీర్మానిం చారు.

ఇది ప్రజల గడ్డి. నిజమే ఇది సర్కారు గడ్డి. కాని సర్పంచి గడ్డి కాదు.

ఇది దోపిడే! కొనసాగరాదు. అది పసు వుల మేత. ఈ మనుషులది కాదు. ఈ దోపిడీ తేలాలి. జనం పట్టుబట్టారు.




సర్పంచి అందరి మనిషి, అందరి ఓట్లు కావలసిన మనిషి, ఓటు వేయలేదని తెలిసి కూడా ఓటరును పోగొట్టుకోలేడు. ఎవరినీ దూరం చేసుకోలేడు. అలా అని అంతా పరార్థమే లేదు. స్వార్థం కూడా ఉంది. కొత్త గడ్డి వచ్చి, పాత గడ్డిలో కలిసి అంతా అఖం డంగా సొంత గడ్డి అయిపోతుందని భావిం చాడు. కానీ అలా జరగలేదు. కథ అడ్డం తిరిగింది. కాళ్ళకడ్డం పడింది.

సర్పంచి లారీవైపు తేరిపార జూశాడు. లారీ పిచికలు పొడుచుకు తిన్న మొక్క జొన్న పొత్తులాగా ఉంది. అనంతపురం నుంచి రాకెట్ల దాకా తోవ పొడుగునా అంది నంత గడ్డి జనం పీక్కుపోయారు. పశువులు ఎగబడి, గుంజి, పీకి, నమిలాయి. లారీ ఏటికి ఎదురీదినట్లు గాలికి ఎదురీది రాకెట్ల చేరింది.

గాలి ధాటికి ఎగిరిపోగలిగినంత గడ్డి ఎగి రిపోయింది. చైతన్యం లేని శూన్య ఆకాశం

లో గడ్డి పరకల కదలిక- అలజడి సృష్టించాయి. గడ్డి పరకలు గాలి పటాలులాగా కాగితాల జెండాలులాగా ఎగరసాగాయి. ఆకాశంలో కొత్త పిట్టలు ఎగిరినట్లు గడ్డి పరకలు వినోదంగా విహరించసాగాయి.

గూడ్సు షెడ్డులో లారీ లోడు చేసినప్పుడు

"మాదే!" అన్నారు సేద్దెగాళ్ళు.

"యీడే దోలాల్లని డిపార్టుమెంటోల్లు సెప్పినారు" డ్రైవరు.

"లెక్కేడది?"

"నాకెరికే!" క్లీనరు.

"యెవురిది?"



నిండు నెలల చూలింతగా ఉన్న లారీ రాకెట్ల చేరేసరికి ప్రసవమయిన బాలింతలాగా మారిపోయింది.

రాకెట్ల చేరిన లారీ ఈకలు పీకిన కోడి పెట్టలాగా ఉంది. గుడ్లు పెట్టి పెట్టి అలసిపోయి, పొదుగుతున్న కోడిలాగా ఉంది. గాలి సగం గడ్డి భుజించినా, మిగిలిన సగమే పశుగ్రాసం.

సర్పంచి లారీని తేరిపార చూశాడు.

"యావూరుదీ గడ్డి? యెవురిది?" అని గర్జించాడు.

"మీదీ!" క్లీనరు.

"నాదా?"

"మేమే దుడ్డు గట్టినాము" సేద్దెగాళ్ళు.

"యంత?"

"మున్నూరు?"

"అదప్ప యిసియం?" అన్నాడు సర్పంచి.

గడ్డి కొనమని తాను చెప్పాడుకానీ, సర్కారు గడ్డి కాదు. జీతగాళ్ళు కొన్నారు. డబ్బు తానివ్వలేదు. ఇంటి ఆడమనిషి ఇచ్చింది.

"సరే! ఏదయితే అదీ కానీండప్ప. వీల్లు గడ్డి కొన్నారు కాబట్టి, కొన్నోనిదే గడ్డి"



అన్నాడు సర్పంచి.

కొంచెంసేపు ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

అక్కడ చేరిన జనం రెండు ముఠాలయ్యారు. ఒక గుంపు మామూలే! వ్యతిరేకం.

"ఈ గడ్డి కొనేకి వీల్లెవురు? "

సమాధానం లేదు.

"ఈ గడ్డి అమ్మేకి వాల్లెవురు? "

జవాబు లేదు.

"ఇది సర్కారు గడ్డి. ఒకరు కొనరాదు. అమ్మరాదు"

జనం గుసగుసలు వ్యాపించాయి.

"లెక్క ముట్టినట్లు రసీదు ఉందా? "

"లేదు"

"లెక్కాపత్రం లేకపోతే అది లంచం"

సర్పంచి సేద్దెగాళ్ళవైపు చూశాడు.

"ఆఫీసరుకే లెక్కకట్టినాము" సేద్దెగాళ్ళు చెప్పారు.

"వీళ్ళు లంచం ఇవ్వరాదు. వాళ్ళు లంచం ముట్టరాదు. అదీ నేరమే! ఇదీ నేరమే! ఇచ్చినా తప్పే! పుచ్చుకొన్నా తప్పే!

సన్నోడు తెగేసి మాట్లాడుతుంటే జనం ముక్కుమీద వేలేసుకొన్నారు.

తన ఉనికికి భంగం కలుగుతున్నట్లు సర్పంచి భావించాడు. తనను సన్నోడు ప్రశ్నిస్తున్నాడని కుంగిపోయాడు. అయినా గుంభనంగా, నిండుకుండ తొణకదన్నట్లుగా ఉన్నాడు.

"వాల్లు గడ్డి కొనినామనినారు కదేమప్పా సన్నాయప్ప" అన్నాడు సర్పంచి.

"సర్కారు గడ్డి యవరూ అమ్మేకీ లేదు. కొనేకీ లేదు. కేంద్రంలో తోలాల్ల. ఉద్దరికే యివ్వాల్ల"

సన్నోడు తేల్చి చెప్పాడు.

సర్పంచి బిత్తరపోయాడు. అయినా మాట్లాడక తప్పదు.

"గవుర్నమెంటు గడ్డి. గవుర్నమెంటు అమ్ముకొంటే మద్దెలో మనకేం నొవ్వ? "

"పసులమేత. పసులకు ఇడసాల్ల. అమ్మ రాదు. గవుర్నమెంటు యెవుడు? జనమే! మనమే! ఇది పసులగడ్డి! పసులకే! మనుసులకు గాదు"

సన్నోని మాటలు సంచలనంగా ఉన్నాయి. కొందరికి నిజమేననిపించింది. కొందరికి అంతుపట్టలేదు. కొందరికి కోపం వచ్చింది.

"మాదిగోనికి మరేద లేద? యెవుర్ని అనేది? యేది అనేది? నోటికొచ్చిన కూత కూయటమేనా? నోటికి అడ్డూ అదుపూ లేదా? కంపు నోరు. కంపు నాకొడుకు. ఆడేంది? అడిగేదేంది? " అన్నారు సేద్దిగాళ్ళు!

సన్నోడు, "అదిగాదు యర్‌నాగప్పా" అనబోతుంటే 'నోరు మూసుకోవై' అన్నాడు జీతగాడు.

"మరేద! మరేద!" హెచ్చరించాడు సన్నోడు.

"పోలే! మరేదంట మరేద! మరేదలేదు మట్టిగడ్డలేదు" అన్నాడు జీతగాడు.

"మానం మరేద ఉండల్లప్పా!" సన్నోడు.

"పోలే!నీ మానం, నీ మరేద, నీ బయిసు, నీ బతుకు నువ్వే జూసుకో!" జీతగాడు.

సర్పంచి జీతగాణ్ణి గద్దించాడు. నోరు మూసుకోమన్నాడు.

సన్నోనికి బదులు చెప్పినందుకు జీతగాడి మీద ఇష్టం కలిగినా, సర్పంచి ఆ ఇష్టం ప్రకటించకూడదు కదా. అందువల్ల తిట్టినట్లు నటించి మెచ్చుకున్నాడు.

"రేటో, లంచంవో దుడ్డు కట్టినారు కదా!" ఎవరో అడిగారు.

"కట్టినారట అంటా, ఉండుమరి" అన్నాడు సన్నోడు.

"కట్టినారనే అనుకోవచ్చు గదా!"

"మీ ఇష్టం!"

"కాబట్టి గడ్డి సర్పంచిదే!"

"దొంగగడ్డి!" సన్నోడు.

"దొంగెవరు? " సర్పంచి గింజుకొన్నాడు. దొంగతనంగా గడ్డి తెచ్చుకొన్నారని అర్థం చెప్పుకొన్నారు.

మరొక పరిస్థితి అయితే సన్నోన్ని నున్నగా నాలుగు తన్నేవాళ్లే. ఇప్పుడు తన్నలేదు. తన్నలేరు? ఎందువల్ల? మాదిగ్గేరి ఊరంత ఉంది. మాదిగోళ్లకు రాంవుడు ఆదిగురువు. వాడెంత చెబితే అంత, వాళ్లదంతా ఒకటే మాట.

"ఉత్తబిత్తల నాకొడుకులు వాల్లకుండేదేముంది? ఊడేదేంది? పుట్టగోసి! సయ్యంటే పందెం. కోల్లాకట్ట కాల్లకు కత్తులు కట్టుకొని ఎగురతారు. తన్నుకు జత్తారు"

"రాంవుడు పెద్ద మనిషి. తిట్లాటలు, కొట్లాటలు ఒప్పడు. వాన్ని పిలవనంపరా దురా!"

"ఇది ఊరా? ఊరి దోవ ఊరిది. ఊరోల్ల తోవ ఊరోల్లది. యెవుని మాటా యెవుడూ ఇనడు!"

"వాల్లు అట్టగాదే! వాని మాటే యేదం, మంత్రం. వాని యదట వాల్లంతా బోనులో పుల్లు"

"వాల్లను గాదని వీల్లు అనేకీ లేదు. ఆడేకి

లేదు. వాల్లంతా ఒకే గుంపు. ఊరంతా చిల్ల రమల్లర గుంపులు"

మాదిగ్గేరి నుంచి పదిమంది యువకులు అన్నల్లో చేరారు. మాదిగలకు అన్యాయం జరిగితే ప్రజాకోర్టు పెడతారు.

"వీల్లతోనయినా యాగొచ్చుగాని, వాల్లతో యేగేకి కాదు గదా"

రాజకీయ నేత విశ్వేశ్వర్‌ది రాకెట్లే. రైతు కూలీ సంఘం నాయకుడు. ఆ సంఘంలో మాదిగలంతా చేరారు. వీళ్లను ఏమయినా అంటే సంఘం ముందుకు వస్తుంది.

"వాళ్లుగాని వస్తే గనక ఇంగది కమ్యూనిస్టు, కాంగ్రేసు, తెలుగుదేశంగా ఆగదు. రెడ్డోల్లు, కమ్మోల్లు తన్నుకు సచ్చే తంటానే. రాజకీయంగా పాక్షనే!"

"మాదిగోల్ల కేందన్నా కీడు మూడినాదా, సెప్పొద్దు, సంగపోల్లు, అన్నగార్లు వచ్చిపడేది" లారీలోంచి గడ్డి దించలేదు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. అందరూ మౌనంగా ఉన్నారు.

"లారీని కేంద్రానికే తోలల్ల" సన్నోడు.

"సేద్దెగాల్ల లెక్క? "

"పత్రం యాడ? "

"నోటిమాట"

"సాచ్చెం యాడ లేదు" నోటిమాట సెల్లదు.

అక్కడ చేరిన అందరూ మూజువాణి ఓటుతో, 'ఊరికి చేరిన గడ్డిని పెన్నోబులం పంపరాదు' అని తీర్మానించారు.

"కేంద్రానికి గనక తోలకపోతే గడ్డి అంద రికీ పంచల్ల"

రైతులకు గడ్డి పంచాలని, సేద్దెగాళ్లకు సర్పంచి మున్నూరు చెల్లించాలని కొందరు సూచించారు. కొందరు తిరస్కరించారు. లెక్కమాట మర్చిపోయి గడ్డి మాత్రం పంచు కోవాలని అందరూ ఏకీభవించారు.

"సెద్దెగాల్లకు నేను లెక్కగట్టేది లేదు" సర్పంచ్ తెగేసి చెప్పాడు. "దుడ్డాడబెట్టి గడ్డి కొండబోరి"

"దుడ్డులేదు" సన్నోడు.

"గడ్డిలేదు" సర్పంచి.

"లేక యాడ బోతాది? యావయితాది? "

"మాదిగోనికి చెప్పల్లా? " ఎవరో అన్నారు.

"మరేద! మరేద దేవరా! మాదిగోడు అన రాదు"

"అంటే యాంజేత్తా? " ఎవరో అడిగారు.

**వాళ్లుగాని వస్తే గనక ఇంగది కమ్యూనిస్టు, కాంగ్రేసు, తెలుగుదేశంగా ఆగదు. రెడ్డోల్లు, కమ్మోల్లు తన్నుకు సచ్చే తంటానే. రాజకీయంగా పాక్షనే!**

"పోలీసులతో పనిపడతాది"

సర్పంచ్ తగ్గాడు. మరెవరూ మాట్లాడ లేదు.

'కరణమయ్య మధ్యస్థం చేశాడు. ఊరి వాళ్లు నూటా యాభై గేరివాళ్లు నూటా యభై కట్టి గడ్డి పంచుకుంటే బాగుంటుంది.

సన్నోడు ధూత్తేరి వీలు లేదన్నాడు. చిందులు తొక్కాడు.

తలారి తోలుకొచ్చిన రాంవుడు అప్పుడు ఎదుట పడ్డాడు. కరణమయ్య పంచాయతీ సబబే అన్నాడు. సన్నోడు గింజుకున్నాడు. 'దుప్పటి పంచాయతీ' అన్నాడు.

రాంవుడు సన్నోడిని చంకలో ఇరికించుకు న్నాడు. పోట్లగిత్త పలుపుతాడు, ముగుదాడు చంకలో పెట్టుకున్నట్లు, పందెపు కోడి మెడ

బట్టి చంకలో ఇరికించి పట్టినట్లు.

సగం లారీ సర్పంచ్‌కి, సగం లారీ సన్నోడికి ఇచ్చేటట్లు అందరూ ఒప్పుకున్నారు.

సర్పంచి సరేనన్నాడు.

సన్నోడు అంగీకరించలేదు. లారీకి ఎవరూ లెక్క కట్టలేదు. పలుకుబడితో పల్లెలోకి వచ్చిన దొంగగడ్డి అది. తాను నూటయాభై కట్టాలి. సర్పంచ్‌కి గడ్డీ వచ్చింది. దుడ్డూ వస్తుంది. ఎటు చూసినా సర్పంచ్‌కే లాభం. ఊరికి మేలు కాదు. తనకు లాభం కాదు. ఇది అన్యాయం.

"ఇది న్యాయమే" అన్నాడు రాcవుడు సన్నోడిని ఇంటికి తీసుకుపోతూ. రాcవుని మాట అందరూ ఒప్పుకొన్నారు గాని సన్నోడు ససేమిరా అన్నాడు. ఇంటికి చేరిన తర్వాత "ఇది మోసం" అన్నాడు సన్నోడు.

"నిజమే" అన్నాడు రాcవుడు.

సన్నోడు బిత్తరపోయాడు.

'ఇది మోసమని నాకు తెలుసు'ననీ అన్నాడు.

సన్నోడికి ఏడుపు ఒక్కటే తక్కువ.

"తల బండకు కొడతావా? గుండుకు కొడతావా? ఇది మనూరు. మనవున్న ఊరు! ఉన్నూల్లో ఉండల్లా? వద్దా? యాడికి పోగలుగుదువు? పోతే సావ్వా? బతకాల్లగదరా సన్నబ్బ! సచ్చేదానికేల. బతకాల్ల. బతికేకి, బాగా బతికేకి బతుకుతూ ఉండల్ల! సచ్చేకి గాదు. సస్తవే అనుకో! యేం సాధించినట్లు! బతకల్ల! బాగా బతకల్ల! బాగుపడల్ల! యేంది యింటివా? "

"యినినాను లేప్పా"

"వాల్లతో గొడవలొద్దు! పెద్దోల్లు, ఉన్నోల్లు. వాల్లతో తూగేకి అయితాదా? కలిసే బతకల్ల, కలిసే సావల్ల! యెగిరెగిరి యేం జేత్తావు? యేంజేయవ్! వాల్లకి మనోట్లు గావాల్ల! మనకి వాల్ల సాయం గావల్ల! మనోల్లు కూలీనాలీ చేయల్ల. వాల్ల తర్లు, చేన్లు పండల్ల! కలిసి బతకల్ల! బట్ట కట్టల్ల! కలిసి మెలిసి ఉండల్ల!"

సన్నోడు తండ్రి చంకలోంచి జార బీక్కోవాలని చూస్తున్నాడు. వీలు కాలేదు.

"మా తాత ముత్తాతలు నోరెత్తే వోల్లుగారు. తలెత్తే వోల్లు గారు. వాల్ల ఎదురుంగా నిలబడేటోల్లుగారు!" తండ్రి.

"కాలం మార్లా" కొడుకు.

"కాలం మారినాది. దేసుంలో మార్పులు వచ్చినాయి. మనుసులు మారినారు. అంతా నిజమేరా సన్నబ్బ! కానిరా, సన్నోడా, మరేద గీత దాటరాదు"

"దాటితే గాంగా ఏమయితాది? "

"తప్పే"

"యంత కాలమప్ప ఇట్టా? "

"అంతమాటలొద్దు. తప్పు తప్పే! దాని మూలంగా ముప్పు ముప్పే!"

"వాల్ల బొంద. వాల్ల వల్లకాదు. వాల్లవల్ల ఏందేగాని కాదు. ఏందేగాని సెయ్‌లేరు"

"నీకు తెలసదురా సన్నబ్బా!"

"సంగం లేదా? "

"ఉణ్ణీ!"

"అన్నలు లేరా? "

"ఉండినారు లేరబ్బా- లేరంటినా? అండ జూసుకొని కొండ బాకమనినారు. కొండంత అండగా సంగమోల్లు, అన్నగార్లు ఉండేదమో ఉండేది. మనం బయిం లేకుండా ఉండేదానికీ వాల్ల అండ. బయిం పోగొట్టేదానికి వాల్ల అండ! వాల్లకి వీల్లు, వీల్లకు వాల్లు బయిపడేదికాదు ముక్కెం!బాగు పడేది ముక్కెం. వాల్ల అండతో మనం బాగా బతకాల్ల. శూద్రపోల్లతో సరిసమానంగా బతకాల్ల. అందరూ సరిసమానంగా ఉండల్ల! అన్నదమ్ముల మాదిరిగా ఉండల్ల. సావు గాదు, బయిం కాదు. ఎంతకాలం బయింతో బతికేది? బయిం లేని సావు గాదు, బయింలేని బతుకు!"

సన్నోడింక సహించలేకపోయాడు. తండ్రిని ప్రేమగా తిట్టటం వాడికి అలవాటే. "పోరా పోరా నీయమ్మ. నీ యెదవ

యాదాంతం నాకొద్దు" అని చేయి విడిపించుకొని మిద్దెలోకి వెళ్ళాడు సన్నోడు.

రాఁవుడి ఓర్పు, నేర్పు కొడుక్కే కాదు, గ్రామస్థులకు కూడా ఓదార్పునిచ్చాయి.

"వీని కడుపున వాడు సెడబుట్టినాడు" అన్నారు రాఁవుణ్ణి అంగీకరించినవాళ్ళు.

"తరం మారలేదా? " అన్నారు సన్నోడిని అర్థం చేసుకొన్నవాళ్ళు!




సర్కారు గడ్డి సగం లారీ సర్పంచి దొడ్డిలో దించి, మిగతా సగం రాఁవుడి దొడ్డిలో దించారు జనం. డ్రైవర్లు, క్లీనర్లు తీరుబడిగా ఉంటే రాఁవుడు వాళ్ళను మిద్దెలోకి పిలిచి, కాళ్ళకు నీళ్ళిచ్చి, చేతులు తుడుచుకోవటానికి కండువా ఇచ్చి, భోజనం చేయమని అడిగాడు. వాళ్ళు తిన్నారు. రాగి సంగటి, మెంతాకు పప్పు బాగుందంటూ తిన్నారు వాళ్ళు. మజ్జిగ తాగారు. బీడీలకు చిల్లర ఇచ్చాడు. లారీ వెళ్ళిపోయింది.

గడ్డి తాలూకా రొక్కం నూటాయాభై రూపాయలు సర్పంచికి ఇవ్వటానికి రాఁవుడు వెళ్ళాడు. సర్పంచి ఇంకా ధాం ధూం లాడుతూనే ఉన్నాడు.

రాఁవుడు అనునయించాడు. ఏమీ అనుకోవద్దన్నాడు. సన్నోని కూతలు మన్నించమన్నాడు. పెద్ద మనస్సు చేసుకోమని యాచించాడు.

సర్పంచి కొంచెం శాంతించాడు. అయినా లోపల మంట రగులుతూనే ఉంది.

చివరకు లెక్క ఇవ్వచూపాడు రాఁవుడు. సర్పంచి తీసుకోలేదు.

"నీ సొమ్ము దేవరా!"

"మల్ల!"

సర్పంచి తాను దుడ్డు కట్టలేదని ఆలోచిస్తున్నాడో, లెక్క తీసుకొంటే తన పెద్దరికం దెబ్బ తింటుందనుకొన్నాడో, పైసా కోసం లేకిగా పడిచచ్చే మనిషని అనుకోకుండా చూచుకోవాలనుకున్నాడో, "మల్ల" అన్నాడు.

"ఇగెప్పుడు దేవరా. ఇబుడే తీసుకో సామీ" అన్నాడు.

"మల్ల ఇద్దువు లేవై" అన్నాడు సర్పంచి. సర్పంచి 'వై' అన్నందువల్ల కోపం లేదని, ఆత్మీయంగానే ఉన్నాడని రాఁవుడు భావించాడు.

"లెక్క తీసుకుంటే నాకు కుశాలగా ఉంటది దేవరా!"

"సన్నోని కాడుంచు!"

సన్నోడు వచ్చి క్షమాపణ చెప్పి లెక్క ఇస్తే తిట్టి, తిమ్మి తీసుకుంటాడు సర్పంచి అని రాఁవుడికి అర్థమయింది.

కానీ సన్నోడు వచ్చి క్షమాపణ చెప్పటం రాఁవుడికి ఇష్టంలేదు.

సన్నోడు వస్తే క్షమాపణే చెబుతాడో, చావు కబురే తెస్తాడో తేల్చి చెప్పేది కష్టం. అందువల్ల వాడు ఈడకి రారాదు. రాకపోతే పరిణామాలు ఊహించడం కష్టంగా ఉంది.

సర్పంచి సొమ్ము తన దగ్గర్నుంచి తీసుకోడు. సన్నోడే ఇవ్వాలి. వాడు ఇవ్వాలంటే రాఁవుడికి భయంగా ఉంది.

రాఁవుడు దిగులుగా ఇంటికి చేరాడు. గేరిలో ఎవరితోనూ మాట్లాడలేదు.

సన్నోడితో మాత్రం చాలా విషయాలు చెప్పాడు. ఇష్టంలేని పని చేయమని తండ్రి పురమాయించటం, ఇష్టంలేని పని చేయవలసి రావటం సన్నోడికి చావుగానే ఉంది.

కాని తండ్రి మాట వేదవాక్కు. సుగ్రీవాజ్ఞ! తండ్రి మాట చెల్లాలి. తనకు అవమానం కారాదు.

దుడుకు పని, మాట ఉండరాదని హెచ్చ రించి రాఁవుడు పొద్దునే కొడుకును దుడ్డు ఇచ్చి సర్పంచి దగ్గరకు పంపాడు.

సన్నోడు సర్పంచి ఇంటికి పోయాడు. తోటకు పోయాడంటే తోటకాడికి వెళ్లాడు. ఇప్పుడే ఇంటికి చేరాడంటే మళ్ళీ ఇంటికి వచ్చాడు.

సర్పంచి పడుకొన్నాడంటే వీధిగోడకాను కొని కూర్చున్నాడు సన్నోడు.

వచ్చే, పోయేవాళ్ళు సన్నోడిని చూస్తు న్నారు. మదమణిగిందని లోలోపల గొణు క్కుంటున్నారు.

పొద్దుగుంకే వేళకు వరండాలోకి వచ్చాడు సర్పంచి.

"దణ్ణం దేవరా" అన్నాడు. సర్పంచి విని పించుకోలేదు. మళ్ళీ దండం పెట్టాడు. సర్పంచి చూడలేదు. "దణ్ణం దేవరా" అని అరిచాడు.

సర్పంచి తల ఎత్తి ముఖంలోకి చూశాడు.

"తప్పయిపోయింది దేవరా, మన్నించాలి"

సన్నోడు కాళ్ళ దగ్గరకు రాలేదు.

"సన్నోడా నువ్వేం తప్పు జేసినావురా? యేం లేదు" అన్నాడు సర్పంచి.

సన్నోడికి తృప్తి, సంతోషం.

"పొరపాటే దేవరా" అన్నాడు.

"పోనీలేప్పా!" అన్నాడు సర్పంచి.

"లెక్క దేవరా!"

"యేం లెక్క!"

"గడ్డి లెక్క!"

"యెంత? "

"నూట యాభై!"

"నాకేల! సేద్దెగాల్ల లెక్కనా? వద్దులేరబ్బ! మీరే ఉంచేసుకోండ్రి!"

సన్నోడు సందేహంలో పడ్డాడు. తానా సొమ్ము చెల్లించలేదు కాబట్టి తీసుకోవటానికి ముఖం చెల్లటంలేదు అనుకొన్నాడు. మాది గోడు ఇచ్చేవాడు, తాను తీసుకొనేవాడు కావటం ఇష్టం లేక పుచ్చుకోవటం లేదనుకొ న్నాడు.

'పోనీ పేదవాళ్ళు వాళ్ళ సొమ్ము నాకెం దుకు అనుకొన్నాడా? ' అనీ ఆలోచించాడు.

తన సొత్తు పైసా వదలని సర్పంచి, ఇంత సొమ్ము వద్దంటుంటే కారణం అర్థం కాక సన్నోడు నానా అగచాట్లు పడుతు న్నాడు.

తాము సర్పంచికి రుణపడి ఉండాలా?

దయ తలిచాడా?

దయతో పొగరణుస్తున్నాడా?

భయపడ్డాడా? భయపడే మనిషి కాదు సర్పంచి.

నలుగురూ బాగుండాలని భావిస్తు న్నాడా? అంత ఉదారబుద్ధి ఉంటే మంచిదే!

నలుగురికీ తన మంచితనం తెలియాలని యోచిస్తున్నాడా?

అతని ఆంతర్యం ఏమీ అంతుపట్టకుండా ఉంది.

లెక్క తీసుకోడా?

ఇప్పుడు తీసుకోడా?

ఎప్పుడు తీసుకొంటాడు?

మంచి మనస్సు చూపుతున్నాడా? సర్పంచి మంచితనం భరించే శక్తి తనకు లేదని సన్నోడు కిందా మీదా అవుతూ ఉన్నాడు.

ఈ సొమ్ము నాది కాదు. సర్పంచి సొమ్ము. పరుల సొమ్ము పాము వంటిది. పామును చేతితో పట్టుకోరాదు. జేబులో ఉంచుకోరాదు.

సర్పంచి లెక్క తీసుకోకపోతే పాము పడగ నీడలో తాను బతకలేడు.

తాను రుణగ్రస్తుడు కాలేడు.

ఎన్ని కష్టాలు వచ్చినా, తమ తాతము త్తాలు గానీ, తల్లితండ్రులు గానీ, అన్నద మ్ములు గానీ, తాను గానీ అప్పు చేయలేదు.

అప్పు శాపం!

అప్పులు చేయటం అలవాటు కారాదు.

అప్పులు ఆస్తులు హరిస్తాయి. కాపురాలు కూలుస్తాయి. సుఖాలు హరిస్తాయి. మానా

భిమానాలు మంట గలుపుతాయి.

తాము అడగని అప్పుకు, చేయని అప్పుకు సర్పంచి తమను బలిచేసి, రుణగ్రస్తుల్ని చేస్తున్నాడు. తరువాత పీడిస్తాడు. లెక్క లేనప్పుడు సతాయిస్తాడు. చావుదెబ్బ తీస్తాడు.

సర్పంచి వరండాలో ఉయ్యేల బల్లమీద కూర్చుని కాళ్ళూపుకొంటూ ఊగుతున్నాడు.

మాదిగలు వరండా మెట్లు ఎక్కరు, ఉయ్యేల బల్లకాడికి పోరు.

సన్నోడు "నన్ను మన్నించు దేవరా" అన్నాడు. ముందుకు వచ్చాడు. వరండా మెటికలు ఎక్కాడు.

సర్పంచి ఉయ్యేల ఊగటం ఆగిపో యింది. గాల్లో ఊగుతున్న అతని కాళ్ళు నేలమీద ఆనాయి.

"అప్పు నాకొద్దు దేవరా! అప్పులు మా ఊపిర్లు తీత్తాయి దేవరా!" వరండాలో నడి చాడు. "సొమ్ము నీది. నీ లెక్క నీకాడే ఉండల్ల" అని నూరు రూపాయిల నోటు, యాభై రూపాయిల నోటు ఉయ్యేల బల్ల మీద పెట్టి, విసనగర్ర దాని మీద ఉంచి, "దయ తలవండి దేవరా" అని వరండా దిగాడు.

ఏ మాదిగవాడూ ఇంతవరకు ఇంత దూరం రాలేదు. సన్నోడి ఉద్దేశం ఏమిటి? సర్పంచి ఆలోచనలో పడ్డాడు.

ఎవడూ తను వద్దన్న పని చేయలేదు. వీడు చేశాడు. ఏమిటి వీడి ప్రవర్తన?

తాను తీసుకోదలచని సొమ్ము, తీసుకొనే టట్టు చేసిన మొగోడు ఇంతవరకు ఎవడూ లేడు. వీడెవడు?

అంతులేని ఆశ్చర్యం!

సన్నోడు వెళ్ళిపోతుంటే సర్పంచి బిక్క ముఖంతో చూడసాగాడు.

కాలం మారిందా? మనుషులు మారారా? దేశం మారిందా?

ఈ మార్పు వెనుక ఏ శక్తులు పనిచేస్తు న్నాయి? సర్పంచి ఆలోచనలో ఉండగా పొద్దు గుంకింది.




తమ గ్రామానికి రావలసిన సర్కారు గడ్డి లారీలు అనంతపురంలో బయలుదేరాయని ఊరివాళ్ళు అనుకొంటుంటే గేరిగాళ్ళకూ తెలిసి, రాఁవుడు ఆనందపరవశుడయ్యాడు. కానీ భయం మాత్రం తొలగిపోలేదు. లారీ లు ఈ ఊరు చేరవని, ఎవరో యువకులు ప్రతిజ్ఞ చేశారని పుకారు బయలుదేరింది. 'రాక ఏమవుతాయి?' అని, 'గేరి పిల్లలు కోపంగా ఉన్నా'రని వాళ్ళు వీళ్ళు చెప్పుకొం టున్నారు.

మొన్న గడ్డిలారీ తగలబడిందని, రాళ్ళ గుట్ట తాండా సుగాలీలను అరెస్టు చేశారని, యం.యల్.ఏ కేశవ్ వాళ్ళను విడిపించటా నికి పోలీసు స్టేషనుకు వచ్చాడని ఈనోటా ఆనోటా ఆ మాటలు వ్యాపిస్తూ ఉన్నాయి.

కిందటేడు సర్పంచి ఇంటికి వచ్చిన లారీనీ ఆపి సగం గడ్డిని పంచుకొన్న రాఁవుడి కుటుంబం అంటే, పైకి కనిపించకపోయినా, కంటగింపు ఉందనే సత్యం చూచాయగా తెలుస్తూనే ఉంది.

'మాదిగలకింత పొగరా?' అని ఊరు, 'మాదిగలంటే ఇంత అలుసా' అని గేరి మధనపడుతున్నట్లు పరిస్థితి అర్థమవుతూనే ఉంది.

పోయినేటి నుంచి బాగా నలిగిపోయిన రాఁవుడు కలత చెందుతూనే ఉన్నాడు. వంట్లో కూడా బాగుండటం లేదు. పిల్లలు

పశువుల్ని కబేళాకు తోలుతామన్న క్షణం నుంచి రాఁవుడు కుంగిపోయాడు. రాఁవుడికి ఇంటా బయటా కష్టకాలం దాపురించినట్లు అనిపించసాగింది.

సెల్‌ఫోన్‌లు వచ్చి ప్రపంచం కుదించుకు పోగా నేరాలకు కూడా మార్గం సులువైంది. సెల్‌ఫోన్లలో సమాచారం అందుకొన్న యువకులు లారీలను అటకాయిస్తారని రాఁవుడికి ఎవరో నూరిపోశారు.

లారీలు బయలుదేరితే వీళ్ళేం చేస్తారు? రానివ్వరా? రోడ్డు మీదికి పోయి వాటిని ఆపుతారా? ఆపరు!

ఆ లారీల ఆచూకీ తెలుసుకొని నిప్పు పెట్టి గేరివాళ్ళ మీద కేసు పెడతారట!

అటు గడ్డీ గ్రామంలోకి రాదు, ఇటు యువకులూ పోలీసుస్టేషన్‌కు పోతారు సుగాలీలు లాగా.

పేదల మీద ఎవరికైనా పెత్తనమే! పేద లంటే ఎప్పుడూ అలుసే!

లారీ తగలబెట్టకపోతే - లోడు ఎక్కడ యినా దించేట్టు చేస్తారా?

డ్రైవరు ఒప్పుకోకపోతే- కొడతారా? డ్రైవర్లు పేదలే కదా! అనవసరంగా దెబ్బలు తినలేరు కదా.

సర్పంచి సంతకం ఎవరు చేస్తారు? ఎవ రయినా చేయవచ్చు ఫోర్జరీ చేస్తారా? ఏం ఇబ్బంది లేదు. ప్రమాదం కదా? కాదు! తప్పు కదా? కాదు! ప్రతీకారం!

డ్రైవర్లు నీతిగా ఉండరా? మామూలు పరిస్థితుల్లో ఉంటారు. లారీ తగలబడే పరి స్థితి వచ్చినప్పుడు తన లారీని కాపాడుకోవ టానికి ఏ డ్రైవరు అయినా వాళ్ళు చెప్పిన పని చేస్తాడు.

ఇన్సూరెన్సు క్లెయిం చేయటానికి ఏ ఓన రయినా తన పాత లారీని ఆందోళనకారులు తగలబెట్టారని చెప్పటానికి సంసిద్ధుడౌ తాడా?

కావచ్చు. అవకాశం లేకపోలేదు. ఆ పరి స్థితుల్లో సర్కారు గడ్డిలారీ తమకు దక్కదు.

గేరి యువకులు ముష్టూరు దగ్గర లారీ లకు స్వాగతం పలకటానికి రోడ్డు మీద ఉన్నారని రాఁవుడు విన్నాడు.

పెన్నోబులం దగ్గర లారీలు రానీమనీ యువకులు కాపు కాశారని తెలుస్తూ ఉంది.

గడ్డిలారీ, అడ్డగించే వాళ్ళను దాటి వస్తే, ఆహ్వానించేవాళ్ళ పూలమాల అందుకొం టుంది.

గడ్డి చేరయనీయమనే పంతం, పట్టుదల అన్యాయం. కానీ న్యాయం చెప్పేవాళ్ళు ఏరి?

రాఁవుడు ఊరివాళ్ళను తప్పు అనలేడు. గేరివాళ్ళను ఒప్పు అనలేడు. అన్నా వినిపిం చుకొనే దిక్కులేదు.

కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకు కోపం- ఏం చేయాలి?

పాముకు కప్ప దొరక్కుండా ఉండడమే శ్రేయస్కరం.

కానీ ఆ స్థితి దాటిపోయింది.

'కన్నబిడ్డల్లాంటి గొడ్ల నోటికాడి కూడు- బంగారం లాంటి గడ్డి - సర్కారు గడ్డి- పోతే పోయిందిలే, పోనీండి' అని తాను అనలేడు.

లారీలు వచ్చేట్టు చూడండని చెబితే వినే వాళ్ళు లేరు. లారీలను రాకుండా ఆపకండి అంటే ఆ మాటే ఎవరికీ వినబడదు.

తన ముగ్గురు కొడుకులు గేరి యువకు లతో కలసి ముష్టూరు అడ్డరోడ్డుకాడ లారీ లకు ఆహ్వానం పలికే గుంపులో ఉన్నారని రాఁవుడికి తెలుసు. రాఁవుడు వాళ్ళు క్షేమంగా ఇంటికి తిరిగి వస్తే చాలునని కోరుకొంటున్నాడు.

రాఁవుడింట్లో గడ్డి లేదు. దొడ్లో గడ్డి లేదు. తోటలో లేదు. చేనిలో లేదు.

గొడ్లు ఉసూరుమంటూ చూస్తున్నాయి, అరుస్తున్నాయి. కట్టుగొయ్యి చుట్టూ తిరుగు తున్నాయి.

కుడితినీళ్ళు కూడా లేవు. తవుడు చిట్టు

## ఎముకల దారుఢ్యం కోసం

దృఢమైన శరీర దారుఢ్యంతో బాటు పటిష్ఠమైన ఎముకలు కల్గి ఉండటం దేహదారుఢ్యానికి చిహ్నం. ఎక్కువ మంది పురుషుల్లో ఎముకల బలహీనత (ఆస్టియోపోరోసిస్) ఉంటుంది. ఇది వంశపారంపర్యంగా కూడా వస్తుంది. దృఢమైన ఎముకల బరువుకోసం ఆర్థోపెడిక్ అసోసియేషన్ ఆఫ్ అమెరికా నిపుణులు కొన్ని సూచనలు చేస్తున్నారు. కాల్షియం, విటమిన్ 'డి' ఎక్కువగా తీసుకోవటం వల్ల ఎముకలకి దృఢత్వం వస్తుందని చెబుతున్నారు. తరుచు ఫ్రాక్చర్ల బాధ ఉండదు. కొవ్వు తక్కువగా ఉన్న పాలు మూడు గ్లాసులు తాగటం ద్వారా రోజూ 1000 మి.గ్రా.ల కాల్షియం లభిస్తుంది. 200-400 ఐయుల విటమిన్-డి సూర్యరశ్మి, చేపనూనె, ఆకు కూరల నుండి లభ్యమవుతాయి. వాకింగ్, జాగింగ్, మెట్లు ఎక్కటం వంటి వ్యాయామాల వల్ల కూడా ఎముకల పటిష్ఠత పెరుగుతుంది.

సిగరెట్లు తాగటం వల్ల శరీరంలో కాల్షియం గ్రహించే గుణం తగ్గి, ఎముకలలో ఉండే కణాలు నశించి, పెరుగుదల ఆగిపోతుంది. మద్యపానం వల్ల సహజ సిద్ధమైన ఎముకల పెరుగుదల నశిస్తుంది. అంతేకాక పురుషుల్లో ఉండే టెస్టోస్టిరాన్ ప్రమాణాలు తగ్గి తద్వారా ఎముకల పటిష్ఠత తగ్గే అవకాశం ఉంది. ఎక్కువగా మద్యం సేవించడం వల్ల శరీరంలో ఉండే కాల్షియం మూత్రం మూత్రం ద్వారా బయటకు పోతుంది. ఆకుకూరలు, పండ్లు ఎక్కువగా తినటం వల్ల ఎముకల బరువు పెరుగుతుంది. మెంతికూర, ములగ కాయలు తినటం వల్ల శరీరానికి విటమిన్-కె లభ్యమయి విరిగిన ఎముకలు త్వరగా అతుక్కునేందుకు తోడ్పడుతుంది.



ఏమీ లేని నీళ్ళను ఎన్నిసార్లు తాగుతాయి పశువులు! ఏం లాభం?

తోటలో పంపునీళ్ళు పారే కాలవకు ఇరువైపులా ఎంత వేసవిలో అయినా ఇంత పసిరిక ఉండనే ఉంటుంది. ఎంత కొరికినా గుప్పెడు కాదు కానీ, ఎంతో కొంత కొరకటానికి ఉంటుంది. రోజూ కొరకటం వల్ల ఇగుళ్ళే లేవు.

లచ్చువుని చూస్తుంటే గుండె పగులుతున్న రాంవుడు, ఏదైనా చేయాలని, లేకపోతే వాని ప్రాణం పోతుందని, తాను చూస్తూ వాన్ని చంపలేడనీ, వాడు చావటం భరించలేడని భావించి వాన్ని మేపుకు రావాలనుకొన్నాడు.

తోటకు తోలుకొనిపోతే నాలుగు గరిక పరకలు కొరకవచ్చు. తోలుకు పోవాలి. సిద్ధపడసాగాడు.

లచ్చువుడు అసలే ముసలి ఎద్దు. లేవలేడు! లేస్తే పడుకోలేడు. ఎముకల గూడులా ఉంది. చర్మం ఎక్కడ లాగినా ఇంత పొడుగు సాగుతూ ఉంది.

నిజానికి అది కాటికి కాళ్ళారజాపుకొని ఉంది. రాంవుడిని చూస్తూ బతుకుతోంది.

రాంవుడి చూపు దానికి ఆకలి దప్పిక తీరుస్తున్నాయి.

నిజానికి అది ఎండుగడ్డి కొరకలేదు. నమలలేదు. మింగలేదు. కుడితి తాగటమే కష్టంగా ఉంది. అది పచ్చిగడ్డి కూడా కొరక

లేదు. నేలమీది లేత మొలకలు చూస్తే ఉత్సాహం వచ్చి ఏమయినా కొరకవచ్చు నమలవచ్చు అని రాcవుడి ఆశ.

రాcవుడు కూడా పెద్దవాడయిపోయాడు. వయసువల్లే కాదు, ఆలోచనల వల్ల కూడా వార్థక్యం వచ్చింది. ఆందోళనవల్ల నరాల పట్టు సడలింది. ఈ రెండు రోజుల పరిణా మాలు మరీ ప్రాణాంతకంగా మారాయి.

కరువు కష్టాలు తెచ్చింది. పంటలు లేవు. ఇంట్లో గింజలు అడుగంటాయి. దొడ్లో మేత లేదు. భార్యాపిల్లలతో కొడుకులు తిండికి తిప్పలు తప్పటంలేదు. నోరు లేని మూగజీవులు గడ్డి లేక, కావాలని అడగలేక అగచాట్లు పడుతున్నాయి.

ఇంతకాలం పరువుగా కాపాడుకొంటూ వస్తున్న కుటుంబం పరిస్థితి ఏమవుతుంది? వాళ్ళెలా జీవిస్తారు?

పంట ఇచ్చిన పొలాలు బీళ్ళు అయ్యాయి. పంట ఇంటికి తెచ్చిన పశువులు గడ్డిలేక దిక్కులేని చావు చస్తున్నాయి.

వీడు మాదిగోడు అనిపించుకోకుండా రాcవుడు కూడా మనిషేను అనిపించుకోవటానికి ఆరాటపడి, కష్టనష్టాలు ఓర్చుకొని, కన్నీళ్ళు దిగమింగి, బాధలు భరించి, గేరి జనం అలుసుకాకుండా ఆదుకొంటూ సాదుకొంటూ వస్తున్న తాను, ఎంతకాలం బతగ్గలడు? వీళ్ళెలా బతుకుతారు?

మర్యాద కోసం, మన్నన కోసం పడిన పాట్లు ఎలా పరిణమిస్తాయి?

అవమానాలు రాకుండా, అవస్థలపాలు కాకుండా, అగచాట్లు పడకుండా ఒంటరిగా నిశ్చలంగా, నిశ్చయంగా నిలబడ్డ తాను ఎంతకాలం నిలబడగలడూ?

గొడ్ల మేత వస్తుందో, రాదో?
లారీలు రానిస్తారో, రానీరో?
ఘర్షణలు జరగవు కదా!
ఏం పరిణామాలు వస్తాయో?
గేరి ఏమవుతుందో?

ఊరి వారి యోగక్షేమాలు భద్రంగా ఉండాలి. ఉంటాయి కదా! ఉండవా? ఉండకపోతే ఏం చేయాలి?

తన కొడుకులు ఎలా ఉంటారో, వాళ్ళ సంసారాలు ఎలా సాగుతాయో? పిల్లలు ఎలా పెరిగి పెద్దవాళ్ళవుతారో?

ఎంత భయం?

ఎవరికీ శాంతి ఉండదా? సుఖం ఉండదా? నిశ్చింత ఉండదా?

అన్నదమ్ముల్లాగా అందరూ కలిసి మెలిసి ఉండలేరా?

భగవంతుడా! మా ఊరిని, మా నేల తల్లిని, మా పశువుల్ని కాపాడు తండ్రీ.

భగవంతుడా! మా ఊరివాళ్ళంతా అన్నదమ్ముల్లా ఐకమత్యం, సుఖశాంతులతో ప్రశాంతంగా జీవించే వరం ప్రసాదించు తండ్రీ.

భగవంతుడా! మమ్మల్ని కనికరించు. వానలు కురిపించు, కరవు లేకుండా చేయి. మమ్మల్ని కన్నావు, పెంచావు, పోషించావు. ఈ కష్టాల్లో కాపాడు తండ్రీ.




మనోవేదన కొంత, తమ్ముడి లాంటి ఎద్దు అవస్థ కొంత, ఇద్దరి అనారోగ్యం కొంత, వృద్ధాప్యం కొంత కారణాలు కాగా, రాcవుడు తల్లడిల్లిపోయాడు.

కరవుతో కలిసి పరిస్థితులన్నీ సమూహంగా దండెత్తి దాడిచేసి, గుండెను పిండి, గొంతును నులిమి ఊపిరాడకుండా చేస్తే నిస్తేజంగా, నిర్వీర్యంగా, సజీవ శవంగా నిలబడిపోయాడు రాcవుడు, దిక్కులు చూస్తూ.

లారీల జాడలేదు.

ఏం చేయాలో తెలియక, ఏం చేయకుండా ఉండాలో తెలియక, ఆలోచనలేక, ఆగలేక కాళ్ళకు మెట్లేసుకొని, గొంగడి భుజాన వేసు కొని చేతికర్ర ఊతంతో తమ్ముని కాడికి వచ్చాడు. రాCవుడిని చూచిన లచ్చువుడు బలహీనంగా రంకేసి, అవస్థపడుతూ లేచి నిలబడ్డాడు. రాCవుడు మంచం కింద ముని రగదీసుకొని పడుకొన్న బూసి లేచి, పరుగు పరుగునా వచ్చి, ఎద్దు చుట్టూ తిరిగింది. పొలం పోయే పరిస్థితి అర్థం చేసుకొంది.

'తోటకి పోదాం' అన్నాడు రాCవుడు. 'రాలేను' అనలేదు. 'రాగలవా' అని లచ్చు వుడు అడిగినాడు. 'నాకేం ఫరావాలేదు' అన్నాడు రాCవుడు. అదేమాట లచ్చువుడూ అన్నాడు. 'నీ గురించే నా చింత' ఇద్దరూ అన్నారు. ఇద్దరూ బయలుదేరారు. బూసి వెంట పోసాగింది.

ముసలి లచ్చువుడి వంట్లో ఓపిక లేదు. ఒక్కొక్క అడుగూ లెక్కబెట్టుకొంటూ నడు స్తోంది.

రాCవుడికీ శక్తి లేదు. మనశ్శక్తి మాత్రం పుష్కలంగా ఉంది. చేతికర్ర అండ! బూసి కాపలా!

ముందు అన్న, వెనక తమ్ముడు, అన్నద మ్ముల పరిస్థితి ఒకేరకంగా ఉంది. కదల్లేక, గత్యంతరం లేక, నెమ్మదిగా నడిచిపోతు న్నారు.

తోట గేరినానుకొనే ఉంది. ఎంతో దూరం కాదు.

రావుని లచ్చువుని వారించటానికి ఇంట్లో ముగ్గురు కొడుకుల్లో ఒక్కరూ లేరు. సర్కారు గడ్డి కోసం ముష్టూరు అడ్డరోడ్డు కాడ ఉన్నారు.

కోడళ్ళు మామ చెబితే వినేవాళ్ళేకానీ, ఎదురు చెప్పేవాళ్లు కారు. ఎదుట నిలబడే వాళ్ళు కారు. ముఖంలోకి కూడా చూసే ధైర్యమున్నవాళ్లు కారు. పిలిస్తే తలొంచుకొని నిలబడతారు. ఆC ఊC! కంటె ఎక్కువ శబ్దం ఉండదు.

రాCవుని చూచి, ఎదురుపోయి, ఆపి 'గంజి తాగిపో దేవుడూ' అంది పెద్ద కోడ లు. కోడలు ఎదుటకి వచ్చినందుకు రాCవు నికి చాలా సంతోషమయింది. పిల్లలు పెద్ద వాళ్ళు అవుతున్నారు. కోడళ్ళు సొంతంగా ఆలోచించేవాళ్ళు అయినట్లు ఉన్నారు. పెద్ద కోడలి ముఖంలోకి ప్రేమగా చూశాడు. "లచ్చువుడు ఏమీ తిన్లే" అన్నాడు. తాను లచ్చువుడికి ఏమీ ఇవ్వలేదు. "పిల్లోల్లకే గంజి ఈమ్మా! పో తల్లీ!" అన్నాడు. ముందుకు కదిలిపోయాడు.

ఆమె గంజి ఇవ్వటం ముఖ్యం కాదు. తోటకాడికి పోనీయకుండా ఆపటం ము ఖ్యం. మనిషి నడవలేడు. లచ్చువుడూ నడ వలేడు. పోనీయరాదని సంకల్పం. పోలేడని బాధ. పోవద్దని అభ్యర్థన. అన్నీ కలగలిపి గంజి తాగమని అడిగింది కోడలు, పెద్దామె.

లచ్చువుడు అన్నను, పెద్దకోడలిని చూసి ప్రేమగా నవ్వాడు. అన్న గంజి తాగకపో యినందుకు దిగులు పడ్డాడు. తానేమీ తిన లేదు, తాగలేదని అన్న పడే అవస్థను చూసి ఏమనాలో తెలియక కళ్ళలో నీరు నింపుకొ న్నాడు.

బూసి ఇద్దరినీ ఎగాదిగా చూసింది.

లచ్చువునికి అన్నతో తోటకు పోవాలని తెలుసు. పచ్చగడ్డి మొలకలు తనకు తినిపిం చాలని అన్న ఆలోచన అనీ తెలుసు. తాను కొరకలేనని, నమలలేననీ అన్నకు తెలుసు. అన్నీ తెలిసినా, అన్న ఆరాటం ఆగదు.

అన్నను చూస్తే భయంగా ఉంది. బాధ గా ఉంది. నడవలేక పడిపోతాడేమోనని దిగులుగా ఉంది. ఊతకర్ర ఉందిలెమ్మని ఊరట.

తనకూ ఓపిక లేదు. కానీ అన్నమాట కాదనలేక అడుగుల్లో అడుగులు వేసు కొంటూ నడుస్తున్నాడు లచ్చువుడు. బూసికి

ఏడుపు వస్తూవుంది. అదేమీ చేయలేదు. రాcవుడిని ఆపలేదు. వెంట పోవటం తప్ప ఏమీ చేయలేదు.

అన్నదమ్ములిద్దరూ తోటకు చేరారు. ఇద్ద రికీ సంతోషంగా ఉంది. ఉత్సాహంగా ఉంది. హుషారుగా ఉన్నారు.

రాcవుడు తమ్ముని మెడ ముద్దు పెట్టుకు న్నాడు. మూపురం తాకాడు. గంగడోలు సవరించాడు. వళ్ళంతా తడిమాడు. తోక గుప్పిట పట్టి జార్చాడు. ముఖంలోకి ప్రేమ గా చూశాడు. కళ్ళు తుడిచాడు. లచ్చువుడు కళ్ళు టపటపలాడిస్తూ, మూస్తూ, తెరుస్తూ చూశాడు.

ఎదురుగా నిలబడి రెండు చేతులతో ముఖం పట్టుకొని ముట్టెమీద, నుదుటిమీద ముద్దులు పెట్టాడు. తనకు చిన్నారి ముద్దుల తమ్ముడు లచ్చువుడు.

లచ్చువుడి నవ్వు చూసి రాcవుడూ నవ్వా డు. అన్నకు ఆనందంగా ఉన్నా, దుఃఖంగా ఉన్నా, తమ్ముణ్ణి ఇలా ముద్దు పెట్టుకొంటా డని లచ్చువుడికి తెలుసు.

అన్న దగ్గరగా ఉండగానే లచ్చువుడు అన్న ముఖం నాకాడు. ముక్కు నాకాడు. నుదురు నాకాడు. ఓపిక లేదు. అయినా నాకుతూ ఉన్నాడు. అన్న దూరంగా పో లేదు. తమ్ముడు నాకటం ఆపలేదు. బూసి వాళ్ళ చుట్టూ తిరుగుతూ ఉంది.

'సాల్లేరా సామి' అన్నాడు రాcవుడు. ఇవాళ కొత్తగా ఉంది. పాత చేతులే, పాత కళ్ళే, పాత ముఖమే! అన్న వళ్ళు నిమురుతుంటే అన్నలాగా లేడు. దేవుడు లాగా ఉన్నాడు. అమ్మలాగా ఉన్నాడు. అన్న చేతులు చేతులులాగా లేవు. పేగులులాగా ఉన్నాయి. తల్లి పేగులు. పేగు బంధం. తనను మోసిన పేగుల్లాగా, కన్నతల్లి పేగులులాగా, కాపాడే, మోసే, కనే పేగులులాగా అనిపించాయి.

అన్న కళ్ళు కళ్ళు లాగా లేవు. సూర్య చంద్రుళ్ళ లాగా లేవు. వేడిగా ఉన్నాయి. చల్లగా ఉన్నాయి. ఎండలా, వెన్నెలలా ఉన్నాయి. అన్న అమ్మలా, ఆవులా, భూమా తలా, దేవదూతలా ఉన్నాడు.

అన్న వద్దన్నా లచ్చువుడు అన్న మూతిలో మూతి పెట్టి ముఖానికి ముఖం అనించి, ఆవుతల్లి లేగదూడను వళ్ళంతా నాకినట్లు, నాకుతూ ఉన్నాడు.

రాcవుడు వద్దనలేదు. దూరంగా పోలేదు. తల్లి ఒడిలో ఒదిగిపోయే బిడ్డలాగా ఇమిడి పోయాడు.

లచ్చువునికి రావుని వొళ్ళంతా నాకటం ఇష్టంగా ఉంది. శరీరానికి శరీరం తగిలిస్తూ నిలబడ్డాడు. ఎంతసేపు అలా నిలబడ్డారో వాళ్ళకే తెలియదు.

పొద్దు పడమటికి పోతుంటే నీడలు తూర్పుకు కదులుతున్నాయి. తన కాళ్ళకింద నీడ దూరం జరుగుతుంటే బోరు కాలువ గట్టుకు లచ్చువుని రాcవుడు నడిపించాడు.

రాత్రి పుట్టిన మొలకల్ని తినా లని,తినలేక, ముట్టితో లచ్చు వుడు కుదుపుతూ ఉన్నాడు.



తనకు ఓపిక లేదు. అయినా అన్న ఆజ్ఞ శిరసావహించటానికి శిరస్సు వంచి ముట్టెతో మొలకల్ని రాస్తున్నాడు.

ఈ గడ్డి మొలకలు నిన్న లేవు. రాత్రి పుట్టాయి. ఆ గడ్డి పరకల్ని కన్న తల్లిదండ్రులు ముసలివాళ్ళు అయిపోయారు. మొటికలు అయిపోయారు. తెల్లబడి ఎండిపోయి కూడా గుండెల్లోని ప్రేమను మొలకల రూపంలో భూమికి దానం చేశారు.

లచ్చుపుడు మేయలేడని తెలిసినా, నాలుకతో మొలకల్ని ముద్దు చేస్తున్నాడని తెలిసినా, ఆ గట్టు దగ్గర వదలటంలో రాంవునికో తృప్తి ఉంది.

గడ్డి మొలకల్ని తమ్ముడు తడుముతూ ఉండగా రాంవుడు దేవర అరుగు మీదికి చేరాడు.

పంటలు బాగా పండితే దేవర అరుగు మీద పూజలే పూజలు.

చిన్నతనంలో తాను అరుగెక్కాలంటే కష్టం, భయం. ఇప్పుడా పరిస్థితి లేదు.

ఆ అరుగు తన తాతముత్తాతల్లో ఎవరో కట్టించారు. తన తండ్రి పుటకలకే అది ఉంది. పైన రావి-వేప కలిసి పుట్టి పెరిగి, నీడనిస్తున్న చెట్ల అరుగు. ఎండ పొడ కూడా పడదు. ఎండకాలంలోనూ చల్లగా ఉంటుంది.

వేపచెట్టు కొమ్మల్లోకి రావిచెట్టు కొమ్మలు చొచ్చుకుపోయాయి. కలగలిసి పెరిగాయి. భార్యాభర్తల అనుబంధం లాగా ఆత్మీయత లాగా అల్లుకుపోయాయి.

కలిసి పెరిగిన రావి, వేప మొదళ్ళు ఇద్దరి రెండు బార్లకు కూడా అందవు. చెట్ల చుట్టూ ఉన్న చప్టా ఆని పెరిగి, బలిసినకొద్దీ పైకి లేచి దిండులాగా మారింది.

వేప, రావి మొగుడూ పెళ్ళాం. దంపతులు పూజిస్తే పిల్లలు కలుగుతారు. స్త్రీలు పూజిస్తే వాళ్ళ మాంగల్యం నిలుస్తుంది.

దేవర అరుగు పక్కన మోటబావి ఉంది. పూర్వం ఉండే మోట గిలక అలాగే ఉంది. మోట మోటు అయింది. మునుపు మోట తోలితే రోజుకు పదెకరాలకు నీరు పారేది. రోజంతా మోట తోలినా బావిలో అంగుళం నీరు తగ్గేది కాదు. నాలుగు నిలువుల లోతు. అందులో ఏమయినా పడితే తీయటానికి గజీతగాళ్ళకు కూడా చేతకాదు.

మోటార్లు, అయిలింజన్లు వచ్చినంతలో మోట వెనుకబడింది. అయినా కానీ మోట బావి గిలక అలాగే ఉండిపోయింది.

మొదట్లో కిరసనాయిలు, ఆపైన డీజిలు వేసి మోటారు నడిపి, నీరు తోడి, పొలానికి పారించినప్పుడు పంటలు బాగా పండాయి. ఇంటికి గింజలుండేవి. పశువులకు గడ్డి, మేత ఉండేవి. చేతిలో లెక్క ఉండేది.

కరెంటు కనెక్షన్లు తమ ఊరికి కూడా ఇస్తున్నప్పుడు మోటార్లు కరెంటుతో నడిచాయి. కరెంటు సరిగ్గా రాకపోతే మోట పనిచేస్తూనే ఉండేది.

చుట్టూ ఉన్న బావులు ఎండిపోయినా, తమ బావి ఎండలేదు.

దరిదాపుల్లో అందరూ బోర్లు వేయించుకోవటంతో దేవర బావిలో నీరు తగ్గిపోయింది.

అయినా మితంగా పంటలు పండించే పరిస్థితి ఉండనే ఉండేది.

ఊరంతా చేసినట్లే తాము కూడా రెండు బోర్లు వేయించేసరికి దేవర బావి పూర్తిగా ఎండిపోయింది.

బావిలోనే బోరు వేయిస్తే మోచేయి అంత ధార. రెండు బోర్లు ఎండినా దేవర బావి బోరు ఎండలేదు. ఇప్పటికీ నీరు ఎంతో కొంత ఇస్తూనే ఉంది.

వానలు పడితే మూడు బోర్లూ నీళ్ళతో తొణికిసలాడతాయి. నాలుగేళ్ళుగా వానలు లేవు. బావి బోరు తప్పా మిగతా బోర్లు ఎండిపోయాయి. తాగునీళ్ళకదే ఆధారం.

నీళ్ళిచ్చే బావి పాలిచ్చే అమ్మ వంటిది.

అమ్మపాలు పొలం తాగటం లేదు. మాది గ్గేరి తాగుతూ ఉంది.

దేవర బావి అరుగున్న చుట్టూ రావి, వేప, మర్రి మొలకలు వచ్చి క్రూరంగా, ఘోరంగా, వికారంగా బావిని మార్చాయి. అన్నీ పుట్టాలి, పెరగాలి, బతకాలి అని రాం వుడు ఆ మొలకల్ని పెరకలేదు. పెరగని చ్చాడు. అవి ఏపుగా పెరిగి బావిని కప్పే శాయి.

వానలు రావటం లేదు. పంటలు పండ టంలేదు. నాలుగేళ్ళ నుంచి ఇదే పరిస్థితి. ఎంతో కొంత పంట ఇచ్చే బోరు నీళ్ళు కూడా ఈ ఏడు ఏ పంటనూ ఇవ్వలేదు.

అరుగుమీద పడుకొన్న రాంవుడు బావినీ, బోరుల్నీ, బోరు కాలవనూ, నీడనున్న లచ్చు వుని, ఎండుతున్న చీనీ చెట్లను, పడిపోయిన బొప్పాయి చెట్లను చూస్తున్నాడు.

బావిలోంచి నీరు రాదు. బోర్లు నీరివ్వవు. మోట తోలినా నీరు లేదు. మోటారు పెట్టి నా నీరు లేదు. కానీ రాంవుడి కళ్ళనిండా నీళ్ళు. చెంపల మీద ధారాపాతంగా నీరు.




తన వ్యక్తిగత జీవితం చాలా సంతృప్తిగా సాగింది. తన బాల్యం కూడా నిన్నా మొన్న టి జీవితంలాగా కనబడసాగింది రాంవుడికి.

తల్లిదండ్రుల ప్రేమలు, వాళ్ళ ఆత్మీయ తలు, చిన్నప్పటి నుంచి తనను పెంచిన తీరు, ముద్దాడిన వైనం, పెంపకంలో మురిపెం, పండగ పబ్బాలలో వంటకాలు, కొత్త బట్టల ఉత్సాహం - అంతా గతమంతా కళ్ళముందు తిరగసాగింది.

తన తండ్రికి తానొక్కడే కొడుకు. తనకు చిన్నాన్నా, పెద్దనాన్న కొదవ లేకుండా చూసేవాళ్ళు. వాళ్ళకు పిల్లలు లేరు. ముగ్గు రు తండ్రులకు, ముగ్గురు తల్లులకు తానొ క్కడే కొడుకు. కొడుకైనా, కూతురైనా తానే!

ఎంత గారాబం, ఎంత ముద్దు ముచ్చట, ఎంత ప్రేమ. పెద్దమ్మ గౌను వేసి, బొట్టు పెట్టి, తలలో పూలు పెట్టడం తనకింకా గుర్తు. ఆడపిల్లలు లేక, ఒక్కడే మగపిల్ల వాడు కావటంతో తల్లిదండ్రుల అన్ని కోర్కె లకు తానే కేంద్రం కాసాగాడు.

ఎంత ప్రేమ చూపినా, అచ్చట ముచ్చట తీర్చుకొన్నా, వాళ్ళు తనను చెడగొట్టలేదు. అన్ని పనులూ నేర్పారు. అందరితో ప్రేమ గా, స్నేహంగా ఉండటం అలవాటు చేశారు. కోపం తెచ్చుకోకుండా ఉండేట్టు చేశారు. ఎవ రిమీద వైరం లేదు. ఎవరితోనూ పేచీలు లేవు.

అందరితో ఆదరణ, అణకువ, ఆత్మీయత, అనురాగం, తగాదాలు లేవు. గొడవలు లేవు. కొట్లాటలు రావు.

రాంవుడికి జాతరంటే పిచ్చి ఉత్సాహం. మెరవణిలో రాత్రంతా తిరిగే ఆనందం. ఊరేగింపుల్లో ఊపిరి సలపని ఉద్వేగం, పెళ్ళిళ్ళలోని ఉరుకులు పరుగులు. ఎంత మంచి కాలం!

తనకు పెళ్ళయినప్పుడు తనకింకా సెడ్డీ కూడా సరిగా వేసుకోడం చేతకాదు. మీసం కూడా మొలవలేదు. పీటల మీద కూర్చోరా అంటే కూర్చున్నాడు. తాళి కట్టమంటే కట్టా డు. ఆ పాపను అంతకుముందు తానెర గడు. ఆయమ్మి అయిదేళ్ళదాకా కాపురానికి రాలేదు. వచ్చిన మూడేళ్లదాకా ఈడేరలేదు.

భార్య అంటే స్నానానికి నీళ్ళు తోడుతుం దని, పొలం వెళుతుంటే చెప్పులు, టవలు ఇస్తుందని, పొలంనుంచి ఇంటికి వస్తే నీళ్ళ చెంబు చేతికిస్తుందని, అన్నం తింటుంటే

విసనగర్రతో విసురుతుందని, పడుకోబోతే మంచం వేసి దుప్పటి పరచి దిండు వేస్తుం దని, అంతకుముందు తనకు తెలియదు.

'ఈమె ఎందుకీ పనులు చేస్తుంది? తన తల్లులు చేయకుండా ఆయమ్మితో ఎందుకు చేయిస్తున్నారా?' అని అర్థమయ్యేది కాదు.

తాను తన పెళ్ళాంతో మాట్లాడిన మాటలు జీవితాంతం నూరుంటే గొప్పే! అవే మాటలు చాలాసార్లు అనటం, వినటం ఉందికానీ, ఎన్నో మాటలు మాట్లాడుకొన్న గుర్తే లేదు.

'నీళ్ళు తోడినా' ,'చెంబు పెట్టినా', 'పీటే సినా'వంటి మాటలు చాలాసార్లు విన్నాడు.

ఆయమ్మికి ఈడేరే నాటికి పన్నెండేళ్ళు. ఇంక శోభనం అన్నారు. కొత్తచీర కట్టారు. పూలు పెట్టారు. పాల గ్లాసు ఇచ్చారు. ముగ్గురమ్మలు తోడి తెచ్చి మిద్దె గదిలో వదిలి వెళ్ళిపోయారు. ఆ రోజు ఆయమ్మి ఏమీ మాట్లాడలేదు.

మంచం చూసింది. 'నిద్దర' అంది. పడు కొంది. నిద్రపోయింది. తెల్లారినా లేవలేదు. మొద్దు నిద్ర. తుమ్మ మొద్దులాగా కదిలితే ఒట్టు.

పూలు నలగలేదని, చీర తొలగలేదని, పాలు తాగలేదని, గుగ్గుళ్ళు తినలేదని, ముగ్గురమ్మలు గుసగుసలాడు కొంటుంటే తనకేమీ సిగ్గయినా కాలేదు.

నిన్నగాక మొన్న కాపురానికి వచ్చిన ఆయమ్మి ఎప్పుడు నలుగురు పిల్లల తల్లి అయిందో, ఎప్పుడు వాళ్ళను పెంచి పెద్ద చేసిందో, ఎప్పుడు పెళ్ళిళ్ళు చేయించిందో, ఎప్పుడు నాయనమ్మయిందో, అమ్మమ్మ యిందో, మనవళ్ళను, మనుమరాళ్లను ఎప్పు డు లాలించిందో అంతా చిత్రంగా ఉంది.

ఒక్కగానొక్క కూతురు పెళ్ళయి అత్తవా రింటికి కాపురానికి పోతుంటే ఆయమ్మి ఏడ్చిన ఏడ్పు తనకింకా గుర్తు. అప్పుడా మెను చూస్తుంటే తనకూ ఏడుపు వచ్చింది.

మొట్టమొదటిసారిగా మనుమడు పుడితే అంత పసివాడికి గోచిపెట్టి, ఊరూ, గేరీ అంతా చూపించి వచ్చింది.

నలుగురు పిల్లల్ని ఆయమ్మి వాళ్ళ పుట్టిం టిలోనే ప్రసవించింది. ఆమెను చూడటానికి పోయిన తాను 'యట్టుంది?' 'బాగుందా?' అని తప్ప మరేం మాట్లాడినట్లు గుర్తులేదు.

పుణ్యాత్మురాలు ఆయమ్మి, ఏ లోకా నుందో, తలనిండా పూలతో పోయింది.

తాను పండు ముసలి అయిందాకా బతికి ఏం బావుకుందామని చూస్తున్నట్లో అంతుబ ట్టలేదు.

ఇంటికి, తోటకి చిన్నప్పుడు చెంగనాలు తీస్తూ వచ్చేవాడు. ఎంత దూరం? ఆ మాత్రం దూరం కూడా ఇవాళ నడవాలంటే కష్టమయింది.

రాcవుడి మీద ప్రేమతో లచ్చువుడు, లచ్చువుడి మీద అనురాగంతో రాcవుడు, తోటకు వచ్చారు. కానీ ఎవరికీ పెద్ద ఆసక్తి లేదు.

రాcవుడు చూస్తున్నంతసేపు గడ్డిని మూతితో తాకుతూ, ముట్టెతో నెడుతున్న లచ్చువుడు నెమ్మదిగా చెట్టు నీడన సేదతీర టానికి మేను వాల్చాడు.

రాcవుడికి తమ పశువులంటే ఎంతో మాలిమి. అన్ని పశువులు తన సంతానంలా అనిపించినా లచ్చువుడు మాత్రం తమ్ముడే అయ్యాడు.

తాను లేకలేక కలిగిన సంతానం కావటం వల్ల, తన తరవాత కూడా ఇంట్లో ముగ్గురు తండ్రులకు మరి పిల్లలు కలగకపోవటం వల్ల, తమ ఇంట్లో పుట్టీ పెరిగే పడ్డలు, లేగలు, దూడలు, కుర్రలు, కోడెలు చాలా ఆత్మీయంగా మారి తమ సంతానంగా పెరి గాయి.

పసులమీదే ప్రేమ. తమ్ముడు లేని లోపం లచ్చువుడు తీర్చాడు. మాట జవదా టేవాడు కాదు. చేయి మీద వేయనిచ్చేవాడు

## అల్లంతో ఆరోగ్యం

ప్రకృతి మనకు సహజసిద్ధంగా అందించిన ఔషధాల్లో అల్లం దివ్యౌషధంగా, సర్వరోగ నివారిణిగా, అనాదికాలంగా ఉపయోగంలో ఉంది. ఆయుర్వేద కాలం నుండి అల్లోపతి వరకూ అల్లాన్ని ఉపయోగిస్తూనే ఉన్నారు. జలుబు, దగ్గు, తలనొప్పి, కడుపు నొప్పి, ఋతుక్రమంలో వచ్చే నొప్పులకు, మలబద్ధకం, అజీర్ణం, ఇంకా జుట్టు రాలకుండా ఉండేందుకు కూడా అల్లం వాడుతుంటారు.

ఎండిన అల్లాన్ని శొంఠి అంటారు. దీని పొడితో చేసిన కషాయాన్ని అజీర్ణం, మలబద్ధకాలకు వాడతారు. అల్లాన్ని పూర్వకాలంలో చైనీయులు, గ్రీకులు ఎక్కువగా ఉపయోగించేవాళ్ళు. సముద్ర యానంలో భయాన్ని పోగొట్టుకునేందుకు అల్లం నోట్లో ఉంచుకుని చైనీయులు ప్రయాణం చేస్తే, గ్రీకులు ఉదర సంబంధ వ్యాధుల నివారణకు రొట్టెల మధ్య అల్లాన్ని ఉంచుకుని ఆరగించేవారు.



అల్లం టీ అందించే ఆహ్లాదం, ఆనందం మనందరికీ సుపరిచితమే. పోతే ఇటీవల యూనివర్సిటీ ఆఫ్ మిచ్‌గాన్ పరిశోధకులు క్యాన్సర్ రోగులకు కీమో థెరఫీ, రేడియో థెరపీల అనంతరం కలిగే వికారం, తలతిప్పటం, వాంతులు మొదలయిన వాటికి అల్లంలో ఉండే జింజిరాల్ అను యాంటీ ఆక్సిడెంట్ నివారిణిగా ఉపయోగిస్తుందని కనుగొన్నారు.

కాదు. ప్రేమతో నిమరనిచ్చేవాడు. కోపం తెప్పించేవాడు కాదు.

అన్నతో పాటు అరణ్యవాసంలో అన్నేళ్ళున్న ఆ లక్ష్మణుడికిక ఈ లచ్చువుడు ఏమీ తీసిపోడు.

అన్న చెప్పిన మాట వినటంలో, చెప్పిన పని చేయటంలో, చెప్పకపోయినా, ఇష్టమైన పని చేయటంలో లక్ష్మణులిద్దరూ గొప్పవాళ్ళే!

ఆ లక్ష్మణుడు మా మంచి మనిషి, పిచ్చి మారాజు. రాజకుమారుడు, పుణ్యాత్ముడు. భగవంతుడి తమ్ముడు.

తన లచ్చువుడు తనకే తమ్ముడు. తల్లిదండ్రులు అక్కరలేదు. బంధుమిత్రులు అక్కరలేదు. అన్నీ లచ్చువుడికి తానే!

అన్నీ ఉన్న ఆ లచ్చువుడి ప్రేమకు, ఏమీ లేని ఈ లచ్చువుని ప్రేమకు, సోదర ప్రేమకు, అన్న పట్ల ఆత్మీయతకు, అనురాగానికి ఎంతో తేడా ఉంది.

గొప్ప ప్రేమ, భక్తి, సేవ. వీడు నా బంగారు లచ్చువుడు.

లచ్చువుడి తల్లి ఏడీతల మాలచ్చిమి. ఏడు కోడెదూడల్ని కంది. మగ మారాజుల్ని కన్న మాలచ్చిమి. కడివెడు పాలిచ్చింది. కళ్ళారా కొడుకుల్ని పెంచుకుంది. తన తల్లిదండ్రుల వ్యవసాయానికి తోడు పడింది.

ఆ చక్కని తల్లికి పుట్టిన తెలివిగలవాడు లచ్చువుడు. మనుషులకు లేని తెలివి ఉంది. ఆలకింపు ఉంది. ఆచరింపు ఉంది. సూక్ష్మ బుద్ధి ఉంది. సులువు సూత్రం తెలిసి అన్నతో మెలిగే అద్భుత గుణం ఉంది.

తల్లికున్న మంచి లక్షణాలు అన్నీ లచ్చువుడికి వచ్చాయి. పైగా మనుషుల్లో మనిషిగా మెలిగేవాడు.

మాలచ్చిమి శరీరం రంగు బంగారం. తెలుపు కాదు, ఎరుపు కాదు. పసుపు

కుంకాల రంగు.

మాదిగల ఆవు అని తెలిసి కూడా పూజారి దాన్ని గుళ్ళోకి తోలుకుపోయేవాడు. అందరూ పూజారికి మొక్కుతుంటే పూజారి దానికి పూజలు చేసేవాడు. పుణ్యకార్యాలకు తీసుకుపోయేవాడు. గృహప్రవేశాలకు పూజారితో వెళ్ళేది. తాము పోలేక పోతేనేం? తమ ఆవు గుళ్ళోకి పోయి వచ్చేది.

పూజారి దాన్ని 'కపిలగోవు' అని పిలిచేవాడు. దానికున్న సుడులు, ముడులు ఏవేవో చెప్పేవాడు. దాన్ని మాలచ్చిమి అని పిలిచేది పూజారే.

అయితే అది సూడిది. లేకపోతే పాడిది. పాలిస్తున్నా చూలు వచ్చేది. చూలాలు అయినా పాలిచ్చేది.

నిండు నెలల మాలచ్చిమిని తాను తోలుకు వచ్చి తోటలో వదిలాడు. ఇదే అరుగుమీద సరిగ్గా ఇక్కడే పడుకొన్నాడు. ఇదే వేళకు నిద్ర వచ్చింది. చూస్తుండగానే నిద్ర ముంచుకవచ్చింది.

ఆ రోజు మాలచ్చిమిని చూస్తూ నిద్రపోయాడు. ఈరోజు లచ్చువుని చూస్తుంటే నిద్రవస్తూ ఉంది.

పొద్దు ఏటవాలుగా వంగినప్పుడు ఆవు ఇటు తిరిగి తనను లేపింది. ముట్టెతో నెట్టి మూతితో నాకింది. మెలకువ వచ్చి చూస్తే దాని కడుపులో మాయపడుతూ ఉంది. పక్కగా చూస్తే దూడ. కోడె దూడ. అది కాళ్ళమీద నిలబడటానికి అవస్థ పడుతూ ఉంది. స్నానం చేయించినట్లు దాని వళ్ళంతా ఆవు నాకింది.

తాను లేచి కూర్చునేసరికి మాలచ్చిమి పోయి మళ్ళీ కొడుకు వేపు తిరిగి లచ్చువుడిని నాకుతూ ఉంది. 'చూడు నా కొడుకు' అన్నట్లు చూసింది. దాని మాయ తాను చూస్తుండగానే పడిపోయింది. లచ్చువుడి పేగు ముడివేసి, గిట్టలు గిల్లి, తోక సవరించి, ముట్టె తుడిచి ముఖంలోకి చూస్తే గిసుక్కున నవ్వాడు. నవ్వు వెలుగురేఖలా అలా సాగిపోయింది.

కపిలగోవు మాలచ్చిమి 'పాలు తాగూ' అంది కొడుకుతో. లచ్చువుడు తాగటానికి నానా అవస్థలు పడుతుంటే తాను సహాయం చేశాడు.

ఆవు ముర్రపాలు పిండినాడు. దూడను చేతుల్లో పెట్టుకొని పొదుగుమీద దాని మూతి ఆనించాడు. దూడ నోరు తెరిచింది. ఆవు పొదుగునిండా పాలు నింపింది. దూడ నోరు మెదపటం ఎప్పుడు నేర్చుకొంది? నోరు కదిపింది. పాలు వచ్చాయి. దూడ పాలు మూతికి రాసుకొంది, నోరు తెరిచింది. పాలు గొంతులోకి పోయాయి. గుటకవేసింది. అంతే ఇంక ఆపితే ఒట్టు. ఇది తాగుతూనే ఉంది. అది చేపుతూనే ఉంది. దూడ ఆకలయినా అరిచేది. ఆవు చేపులు వచ్చినా అరిచేది. ఈ అరుపుల భాష ఆవుదూడలకిట్టే అర్థమయిపోయేది.

దూడ ఒకచోట పాలు తాగుతుంటే మూడుచోట్ల పాలు కారిపోసాగాయి. దూడ తిన్నగా తాక్క పొదుగు కుమ్మేది. ఆవు ఆదమరచిపోయేది. ఆవు ఇచ్చే పాలన్నీ తాగలేక సొమ్మసిల్లి పోయే దూడ అమ్మ కాళ్ళ దగ్గరే పడి నిద్రపోయేది. మిగులు పాలు అమ్మలు కడవల్లోకి పిండేవాళ్ళు.

దూడ ఆరోజు నడవలేక పడుతూ, లేస్తూ ఉంటే తాను ఎత్తుకొని వళ్ళో కూర్చోబెట్టుకొని లచ్చువుడి తల నిమురుతుంటే, తల్లి తన వళ్ళంతా తడుముతూ ఉంది.

నేల తవ్వి, మాయ పూడ్చి దూడను ఎత్తుకొంటే ఇంటికి పోవాలని ఆవుకు తెలిసింది.

దూడను మెడమీద పెట్టుకొని వీపు పట్టుకొని నడుస్తుంటే మాలచ్చిమి నడవలేదు. కొడుకును అట్లా ఎత్తుకోవద్దని చెప్పింది. దించి రెండు చేతుల్లో గుండెల మీద పెట్టుకొంటే ఒప్పుకొంది. నడక సాగించింది.

లచ్చుపుడితో వాడి బాల్యంలో తన ఆట అంతా వాణ్ణి తాను, తన మెడమీద కూర్చో బెట్టుకోవటం, వాడు విడిపించుకొని దూకి చెంగనాలు తీయటం, తను వెంటబడటం, వాడు దొరకకుండా పారిపోవటం. ఎప్పుడైనా తానా ఆట ఆడకపోతే వాడే వచ్చి భుజం మీద కూర్చుని ఎగిరి దూకి చెంగనాలు తీస్తుండేవాడు. ఇక తాను లేచి వాడి వెంటబడి పట్టుకోవాలి. పట్టుకోకూడదు. పరుగులు తీయనీయాలి. అలసిపోయిన తరువాత చేతికి చిక్కుతాడు. వంటికి రాసుకొంటూ నిలబడి రొప్పుతాడు.

మాలచ్చిమి తనను ఎంతగానో నమ్మింది. ఏ ఆవు అయినా దూడ ఎటుపోతే, దూడను తీసుకుపోతున్న మనిషి ఎటుపోతే అటు పోతుంది. కాని మాలచ్చిమి మాత్రం ఇంటి తోవ పట్టింది. దాని వెనుక తాను దూడతో నడచి ఇంటికి వచ్చాడు.

తాము ఇంటికి రాగానే ఇంటిల్లిపాదీ వచ్చి ఆవునూ, దూడనూ చూచి చాలా ముచ్చటపడిపోయారు. దానికి తగిన సపర్యలు, పరిచర్యలు చేయసాగారు.

రాంవుడు చేతులమీంచి దూడను దించగానే అది పడుతూ లేస్తూ అడుగులు వేయసాగాడు. మాలచ్చిమి ఏమీ ఆదుర్దా చూపలేదు. 'మీ కోడెదూడను మీకిచ్చాను. మా యోగక్షేమాలిక మీవే! చూసుకోండి' అన్నట్లుగా ఉంది. వాళ్ళు దూడను ప్రేమతో పెంచుకొంటారని దానికి విశ్వాసం.

పడుతూ లేస్తూ వచ్చిన దూడ, తల్లి పొదుగు పుడుకుతుంటే తల్లులూ, పిల్లలూ ఎంతో ముచ్చటపడిపోయారు.

దూడను తల్లి వదిలి ఉండేదికాదు. దూడ తనను వదిలి తిరగటం ఉండేది. కోడెదూడకు రాంవుడు తానే తల్లి, తండ్రి, స్నేహితుడు, హితుడు, గురువు, దైవం.

ఆ బాల లచ్చుపుడు నేటికి వృద్ధ లచ్చుపుడై, పుట్టినపుడు ఎలా పడి ఉన్నాడో ఇప్పుడూ కదలల్లేక అలాగే పడుకొని ఉన్నాడు.

దూడకు తాను ప్రాణదాత. లచ్చుపుడు తనకు ప్రాణమిత్రుడు. తనతో సహకర్షకుడు. తనకు తోడు కావటానికి పుట్టిన తమ్ముడు. కష్టమొస్తే ఆదుకొనే ఆప్తుడు. ఆపద వస్తే కాపాడే దేవుడు.

ఒకరికొకరు అన్నీ తాము అయిన రాంవు లచ్చుపులు వృద్ధాప్యంలో ఎవరికెవరు?



ముష్టూరు అడ్డ రోడ్డు కాడ రెండు సర్కారు గడ్డి లారీలు వచ్చి ఆగాయి. పెద్దోబులేసు, నడిపోబులేసు, సన్నోబులేసు ఉన్న యువకుల గుంపును తోవ అడిగారు వాళ్ళు. మేం మీ కోసమే ఉన్నామని వాళ్ళు చెప్పారు. అందరూ రెండు లారీలు ఎక్కారు.

వాళ్ళకిప్పుడు చాలా సంతోషంగా ఉంది. ఈ లారీలు పెన్నోబులంలో అటకాయించే వాళ్ళను తప్పించుకొని వచ్చాయని పరమానందపడుతున్నారు.

అందుకే డ్రయివర్లను, క్లీనర్లను అడిగారు. 'రెండు లారీలలో మిమ్మల్నెవరు అడ్డుకోలేదా? ఎవరూ లారీలను తగలబెట్టబోలేదా? ఎవరూ మీ లారీలు ఇటుపోవాలని తోవ తప్పించబోలేదా? మీరు మా ఊరు రాకుండా గడ్డి వేరే ఊరు చేర్చే ప్రయత్నం చేయలేదా? మా మాట వినకపోతే చంపుతామని బెదిరించలేదా? మా మాట వింటే మీకు కొంత లెక్క ముట్ట చెబుతామని ఆశ చూపలేదా?' అని ఎన్నో ప్రశ్నలు వేశారు. అటువంటిదేమీ లేదని చెబితే వాళ్ళు ఆశ్చర్య

పోయారు. ఆనందించారు. ఊరి యువకుల మీద అభిమానం పెంచుకొన్నారు. అనవసరంగా పుకార్లు నమ్మామని బాధ పడ్డారు. అపార్థం చేసుకొన్నామని చింత పడ్డారు. ఘర్షణలు జరుగుతాయని బాధ పడ్డవాళ్ళు అంతా సులభంగా మారినందుకు, గడ్డి క్షేమంగా చేరినందుకు చిక్కు దీసినట్లయి, చింతలు మాని, సంతోషంగా ఉన్నారు.

రెండు లారీలలో ఒకటి ఊరికి, మరొకటి గేరికి చేరాయి. సర్పంచి కాగితాల మీద సంతకాలు చేశాడు. లారీల గడ్డి మీరు దించుకోవచ్చునని అనుమతి వచ్చింది. డ్రైవర్లు, క్లీనర్లు దిగి ఎవరి లారీ దగ్గర వాళ్ళు నీడన నీళ్ళు తాగుతూ కూర్చున్నారు.

లారీ రావుడి మిద్దె ముందు ఆగింది. రావుడి కొడుకులు, బంధుమిత్రులు లారీ మీదికి ఎక్కారు. తాళ్ళు విప్పారు. గడ్డి మోపులు కిందికి అందించారు. నేలమీద పరిచి ఉన్న బండల మీద గడ్డి మోపులు పేరుస్తున్నారు. పెద్ద ఓబులేసు-పెద్దాయప్ప-పెద్దోడు. వాములు వేయటంలో సులువు సూత్రాలు తెలిసినవాడు.

నడిపోడు, సన్నోడు లారీమీద ఉన్నారు. వాళ్ళు మోపులు మోపులుగా ఉన్న గడ్డి కట్టు విప్పకుండా, విడిపోకుండా కిందికి అందిస్తున్నారు. తమ వాళ్ళు గడ్డి కట్టల్ని వామి దగ్గరకు చేరుస్తున్నారు.

గడ్డి దించటం, వామి వేయటం రెండు పనులుగా చేయటం లేదు. ఒకే పనిగానే చేస్తున్నారు. ఇటు దించుతుంటే అటు వామి అవుతూ ఉంది. అనంతపురంలో హమాలీలు ఇటు వేగన్ అన్‌లోడ్ చేయటం, అటు లారీ లోడ్ చేయటం ఒకేసారి చేసినట్లు, వీళ్ళూ రెండు పనులు ఒకేసారి ముగిస్తూ ఉన్నారు.

చూస్తుండగానే లారీ ఖాళీ అయింది. వామి వేయటం అయిపోయింది.

నడిపోడు లెక్క తెచ్చి పెద్దోడి చేతిలో పెట్టాడు. ముగ్గురూ వెళ్ళి సర్పంచి ఇంటిలో గడ్డి లెక్క జమచేసి వచ్చారు.

లారీ డ్రైవరుకు, క్లీనరుకు బీడి డబ్బులు ఇవ్వాలంటే రాఁవుడుండాలి. రాఁవుడు తోటకు పోయాడని ఆడవాళ్ళు చెప్పారు. లచ్చువుడిని కూడా తోలుకుపోయాడని చెబితే పెద్దోడు గతుక్కుమన్నాడు.

మేం పోతామంటూ డ్రైవరుక్లీనరు తొందర చేస్తున్నారు. తాను చేసిన పని తండ్రికి తరువాత సర్ది చెప్పవచ్చులే అని ఇంట్లోకి పోయి దుడ్డు- చిల్లర తెచ్చి వాళ్ళకిచ్చాడు పెద్దోడు. ఇచ్చేముందు ఎంత ఇంట్లోంచి తెచ్చాడో, ఎంత వాళ్ళకు ఇవ్వవచ్చో తమ్ముళ్ళిద్దరకూ చెప్పి, వాళ్ళు ఒప్పుకొన్న తరువాత సొదరకు చిల్లర ఇచ్చాడు. వాళ్ళు సంతోషంగా వెళ్ళిపోయారు. లారీ తుర్రుబుర్రులాడి జారుకుంది. పిల్లలు దానివెంట అందినంత దూరం పరుగెత్తి, ఊరి వెలుపలిదాకా సాగనంపి తిరిగి వచ్చారు.

అన్నదమ్ములకు ఆనందంగా ఉంటే గేరి వాళ్ళు అదో విజయంగా, గెలుపుగా, ఉత్సాహంగా ఉన్నారు.

తమ గడ్డికి కానీ, తెచ్చే లారీకి కానీ ఏ ఆపదా, ఏ కీడూ, ఏ ద్రోహమూ జరగనందుకు వాళ్ళు చాలా సంతోషంగా ఉన్నారు.

రెండు లారీలలో ఏది గేరి లారీనో, ఏది ఊరి లారీనో తెలియక దేన్నేమీ చేయక వదిలారేమో అని ఒకరంటే, అటువంటి మాటలు మాట్లాడి మన ఊరివారి మంచిని అపార్థం చేసుకోవద్దని మరొకరు హెచ్చరించారు.

అన్యాయం చేయలేక కాక మంచి బుద్ధి వల్ల ద్రోహం తలపెట్టి ఉండకపోతే వాళ్ళు ధర్మాత్ములే! పుణ్యాత్ములే! చేతులెత్తి మొక్కవలసిందే!

సన్నోడికి ఒక సందేహం. ఏ రాత్రో, అపరాత్రో వామికి నిప్పు పెడితే ఏం చేయాలి?

ఆలోచించసాగాడు.

## దంతారోగ్యం...

తల్లులు ఎంత ఆనందంగా, ఆరోగ్యంగా ఉంటే, పుట్టబోయే పిల్లలు అంతే ఆరోగ్యంగా పుడతారంటారు. గర్భవతులైన ఆడవాళ్ళు ఆరోగ్యం, ఆహార్యాల విషయాల్లో చూపించే శ్రద్ధతోబాటు, దంతవ్యాధులు, రాకుండా కూడా జాగ్రత్త వహించాలి.

ఈ విషయంపై కెనడాకు చెందిన డాక్టర్ మర్జోరి కె. జెఫ్‌కాట్ బృందం విస్తృతంగా పరిశోధనలు జరిపి 'గర్భవతులయిన స్త్రీలకి దంతవ్యాధులు, చిగుళ్ళ వ్యాధులు, రక్తస్రావం, చిగుళ్ళ వాపులు వంటి సమస్యల వల్ల నెలలు నిండకముందే ప్రసవం అయ్యే ప్రమాదం ఉంటుంద'ని చెబుతున్నారు. దంతవ్యాధులు, చిగుళ్ళ వ్యాధులవల్ల నోటిలో నిలువ ఉండే బ్యాక్టీరియా రక్తప్రసరణంలో కలిసిపోయి కడుపులో ఉన్న బిడ్డ పరిపూర్ణంగా ఎదగకముందే ప్రసవం అవటమే కాక, బిడ్డ మరణించే ప్రమాదమూ ఉంటుందట. అందుకే గర్భం ధరించబోయే వాళ్ళు, ధరించిన వాళ్ళూ యాంటినేటల్ చెకప్‌తోబాటు, దంత వైద్యునితో విధిగా పళ్ళు, చిగుళ్ళు పరీక్ష చేయించుకోవాలి.

ప్రతిరోజూ రెండు పూటలా దంత ధావనం చేసుకుంటూ తరచూ వైద్యునితో శుభ్రం చేయించుకోవటం వల్ల పైన తెలిపిన ప్రమాదాలనుంచి బయటపడి నెలలు నిండిన పండంటి బిడ్డని ప్రసవించవచ్చు మరి!



ఆ మాట బయటికి అనరాదు. అంటే అలా చేయమని వాళ్ళకు చెప్పినట్లు కావచ్చు.

మాటాడకుండా ఉంటే, వాళ్ళలో ఎవరికైనా చెడు తలంపు రాకుండా పోతుందని నమ్మకం ఏమీ లేదు.

ఘర్షణ లేకుండా గడ్డి వచ్చి ఉంటే ఏ సందేహాలకు తావు లేదు.

గొడవ జరిగి గడ్డి వచ్చింది కాబట్టి భయం న్యాయమే.

పోయినేడు ఇంతకంటే పేచీలు వచ్చే తమ ఇంటికి చేరిన గడ్డికి ఏమీ ముప్పు వాటిల్ల లేదు.

ఇప్పుడట్లా ఉంటే మంచిదే! ఉండకపోతే! జాగ్రత్త పడవలసిందే!

ఎండాకాలం కాబట్టి, ఆరు బయటే పడుకోబోతారు కాబట్టి, ఆ పడుకొనేదేదో వామి దగ్గరే పడుకొంటే సరిపోతుందని సన్నోడు తనకు తానే సర్ది చెప్పుకొన్నాడు.

కానీ పడుకొన్నా ప్రమాదం తలపెడితే ఎట్లా? తాము నిద్రలో ఉండగా అన్యాయం జరిగితే ఎట్లా? ఊరికే ఉండాలా? ఉండకూడదా? ఉండక ఏం చేయాలి? వాళ్ళేం చేశారో తానూ అదే చేయాలా? తమది ఒకటే వామి, వాళ్ళవి చాలా. చాలా వాముల్ని రక్షించుకోవటానికి ఒక్క వామి జోలికి వాళ్ళు రాకపోవచ్చు రాకపోతే మంచిదే! వస్తే? వచ్చినప్పటి మాట చూసుకోవచ్చు!

ఎవరూ ఏమీ చేయకపోతే అందరికీ క్షేమమే.

క్షేమమో, క్షామమో అందరికీ సమానంగా ఉంటే మంచిది.

క్షేమమే ఉంటే అదే మహాభాగ్యం.

బంధుమిత్రులు ఒక్కొక్కరు వెళ్ళిపోగా అన్నదమ్ములు పశువుల్ని తేరిపార జూశారు.

లారీ గడ్డి దించుకొని తాము వామి వేసు

కొంటున్నప్పుడు కిందపడ్డ గడ్డిని ఒక్క పరక కూడా గాలికి కొట్టుకుపోకుండా ఆడవాళ్ళు పోగుచేసి పనలు పనలుగా పట్టుకుపోయి పశువులకు వేశారు.

నిన్నటి నుంచి ఒక్క గడ్డిపరక కూడా కొరకని పశువులు, ఆవులు, ఎద్లు, ఎనుంగొడ్లు, దున్నపోతులు, పడ్డలు, దూడలు, కోడెలు సంతోషంతో ఎగిరి గంతులేస్తూ, గడ్డి మేస్తూ ఉండవలసింది. మేయటం లేదు.

తోటకు పోయిన రాంవుడు లచ్చువుడు రాలేదు. పెద్దోడి గుండెల్లో రాయి పడింది.



అన్న పిలిచినట్లుగా, పోతుపోతూ లేపినట్లుగా, వీపుమీద ముద్దుగా తాకినట్లుగా అనిపించి లచ్చువుడు లేచి, చుట్టూ చూసి, తోక అల్లాడించాడు. బూసి లచ్చువుడి తోకను ముంగాళ్ళతో గోకుతూ ఉంది.

ఎన్నడూ లేనిది ఎవరో కర్రతో కొట్టినట్లు, గడారుతో పొడిచినట్లు, పికాసితో యేటు యేసినట్లు అనిపించింది. లచ్చువుడు చుట్టూ చూశాడు. ఎవరూ లేరు. కుక్క లచ్చువుడి తోక పీకుతూ ఉంది.

అన్న తనను నిద్ర లేపాడనుకొన్నాడు లచ్చువుడు. అన్న కాదనిపించి బూసిని చూసి తమ్ముడు ఆశ్చర్యపోయాడు. రాంవుని కోసం పడుకొనే, చుట్టూ, మోరెత్తి చూశాడు లచ్చువుడు. మోట బావి ఒడ్డున, మోటారు మిషను పక్కన, చెట్టు నీడన, నీరు పారే కాలవ దిగువన కనిపించని అన్న, రావి వేప దంపతుల చల్లని నీడలో అరుగుమీద ఆదమరచి నిద్రపోతున్నాడు. అన్న అంతగా నిద్రపోడు! అంతసేపు నిద్రపోడు. తాను లేచిన అలికిడి అయితే అన్న లేచి కూర్చుంటాడు. లేవలేదు. ఏమైంది?

ఓపిక లేకపోయినా, తోక ఊపుతూ బలం తెచ్చుకొని, ముంగాళ్ళ మీదికి పొర్లి, వెనక్కాళ్ళు జతచేసుకొని, పూనుకొని, ముక్కి, మూలిగి లేచి నిలబడ్డాడు లచ్చువుడు.

చీమ చిట్టుక్కుమంటే రాంవుడు మేల్కొంటాడు. ఆకల్లాడితే లేచి కూర్చుంటాడు. అట్టాటిది రాంవుడు కట్టెలా పడి ఉన్నాడు. బూసి 'కుయ్ కుయ్' మంటూ ఉంది.

నడవలేని లచ్చువుడు అంత విశాలమయిన ఎముకల గూడును కూడగట్టుకొని తడబడుతూ తప్పటడుగులు వేస్తూ మోట బావి చుట్టూ తిరిగి, రావి వేప దాంపత్య బంధమున్న అరుగు కాడికి చేరి కూలబడ్డాడు. 'సరేనా?' అన్నట్లు బూసిని చూశాడు. బూసి తల ఊపింది.

అక్కడే తాను తల్లి కడుపులోంచి జారి నేలమీదికి వచ్చాడు. కూలబడ్డ లచ్చువుడికి బాల్యం గుర్తుకు వచ్చిందా అన్నట్లుగా చుట్టూ చూశాడు.

ఏమో అర్థమయినట్లు అప్పుడే పుట్టిన కోడె దూడలాగా లేవబోయాడు, పడిపోయాడు. పడి లేచి నిలబడ్డాడు. అరుగుమీద అన్న అడుగు వేయబోతే కాలు తడబడుతూ ఉంది. బూసి అన్నదమ్ముల మధ్య ఆసులో కండెలాగా అటూ ఇటూ తిరుగుతూ ఉంది.

అన్న దగ్గరకు పోవాలి. ఆ రోజు అన్న వచ్చి అమ్మలాగా, మంత్రసానిలాగా అన్ని సపర్యలు చేశాడు.

ఈరోజు అన్న రావటం లేదు. లేవటం లేదు. అన్న దగ్గరకు పోవాలి.

అరుగు ఒక్క మెట్టు ఎత్తే ఉంది. ఆ మెట్టు ఎక్కలేక లచ్చువుడు 'అన్నా' అన్నాడు. 'అమ్మా' అనో, 'అంబా' అనో విన పడనూ వచ్చు బలహీనంగానే అయినా

సన్నగా, పీలగా, ఈలగా, గాలి వదిలినట్లు లచ్చువుడు రంకె వేశాడు.

అన్న లేవలేదు.

మెట్టు మీద లచ్చువుడు కుడికాలు పెట్టాడు. ఓపికగా ఎడం కాలు పెట్టాడు. లేచి ముందకు పోబోయాడు. తూలాడు. కూలబడ్డాడు.

కూలబడ్డ అరుగు మీదే ముందుకు దేకాడు. వెనక్కాళ్ళు కూడా అరుగు మీదకి వచ్చాయి.

అన్నను చూస్తుంటే లచ్చువుడికి భయం కలిగింది. మెల్లగా నిలబడి, సమీపానికి చేరి, ముఖంలో ముఖం పెట్టి సన్నగా బుస కొట్టినాడు.

అన్న 'యారా లచ్చువా' అనలేదు.

అన్న లేవలేదు.

లచ్చువుడికి అనుమానం వచ్చింది. అన్న! ముసలి అన్న! ముసలి ప్రాణం! తనంటే ప్రాణం. తనకు పసిరిక తినిపించాలని తాపత్రయంతో తోలుకు వచ్చాడు.

అలసట! ఎండ! తన పట్ల ప్రేమ! తన కోసం శ్రమ!ఇంత ఎండలో, ఈ వయస్సులో అన్న తనను తోటకు తోలుకొని వచ్చాడు.

లచ్చువుడు అన్న చుట్టూ తిరిగాడు. ముట్టెతో కదిపాడు. కొమ్ముతో నెమ్మదిగా, సున్నితంగా, సుతారంగా, నొప్పి కలగకుండా కుదిపాడు, కదిపాడు.

అన్న 'యారా తమ్ముడా!' అనలేదు.

లచ్చువుడికి కనురెప్పలార్పకుండా అదేపనిగా అన్న ముఖం, అమ్మవంటి అన్న ముఖం, ప్రేమ వంటి అన్న ముఖం, అనురాగం వంటి అన్న ముఖం, కన్నీళ్ళతో కలిసిన చూపును ప్రసరించి చూశాడు.

అర్థమయింది. అంతా అర్థమయింది. కన్నీళ్ళు కళ్ళలో నిలవకుండా కారిపోయాయి. లచ్చువుడు కూలబడ్డాడు. అన్న పక్కనే ఒరిగాడు. కాళ్ళు బారజాపాడు. మెల్లగా మెడ జరుపుతూ కదిలి అన్నను

## ఇప్పుడు కాదు...

ఒక పల్లెటూళ్లో షూటింగ్ జరుగుతుంటే చూడడానికి జనం విరగబడి వచ్చారు. నటీనటులను చూసి ఉత్సాహంగా 'అడుగో ఎన్టీఆర్..', 'అడుగో గుమ్మడి..', 'అడుగడుగో జగ్గయ్య..' అంటూ అరుస్తున్నారు. ఒక పెద్దాయన 'అడుగో వంగర' అన్నాడు. పక్కవాళ్లు 'కాదు, అతను మరెవరో' అన్నారు.

సందేహం తీర్చుకోవడానికి ఆయన నేరుగా వంగర వద్దకే వచ్చి 'అయ్యా.. తమరు వంగరా? ' అని అడిగాడు.

'ఎందుకు వంగను? మీ అంత పెద్దయ్యాక నేనూ వంగుతా' అంటూ జవాబిచ్చారు వంగర. అడిగినాయనతో సహా అక్కడున్న వారంతా నవ్వారు.

ఆనుకొన్నాడు.

ఆ స్థితిలో అన్నను అలా చూడలేకపోయిన లచ్చువుడు తన మెడను రాంవుడి తల కిందగా పోనిచ్చి దిండులాగా అమర్చాడు. రాంవుడి మెడ, లచ్చువుడి మెడ మీద ఉంది. అన్న వీపుకు తన వీపు తగులుతూ ఉంది. ఎంత సుఖంగా ఉందో!

లచ్చువుడికి ఎంతో తృప్తిగా ఉంది. ఆనందంగా ఉంది. ఉత్సాహంగా హుషారుగా ఉంది.

ఈ పరిస్థితిలో రాంవుడిని ఇలా పడుకోనిచ్చి ఉండనిచ్చేవాడు కాదు లచ్చువుడు. తనకు ఓపిక లేదు. తానే కదల్లేడు.

ఓపిక ఉంటే అన్నను వీపు మీదనే వేసుకొని ఇంటికి తీసుకొనిపోయి ఉండేవాడే! కానీ నీరసంగా ఉంది. కదిలే బలం లేదు. కళ్ళు తేలిపోతున్నాయి. కాళ్ళాడటం లేదు. మనస్సు ఉద్వేగంగా ఉన్నా శరీరం మాట వినటం లేదు. కలసిరావటం లేదు. కన్నీరు కారిపోతూ ఉంది.

అన్న అనురాగం, ఆత్మీయత, అనుబంధం అందరికీ లభించవు. తాను అదృష్టవంతుడు. తన అదృష్టమంతా అన్నతోనే! కళ్ళు తేలిపోతున్నాయి. కన్నీరు ఆగిపోయింది.

కాలచక్రం తీరే అంత! ఉదయం పొద్దు పొడుస్తుంది. సాయంత్రం కుంకుతుంది. మధ్యలో ఎండల ప్రతాపం. మధ్యలో వెలుతురు. మధ్యలో చూపు. మధ్యలో కిరణాలు. ప్రాణికోటి భోజనం.

మబ్బులడ్డమైతే సూర్యుడు కనిపించడు. వాన కురిస్తే సూర్యుడు కనబడడు. మంచు తెరలొస్తే, పొగమంచు కమ్మితే సూర్యుడు చూపుకందడు. కానీ లేకుండా పోడు.

పొద్దు పొడవకముందు రానిది, పొద్దు గుంకినాక పోకుండా ఉండలేనిది, ఉన్నంత సేపు ఎంత హడావుడి! ఎంత ఎండ! ఎంత వేడిమి! ఎంత పంట! ఎన్ని ప్రాణులకి ఎంత ప్రయోజనం! ఎంత పరమానందం! ఎంత అందం! ఈ అందం, ఆనందం, దానం, ధర్మం, పంట, ప్రయోజనం ఏమవుతాయి?

బూసి తోట నుంచి ఇంటికి పరుగు తీసింది. అన్నదమ్ములు ఎదురైతే తిరిగి తోటకు పరుగుతీసింది. రావలచ్చువులు, అన్నదమ్ములు నిద్రపోతుండటం పెద్దాయప్ప, నడిపాయప్ప, సన్నాయప్ప చూసి ఆవురుమన్నారు.



గేరివాళ్ళు, ఊరివాళ్ళు చూసి కన్నీరు కార్చారు. అన్నదమ్ముల్ని అట్లా చూసి ఏడవని వాళ్ళు లేరు. వాళ్ళ అనుబంధం అది.

రాంవుని మెడ లచ్చువుని మెడ నుంచి వేరుచేయటం ఎవరికీ సాధ్యపడలేదు. ఎవరికీ చేతులాడలేదు.

ఎన్నేళ్ళ బంధం?

ఎంత అనుబంధం?

పెద్దోబులేసు తండ్రిని లేపి, భుజాన వేసుకొన్నాడు. సిన్నోబులేసు కాళ్ళు పట్టుకొన్నాడు. నడిపోబులేసు తల పట్టుకున్నాడు. ముగ్గురూ తండ్రిని టైరు బండిలో ఆకులు పరిచిన జల్లలో పడుకోబెట్టారు. గేరిలో నుంచి తోటలోకి వచ్చిన వాళ్ళు తోడ్పడ్డారు.

మరో టైరుబండి పోలు పైకెత్తి, తోపిడిసి, అరుగు దగ్గరకు జరిపి, లచ్చువుని నలుగురు కలిసి బండిలోకి లాగారు.

సూర్యుడు అస్తమించాడు. మసక చీకటి కమ్ముకుంది. సన్న వెలుతురు నల్లబడుతూ ఉంది. పడమటి కాంతి జారిపోయింది. రెండు బళ్ళూ బయలుదేరాయి. వెలుతుర్ను పొలంలో వదిలి, చీకటిని మోసుకొని, బళ్ళు గ్రామంవైపు సాగాయి.

జరిగిందేమిటో ఊరికీ, గేరికే కాదు



చిన్నాచితకా, పిల్లాజెల్లా అందరికీ అర్థమయి పోయింది. అంతకాక! టైరుబళ్ల ఎడ్లు ఎందు కేడుస్తాయి? వాటి కన్నీరు ఆగటంలేదు.

మిద్దె ముంగిట శుభ్రంగా ఊడ్చి నీళ్ళు జల్లి మంచమేసి దిండూ, దుప్పటి వేసి అన్నను, గడ్డి పరిచి గొంగడి వేసి తమ్ముణ్ణి పడుకోబెట్టారు.

రాంవలచ్చువులు నేల తల్లి పిల్లలు. వాళ్ళ కాయకష్టం, భూమి తల్లి అనురాగం ఇంత కాలం ఆ ఇంటినీ, మనుషుల్నీ, పశువుల్నీ కాపాడాయి. ఇప్పుడు ఎవరికెవరు?

రాంవుని కోడళ్ళు, పిల్లలు, బంధువులు, గేరివాళ్ళు అందరూ ఒకటే ఏడుపు. ఊరి వాళ్ళు కూడా కన్నీరు పెట్టుకొన్నారు. కళ్ళు తుడుచుకొన్నారు.

దూరం నుంచి ఎడ్లు, ఆవులు, ఎనుంగొడ్లు, దూడలు, లేగలు, కుర్రలు, పడ్డలు, కోడెలు అరుస్తున్నాయి. మెడతాళ్ళు తెంపుకోజూశాయి. కల్లం తొక్కుతున్నాయి. కట్టుగొయ్యల చుట్టూ అరుస్తూ తిరుగుతూ ఉన్నాయి.

పెద్దాయప్ప పోయి పసుల కట్టుగొయ్య పలుపుతాళ్ళు విప్పితే అవి పరుగు పరుగున రాంవలచ్చువులు దగ్గరకొచ్చాయి. ఆడవాళ్ళు తప్పుకొన్నారు. పసులు ఒక పక్కకు చేరాయి. ముట్టెలతో కదిపాయి. నాలుకతో నాకాయి. ఏడుస్తూ నిలబడ్డాయి. కన్నీళ్ళు కార్చాయి. 'కీ', 'బే' అని గోల చేశాయి.

వాటి దుఃఖం చూచినవాళ్ళకు ఏడుపు ఆగలేదు.

వాటికి అర్థమైంది. తాము ఏమీ చేయలేమని తెలుసుకున్నాయి.

దూడలు మాత్రం ఇంకా రాంవుడి కాళ్ళు నాకుతూనే ఉన్నాయి. లచ్చువుని గిట్టలు కొరుకుతున్నాయి.

పశువుల పట్ల మనిషికి, మనుషుల పట్ల పశువులకు ఉన్న అనుబంధమే ఇంతకాలం ఈ దేశంలో ఆహారంగా కొనసాగింది. ప్రాణికోటి నిలబడింది. బతుకు పోరాటం విజయవంతంగా వెలిగింది.

అన్నదమ్ముల్ని వదలలేక అక్కడే నిలబడ్డాయి పశువులు. మనుషులొక వైపు ఉండగా పసులొకవైపు నిలబడి అన్నదమ్ముల్ని చూస్తూ, ఏడుస్తూ, కన్నీరు కారుస్తూన్నాయి.

కన్నీళ్ళతో చూపులు మసకబారుతున్నాయి. గొంతులు పూడుకుపోయాయి.

ఎంతసేపు ఇట్లా చూడటం?

పశువుల్ని కట్టేయటమే కాదు, వాటిని అక్కడ నుంచి తోలటం కూడా కష్టమయింది.

నిలబడి చూస్తూ, చూస్తూ ఉన్న పశువులు నెమ్మదిగా నేలమీద కూర్చుని అన్నదమ్ముల్ని మార్చి మార్చి చూస్తున్నాయి.

జనం వస్తున్నారు, చూస్తున్నారు. వెనక్కు పోతున్నారు. దూరంగా పోయి కూర్చుంటున్నారు.

చీకటి పడింది.

ఇద్దరి తలల దగ్గర దీపాలు పెట్టారు.

రాంవులచ్చువులు పుటకలు చూచినవాళ్ళు, వాళ్ళ స్నేహం, ఆత్మీయత, అనుబంధం అర్థం చేసుకొన్నవాళ్ళు, వాళ్ళ జీవితం తీరుతెన్నులు తెలిసినవాళ్ళు, గతమంతా తలచుకొంటూ, కథలు కథలుగా చెప్పుకోసాగారు.

కుమిలి కుమిలి కునారిల్లిన వాళ్ళు జ్ఞాపకాల అలల మీద తేలిపోతూ ఉన్నారు.

తమ వాళ్ళందరూ చుట్టు పక్కల గ్రామాలలోనే ఉన్నారు. రేపు పొద్దుటే మట్టి చేయటమని రాత్రికి రాత్రి కబురంపారు. కూతురు, అల్లుడు అప్పటికప్పుడు వచ్చేసినారు.

జీవితం అంతా శాంతంగా, ప్రశాంతంగా ఉండే రాంవుడు ఊరూ, గేరీ అలాగే ఉండాలని వాంఛిస్తూ వచ్చాడు. అతడి చివరి రోజుల్లో గడ్డి కోసం అశాంతి రేగటం భరించలేకపోయాడు.

రాంవుడు బాగున్నప్పుడు, బాగా లేనప్పుడు, తిండి తిన్నా, తినకపోయినా, తన సంతోషంలోనూ, దుఃఖంలోనూ,పరుల సుఖ

సంతోషాలే కోరాడు. తన పశు సంపదను సొంత సంతానంలా చూసుకొన్నాడు. తన కన్న సంతానాన్ని దైవ ప్రసాదంగా స్వీకరించాడు. ఊరివారినీ, గేరి వారినీ దైవస్వరూపులుగా భావించేవాడు. ఎవరికీ ఏ కష్టమూ, నష్టమూ వాటిల్లకూడదని తలచేవాడు. ఊరి వాళ్ళు, గేరివాళ్ళు కలసి మెలసి ఉండాలని, ఒకరినొకరు ప్రేమగా చూచుకోవాలని, ఆత్మీయత పెంచుకోవాలని, అన్నదమ్ములులాగా ఉండాలని భగవంతుణ్ణి ప్రార్థించేవాడు. స్కూలు పిల్లలు భారతీయులంతా అన్నదమ్ములని పాఠం చదువుతుంటే, అందరూ అన్నదమ్ములు కావటానికి చదువుకోవాలని ఆశపడ్డాడు. చదువు-స్వాతంత్ర్యం- స్వరాజ్యం వల్ల పరాయి పాలనలో మగ్గిన ప్రజలు స్వతంత్రులుగా, సోదరులుగా విలసిల్లాలని విశ్వాసంతో దేవుళ్ళకు మొక్కాడు.

తాను చదువుకోకపోయినా తన కొడుకులు అంతంత మాత్రంగానే చదువుకొన్నా, తన మనమళ్లు, మనుమరాళ్ళు అందరితో అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు కావటానికి చదువుకోవాలని, ఊరిలో ప్రతి బాలుడూ, బాలికా బడికి పోవాలని ఉవ్విళ్ళూరేవాడు.

రాజకీయం ఒకరిమీద ఒకరు ఆధారపడేదిగానే ఉండాలి కానీ, విడదీసేది కారాదని నమ్మేవాడు. నమ్మికను ప్రచారం చేసేవాడు.

ఒకడి దగ్గర దుడ్డుండటం లేనివాడికి సహాయం చేయటానికే అని నమ్మేవాడు. సహాయం చేసేవాడు.

ఊరు బాగుంటేనే దేశం బాగుంటుందని చెప్పేవాడు.

మనిషి బాగుంటేనే దేవుడు బాగుంటాడని తేల్చి పలికేవాడు.

తానెవరికీ హాని చేయలేదు, అది తలపెట్టలేదు, అనలేదు, వినలేదు. ఎవరి హానికీ తాను ఎరకాలేదు, గురికాలేదు, బలి కాలేదు.

అందరినీ తాను ప్రేమించటం, అందరూ తనను ప్రేమించటం మనిషి అరుదుగా సాధించగల అద్భుతం. రాంవుడా అద్భుతం ఆశ్చర్యంగా అనుభవించాడు.

ఊరూ గేరీ ఏకం చెయ్యాలని చూసిన మనిషి సాధించిన మేలు శాశ్వతంగా ఉంటే ఎంతో మేలు, ఎంతో పుణ్యం.

పెద్దోబులేసు తమ్ముళ్లనిద్దరినీ చేరదీసుకొని సమాధి చేసే విషయం ఆలోచించాడు. వాళ్లు చేసిన నిర్ణయం గేరికి చెబితే ఆలోచించి సరేనన్నారు. ఊరికి చెబితే నలుగురూ కూడబలుక్కొని మేలు మేలన్నారు.

రాత్రి ఎవరూ నిద్రపోలేదు. దీపాలు మేల్కొన్నాయి.

జనమే కాదు, పసిపిల్లలే కాదు, పసులు కూడా మేతా నీళ్లు అనకుండా మేల్కొనే ఉండటం ఊరికి అద్భుతంగానే ఉంది.




ఆ రాత్రి ఎవరూ అన్నం తినలేదు. పిల్లలు కూడా పెద్దలలాగే సంగటి తినలేదు, గంజి తాగలేదు.

మధ్యాహ్నం నుంచి పశువులు గడ్డిపరక కూడా ముట్టలేదు. అంతదాకా లేక తినలేదు. సాయంత్రం నుంచి సర్కారు వరిగడ్డి వచ్చినా, వాటి ముందు వేసినా, అవి తినలేదు. వచ్చిన గడ్డి వచ్చినట్లే ఉంది. వేసిన గడ్డి వేసినట్లే ఉంది. మేయని గొడ్డు మేయకుండా అట్టాగే ఉన్నాయి.

రాంవలచ్చువులు ఇంటికి రాకముందు గడ్డి తినటం మానేసిన గొడ్లు అన్నదమ్ముల్ని చూసి కన్నీరు పెట్టుకోసాగాయి.

రాంవునికి సర్కారు గడ్డి వస్తుందో, రాదో

అనే సందేహం ఉండింది. వచ్చినా నిలుస్తుందో, నిలవదో అనే అనుమానం ఉండింది.

గడ్డి కాలిపోవటం, లారీ తోవ తప్పించటం, యువకులు ఘర్షణ పడటం- అన్నీ వదంతులని తేలిపోయినా, ఆ సందేహాలు, అనుమానాలు, భయాలు తలెత్తకుండా ఉండి వుంటే రాcవుడు ఎంతో సంతోషించేవాడు.

చుట్టుపక్కల గ్రామాల నుంచి రావలసిన బంధుమిత్రులు ఒక్కరొక్కరే రాసాగారు. రాత్రి అక్కడ నుంచి ఇళ్లకు వెళ్లిపోయినవాళ్లు తెల్లారేసరికి వచ్చారు. రైతులు పక్కూర్ల నుంచి కూడా వచ్చారు. ఉన్న ఊరి జనం, గేరి జనం, మూగసాగారు.

స్వగ్రామమే అయినా ఊళ్లో లేని నేత విశ్వేశ్వర్ అనంతపురం నుంచి రాత్రికి రాత్రే వచ్చాడు. గ్రామంలో అతను నలుగురి తల లో నాలుక. పేదల బంధువు. కమ్యూనిస్టు ఉద్యమం చీలికలు పేలికలు కాకపూర్వం కలిసికట్టుగా ఉద్యమాలు నడిపిన కుటుం బం వారసుడు.

మరో నాయకుడు కేశవులు తండ్రికి వందల ఆవుల మందలుండేవి. సంపన్న కుటుంబం. చాలా పొలం ఉంది. పేదలకు గుత్తకిచ్చేవాళ్లు. రైతుకూలీ ఉద్యమం ఆ కుటుంబం పట్ల వైముఖ్యం చూపించినా కేశవులు ఎంఎల్ఏగా ఎన్నిక అయ్యాడు. రాజకీయాలంటేనే కంపు. అందులో ఏ వాసనా అంటని మనిషి కేశవులు.

రైతుకూలీ సంఘం సభ్యుల పక్షాన, అన్నల పక్షాన వాళ్ల నాయకుడు వచ్చాడు.

గ్రామ సర్పంచి నిన్న సాయంత్రం నుంచి రాత్రి ఇంటికి కూడా పోకుండా గేరిలోనే ఉండి నలుగురి యోగక్షేమాలు విచారిస్తూ రాcవుడి మిద్దెముందు ప్లాస్టిక్ కుర్చీలో కూర్చుని ఉన్నాడు.

రాcవుడికి కమ్యూనిస్టులతో, తెలుగుదేశం వాళ్లతో, నక్సలైట్లతో, కాంగ్రెసు వాళ్లతో సంబంధాలున్నాయి. విశ్వేశ్వర్ తండ్రి, రాcవుడు, 'ఆయప్పా', 'అన్నా, అన్నా' అనుకునేంత మిత్రులు.

తన తండ్రికి రైతు కూలీలకు మధ్య సమస్యలు వచ్చినప్పుడు మధ్యస్థంచేసి, వాటిని పరిష్కరించి, ఇటు రైతులకు, అటు తండ్రికి అభిమానపాత్రుడైన రాcవుడిని కేశవులు బాల్యం నుంచి అభిమానించేవాడు.

రైతు కూలీలు, అన్నలు తన అన్నదమ్ములు.

గ్రామంలో సర్పంచికి తాను గేరి ఓటర్లను కాపాడే పెద్దమనిషిగా రాcవుడు ఆత్మీయుడు. వీళ్లందరినీ అభిమానించినా, ఆదరించినా ఏ రాజకీయమూ అంటని, ఏ రంగూ పులుముకోని, ఏ రుచీ మరగని, ఏ వాసనా కొట్టని అసలు సిసలు దళిత రైతు రాcవుడు.

పొద్దుటే పోయి పదిమంది సమాధి చేయటానికి తగిన గోయి తీశారు, రావి-వేప దేవర చెట్టు అరుగు పక్క.

అందరూ రావటం, చూడటం, అయిపోగానే చివరి యాత్ర ఏర్పాట్లు చేయసాగారు. జనం విశేషంగా గుమిగూడారు. అన్ని రాజకీయాలవారు కలిశారు. రాజకీయంగా శత్రువులు కూడా ఆ క్షణంలో మిత్రులుగా వ్యవహరించసాగారు. ఏ రాజకీయ ప్రస్తావనా ఎవరూ తేలేదు. ఏ నినాదాలు చేయలేదు. రాcవుడి వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించేట్టు జనం ప్రవర్తిస్తున్నారు.

అందరూ అందరితో ఆత్మీయంగా మాట్లాడుకోసాగారు. అందరూ రాcవుడి కొడుకుల్ని, పెద్దోబులేసు, నడిపోబులేసు, సన్నోబులేసుల్ని, వాళ్ళ భార్యల్ని, పిల్లల్ని పలకరించి ఓదారుస్తున్నారు.

పశువుల్ని ఎవరూ ఓదార్చలేదు. రావలచ్చువుల్లో ఎవరు ముందు చనిపోయారో,

ఎవరు వెనుక చనిపోయారో, ఇద్దరూ ఒకే సారి చనిపోయారో ఎవరికీ తెలియదు.

ఒకరి కోసం ఒకరుగా బతికిన రావలచ్చువులు ఒకరి కోసం ఒకరు చనిపోవటం మాత్రం మింగుడుపడని సత్యాన్ని తీరికగా పలికి, నమిలి, మింగుతున్నారు జనం.

కొడుకులు ముగ్గురు, బంధువులు, మిత్రులు, పరిచయస్థులు, గ్రామస్థులు అందరూ, అందరూ అన్నదమ్ములై రాంవుని లేపి స్నానం చేయించారు.

పెళ్ళినాటి పట్టుబట్టలు, ఉతికి ఆరేసి, మడత పెట్టి, అలమారాలో దాచిపెట్టిన పట్టుబట్టలు తీసి పంచె కట్టారు. అంగీ వేశారు. సెల్లా భుజాల మీద ఉంచారు.

కుంకుమ బొట్టు పెట్టారు.

పూల మాలలు మెళ్ళో వేశారు.

అగరొత్తులు వెలిగించారు.

మంచంమీదే పెట్టిన పాడెను, మోట బావి కాడ ఉన్న వెదురు పొద బొంగులు తెచ్చి బద్దెలు చీల్చి కట్టిన పాడెను, దించి శుభ్రం గా అలికిన కాలుపు బండలు పరచిన నేలమీద ఉంచారు.

ఆడవాళ్ళను, పిల్లలను ఏడవవద్దని, చివరి చూపులు చూచి దూరంగా పొమ్మని స్పష్టంగా చెప్పటంతో అందరూ వచ్చి చూసి, దూరంగా పోయి గోడల నీడల్లో వినబడకుండా ఏడుచుకొంటూ ఉన్నారు.

పాడె కాడ నిశ్శబ్దంగానే ఉంది. ముక్కులు చీదినా, మూతులు కదిలినా, కళ్ళు తుడుచుకొన్నా, ఎవరూ పెద్దగా ఏడవ లేదు.

ఆ నిశ్శబ్దం బరువు గుండెల ఆక్రందనలకు ప్రతిరూపం.

లచ్చువుని బయట బండిమీద ఉండగానే నీళ్ళు పోసి, పయి కడిగి, పక్కకు తిప్పి, నీళ్ళు పోసి తుడిచి, ముక్కూ మూతి కడిగి, ముట్టే నుదురు తుడిచి, కళ్ళ పుసి కడిగి, కొమ్ముల చెమ్మలు తుడిచి, ముఖానికి పసుపుకుంకాలు పూసి పూజచేసి చివరి యాత్రకు సిద్ధం చేశారు.

రాంవలచ్చువులను చూసిన గొడ్లు కలదిరిగాయి. కల్లం దొక్కాయి. 'అంబా' అంటూ అరిచాయి. వాటి గోల చూస్తుంటే జనం కళ్ళు చెమ్మగిల్లాయి.

లచ్చువుడి టయరు బండిని శుభ్రం చేసి, అలంకరించి, మంచి ఎడ్ల జతను పూన్చి ఉంచారు.

దింపుడు గల్లందాకా పాడె తామే మోయాలని కొడుకులు తీర్మానించుకున్నారు.

మేము మోస్తామని పశువులు గోల చేస్తుంటే మరో టయరు బండి సిద్ధం చేసి వాటికి రెండు బలమైన ఎడ్లను కట్టి, ఆ బండిని దింపుడు గల్లంకాడ ఉంచారు.

మేళం వాళ్ళు ముందు సాగుతుండగా పాడె కదిలింది. పప్పులు, బొరుగులు, నాణే లు, పూలు విసిరేవాళ్ళు విసురుతూ పోతున్నారు.

తామే మోయాలని అన్నదమ్ములు తీర్మానించుకొని ఎత్తుకొని పోతుండగా, శవయాత్ర మొదలయింది. ముగ్గురు కొడుకులు, మరో కొడుకు వరసయ్యే దగ్గర బంధువు మోస్తుండగా పాడె వెళుతూ ఉంది.

### ముగ్గురు ఇష్టులు

కమ్యూనిస్టు, కేపిటలిస్టు, సోషలిస్టు.. వంటి పదాలు బాగా ప్రచారంలో ఉన్న రోజులు. వంగర తమ ఇంట్లో ముగ్గురు ఇష్టులు ఉన్నారని స్నేహితులకు నవ్వుతూ చెప్పేవారు.

ఎవరయ్యా అంటే-

'మా ఆవిడ రోగిష్టి.. మా అబ్బాయి కోపిష్టి.. నేను పాపిష్టి.. మొత్తం మీద ముగ్గురం ఇష్టులం కాదూ?' అని కొంటెగా చూసేవారు.

మధ్యలో బంధువైన అన్నల నాయకుడు శవ వాహకుడుగా వచ్చాడు. కొంచెం దూరం పోగానే సర్పంచి, సన్నాయప్పను తొలగించి మోయసాగాడు.

విశ్వేశ్వర్ పెద్దాయప్పను పక్కకు పంపి శవ వాహకుడు అయ్యాడు.

అప్పుడు నడిపాయప్పను పక్కకు పంపి కేశవులు పాడె భుజాన వేసుకొన్నాడు.

ఒక దశలో అన్నదమ్ములు ఎవరూ లేకుండా నలుగురు కొత్తగా ఏర్పడ్డ నాయకులు తమ అన్నదమ్ములుగా తమ తండ్రి పాడె మోయటం సొంత కొడుకులే కాదు, బంధుమిత్రులే కాదు, కడసారి చూపుకు వచ్చిన జనమంతా ఉద్రేకంతో పొంగిపోయారు.

ఊరి జీవితంలో అదొక అద్భుత దృశ్యం. గేరికి జ్ఞాపకంగా మిగిలిపోయే ఆనందరూపం.

ఊరివాళ్ళు, గేరివాళ్ళు, బంధుమిత్ర పరిచయస్థులు అందరూ ఆ కాస్తంత దూరం మార్చి మార్చి శవవాహకులయ్యారు.

ఆ శవవాహకులు నలుగురు, నలభై, నాలుగు నూర్లు, లెక్కలేదు.

ముందు మేలగాళ్ళు, వెనక రాంవుడి శవ యాత్ర. ఆ వెనుక లచ్చువుడి టయరు బండి. దాని వెంట జనం, వాళ్ళ వెనక పశువులు, ఆడవాళ్ళు, పిల్లలు, వాళ్ళతో ఏడ్చుకొంటూ కుక్కలు, ఇళ్ళ కుక్కలు, ఊరకుక్కలు, దిగులుగా వేదనతో భారంగా బూసి.

దింపుడు గల్లం దగ్గర పాడె దించారు. 'రావన్నా, రావన్నా, రావన్నా' అని మూడు సార్లు పిలిచారు. అలాగ్గే 'లచ్చువన్నా, లచ్చువన్నా, లచ్చువన్నా' అని పిలిచారు.

వాళ్ళు పలకలేదు. కదల్లేదు. పాడె కట్టె మాదిరిగా ఉండిపోయింది. టయరు బండి నిర్జీవంగా నిలచి ఉంది.

మళ్ళీ పాడె ఎత్తారు. సిద్ధంగా ఉన్న టయరు బండి మీద పెట్టారు.

తమ విధి తాము నిర్వహించటానికి తమ యజమాని అన్నను, అప్పణ్ణి, హితుణ్ణి, స్నేహితుణ్ణి చివరిసారిగా మోయ బోయే ముందు కడసారి చూపులు చూచుకొన్నాయి టయరుబండి ఎడ్లు.

మళ్ళీ శవయాత్ర.

వెంట వస్తున్న ఎవరూ వెనక్కు వెళ్ళ లేదు.

రాంవలచ్చువుల టయరు బళ్ళు తోటలోకి వచ్చాయి. అన్నదమ్ములు పాడె మీద, బండిమీద నవ్వుతున్నట్లే ఉన్నారు.

రెంటినీ సీతక్క సమాధి దగ్గర నిలిపారు. ఆమె చూస్తుందని వాళ్ళ ఆశ. ఆమె చూసినట్లే ఉంది. చెట్లు కదిలాయి. గాలి తోలింది. చెట్ల ఆకుల్ని చీల్చుకుపోతున్న గాలి రొద పెట్టింది, ఏడ్చింది.

సీతక్క తృప్తిదీరా ఏడ్చింది.

తోటలోకి వచ్చిన బళ్ళు మోటబావి చుట్టూ తిరిగి, మెట్టు దిగి రావి వేపల దేవర అరుగుపక్క సీతక్క సమాధి దగ్గర నిలబడిపోయాయి.

సీతక్క సమాధి పక్క అప్పటికే పది అడుగుల పొడుగు, ఆరు అడుగుల వెడల్పు, ఆరు అడుగుల లోతు గుంత తవ్వారు. తవ్విన మట్టి చుట్టూ గట్టుపడి ఉంది.

పూజారి వచ్చాడు. మంత్రాలు చదివాడు, తతంగం ముగించాడు.

ఆత్మల్ని పరమాత్మలో లీనం కావాలని కోరాడు. పునర్జన్మ రాహిత్యం వాంఛించాడు. మనిషికి మనిషి చేయగల వాక్ సంస్కారంలో అది చివరి ఘట్టం.

పూజారి పనిముగిసి పోగానే కాగల కార్యం నిర్వహింప చూశారు జనం.

అందరినీ కడచూపులు చూసుకోమన్నారు. వచ్చినవాళ్ళు అందరూ చూశారు, తొలిగారు, తప్పుకొన్నారు. వెనకవాళ్ళు

ముందుకు వచ్చారు, చూశారు, వెళ్ళారు. పశువులు వచ్చాయి. నిశ్శబ్దంగా వచ్చాయి. కన్నీరు కార్చాయి. అవి తప్పుకోగానే కుక్కల గుంపు ఎగబడి నిలబడింది. వాటిని తోలగానే కొడుకులు ముగ్గురూ, బంధువులు, గుంతలోకి దిగారు. బూసి గుంత మట్టిగుట్ట మీద నిలబడి గుంట లోకి చూస్తూ ఉంది.

ఆవేదనతో, దుఃఖంతో, అంతరాంతరాల ఆత్మీయతల పొంగులతో పొగులుతున్న వాళ్ళు స్వాధీనం తప్పుతున్నారు.

గోతిలో మెత్తటి మట్టి మీద ఇసుక వేశారు. ఇసుక మీద నిన్న వచ్చిన సత్కారు గడ్డి రెండు పనలు పరిచారు.

లచ్చువుడికి ఆ గడ్డి రుణం లేదు, తిన లేదు. కానీ తినమని వేసి ఉంచారు.

ఎవరికేది రుణం? ఎంతకాలం? ఎవరి కెవరు? కొడుకులు, ఆత్మీయులు, బంధు వులు, తమవాళ్ళు, గేరివాళ్ళు, ఊరివాళ్ళు - ఏమి అనుబంధాలు? ఏమి ఆత్మీయ తలు? ఎంతకాలం? ఏదో ఆరాటం?

బతికినంత కాలం కన్నవాళ్ళను కాపాడ టానికి విశ్వప్రయత్నం చేసిన రాంవలచ్చు వులు చనిపోయి సీతక్కను సమాధిలో సంరక్షించటానికి వచ్చాడు. సీతక్క రాంవ లచ్చువుల్ని, అన్నదమ్ముల్ని ఆదరంగా మట్టిలోకి ఆహ్వానించింది.

సీతా రామలక్ష్మణుల అరణ్యావాసం కొన్నేళ్ళే! సీతక్క రాంవలచ్చువుల తోట వాసం ఎన్నేళ్ళో! ఎన్నాళ్ళో! ఎన్ని యుగా లో! ఎవరికి తెలుసు? ఎవరు చూశారు? ఎవరు చెప్పగలరు?

చెప్పగలవాళ్ళు కనిపించరు! పోయిన వాళ్ళు చెప్పటానికయినా రారు, రాలేరు!

ముందుగా లచ్చువుడి టయరు బండిని గోతికాడికి తోలారు. నాలుక్కాళ్ళకు, నలా పికి, కొమ్ములకు ఆరు మోకులు కట్టారు. ఒక్కొక్క మోకు నలుగురేసి పట్టుకొ న్నారు.

గుంతలో అన్నదమ్ములు నలుగురు దిగి ఉన్నారు. లచ్చువుడి బండి ఎడ్లను కాడి నుంచి తప్పించారు. పోలుగర్ర ఎత్తి లచ్చు వునికి తోపిడిచారు. అందరూ మోకులు గట్టిగా లాగి పట్టుకోగా, గోతిలో పడుతున్న లచ్చువుడి భౌతికకాయం నిమిషం గాలిలో ఆగింది. గుంత లోపలివాళ్ళు అందుకొంటూ ఉండగా, వెలుపలివాళ్ళు మోకులు మెల్లగా జారవి డుస్తూ ఉండగా లచ్చువుడి భౌతిక కాయం గుంటలో చేరింది.

**సీతా రామలక్ష్మణుల అరణ్యవాసం కొన్నేళ్ళే! సీతక్క రాంవలచ్చువుల తోటవాసం ఎన్నేళ్ళో! ఎన్నాళ్ళో! ఎన్ని యుగాలో! ఎవరికి తెలుసు? ఎవరు చూశారు?**

రాంవుడిని టయరు బండి మీది నుంచి పాడెతోసహా దించి, మట్టి కుప్ప మీద ఉంచి, పాడె అక్కడే వదలి మృతదేహం లేపి, పదిమంది పట్టుకొని, గుంటలో ఉన్న వాళ్ళకు అందించగా వాళ్ళు భౌతిక కాయం మట్టి ఇసుక గడ్డి పడక మీదికి చేర్చి తల నెమ్మదిగా ఎత్తి లచ్చువుడి మెడ మీద పెట్టి, తెల్లగుడ్డ ముక్క కొత్తది రావ లచ్చువుల మీద కప్పారు.

అందరూ చివరిసారిగా గుంతలోకి తొంగి చూశారు. బరువైన గుండెలు. ఎవరూ ఏడవరాదు. అది నిర్ణయం, నియమం.

చూడవచ్చని అందరికీ తోవ ఇచ్చారు. వచ్చినవాళ్ళు చివరాఖరి చూపులు చూశారు.

మనుషులు తర్వాత పశువులు. పశువుల్లో ఆవులు, ఎద్లు, వాటి సంతానం, ఆపైన ఎనుంగొడ్లు వాటి వారసులు- చివరికి కుక్క లు. బూసి 'మొర్రోమని' పెద్దగా ఏడ్చింది. దాన్ని ఎవరాపగలరు?

చూడ్డానికి ఏముంది?

తెల్లటి బట్ట. అఖండంగా గుడ్డ ముక్క కింద రాంవుడున్నాడా? లచ్చువుడున్నాడా? గడ్డి ఉందా? ఇసుక ఉందా? మట్టి ఉందా? భూదేవి ఉందా? అందరూ... అంతా... అన్నీ... ఉన్నాయా?

తెల్లబట్ట తప్ప ఏమీ కనిపించటంలేదు.

పైన ఉన్నవాళ్ళు లోన ఉన్నవాళ్ళకు, లోనివాళ్ళు పైవాళ్ళకు, ముందున్న వాళ్ళకు వెనుక ఉన్నవాళ్ళు పనులు చెబుతూనే ఉన్నారు.

పారలు చేత బూనినవాళ్ళు పని ప్రారంభించారు. అందరూ తలొక గుప్పెడు మట్టి గుంతలో, సమాధిలో వేశారు. అంతా గుప్పెడు మట్టి!

గుంట లోపల్నుంచి అన్నదమ్ముల్ని నలుగురూ చేతులందించి వెలుపలికి, పైకి బంధువులు లాగారు.

తమ తండ్రి తమను పెంచిన తీరు, నేర్పిన జీవితం, పనిపాటలు, ఆటపాటలు, ఆత్మీయతలు, అనురాగం, వెన్నెట్లో చెప్పిన కతలు, ఆరుబయట మంచంలోంచి చూపిన చుక్కలు, చంద్రుడు, భుజాల మీద కూర్చోబెట్టుకొని చూపిన మెరవణి, బంగారు చేతులతో తినిపించిన సజ్జన్నం, పెరుగు బువ్వ, శ్రీరామనవమికి తాగించిన పానకం, అనంతపురం తీసుకుపోయి కొని పెట్టిన బట్టలు, చూపించిన ప్రేమ, అందించిన వాత్సల్యం, మోపిన బరువు బాధ్యతలు ఒక్కొక్కటి వరసవరసగా గుర్తుకు వస్తుంటే అన్నదమ్ములు సంచలించి పోతున్నారు.

ఊరు గేరి ఏకం చేయటానికి పడిన పాట్లు, సంపన్నుల్ని, సామాన్యుల్ని అభిమానంతో పలకరించిన ప్రేమ, రైతుల్ని, కూలీల్ని అన్నదమ్ములుగా చూసే దృష్టి, అందరినీ ఆదరంగా పలకరించే మంచి మనసు, మాట, పదిమందిని కలుసుకొనే, కలుపుకొనే స్వభావం, ఎవరినీ ఏమీ అనని తత్త్వం, నలుగుర్ని ప్రేమించే గుణం, అందరిలో ఒకడుగా కలిసిపోతూ... నలుగురినీ కలుపుకుపోతూ... సమస్యలు సర్దుబాటు చేసుకొంటూ, ప్రేమిస్తూ, ప్రేమించబడుతూ జీవించిన తీరును అందరూ గుర్తుకు తెచ్చుకొని, తలా గుప్పెడు మట్టి వేశారు.

సమాధిని పూర్తిగా పూడ్చారు.

ఎక్కడో, ఏ పొలంలోనో పుట్టి, గింజలు ఆసామికి అర్పించి, గడ్డిగా వాగెన్లలో చేరి, అనంతపురం వచ్చి లారీలోకి ఎక్కి భయాల మధ్య, భ్రాంతుల మధ్య గ్రామంలో ప్రవేశించి తమ దొడ్లో వామిగా నిలబడింది గడ్డి. ఈ గడ్డి మేతై పశువుల ఆకలి తీరి, ఆరోగ్యంగా ఉంటాయనుకుంటే, నిన్నటిదాకా మేత లేక పస్తున్న పశువులు, సాయంకాలం నుంచి గడ్డి ఉన్నా తినకుండా ఉపవాసం ఉండటం, మనుషులకే కాదు, మనుషులలాగే ప్రాణం ఉన్న పశువులు కూడా శవం ఇంట్లో ఉంటే ఏమీ తినకపోవటం, ఏదో అనుబంధం, ఏదో ఆత్మీయత, ఏదో అనురాగం చాటుతూ ఉంది.

ఈ ఎండల్లో ఈ మేత పశువుల ప్రాణం నిలిపితే వానలు పడి, సేద్యం పనులు జరిగి, పంటలు పండి, ధాన్యం పాతర్లో, గాదెల్లో చేరితే ఆకలి నోళ్ళు ఏడాది పొడుగునా తిని బతకటానికి మార్గం ఏర్పడుతుంది. తిండిగింజలు వస్తే గడ్డి కూడా

మిగులుతుంది. రైతులకు, పశువులకు గ్రాసం కొదవ ఉండదు.

ఈ సర్కారు గడ్డి ఇటు మేతగా, భవిష్యత్తులో పంటగా రైతుకు కనువిందే కానీ, ఏం లాభం? అది తినవలసిన లచ్చువుడు తినలేకపోయాడు. తినలేదు, తినలేడు, రుణం లేదు. ప్రాప్తం లేదు.

ఏ గడ్డి మీద ఏ పశువు ఆకలి దాగి ఉందో, ఏ పశువు జాతకచక్రం లిఖింపబడి ఉందో!

తన సమాధి పక్కనే రాంవుడు, లచ్చువుడు కళేబరాలు కావటం సీతక్క చూస్తూ ఉంది.

చివరికి భర్త సన్నిధి లభించి సంతోషించింది. అన్న సమీపంలో తానూ ఉండటంతో లచ్చువుడు పరవశించి పోయాడు.

వాళ్ళిద్దరి మధ్య తానుండటం రాంవుడికి పరమానందంగా ఉంది!

ఎవరూ ఎవరికీ చెప్పకుండా అందరూ వెళ్ళిపోయారు. అందరూ అంతే! వెళ్ళిపోతారు.

తండ్రి సమాధి కాడే కూర్చున్న అన్నదమ్ముల్ని, భార్యలు, పిల్లలు లేపి తోటలో నుంచి ఇంటిలోకి తీసుకుపోయారు.

వాళ్ళను అనుసరించి పశువులు ఇంటి తోవ పట్టాయి.

సమాధి తల దగ్గర ఆరిపోని దీపం ఉంది.

కాళ్ళ దగ్గర రాంవుడి పెంపుడు కుక్క బూసి కూర్చునే ఉంది.

ఊరివాళ్ళు, గేరివాళ్ళు కలసి రాంవుల చ్చువుల జీవిత విశేషాలు చెప్పుకొంటూ గ్రామం చేరుకొన్నారు.

తల్లీ తండ్రీ లేని ఇంటికి, తల్లులూ, తండ్రులూ అయిన పెద్దోబులేసు, నడిపోబులేసు, సన్నోబులేసు భార్యాబిడ్డలతో చేరారు. తరం మారింది.

వీళ్ళే రాంవుడింటి వారసత్వానికి గుర్తులు!

వాళ్ళను చుట్టుకొన్న పశువుల గుంపు మనుషులతో కలిసిపోయి సమూహంలో సాగిపోతూ ఉంది.

అందరి వెనుక కుక్కల గుంపు పరధ్యానంగా నడుస్తూ ఉంది.

వాటికి కాపలా పని తప్పదు. ఇక రాదు. బూసి గేరికి రాలేదు.

రాంవుడి సమాధి చూచి గుండె పగిలి ఆకాశం కన్నీరు కారుస్తున్నట్లు వాన చినుకులు పడసాగాయి! ✦

## తెలియనట్లే ఉండాలి

ఒకసారి వంగర ఏదో పౌరాణిక చిత్రంలో నటిస్తున్నారు. అందులో పురాణాల్లో లేని ఘట్టాన్ని చిత్రీకరిస్తున్నారనీ.. ఔచిత్య భంగం అవుతోందని బయటకొచ్చి రహస్యంగా తన మిత్రుడితో బాధపడుతూ చెప్పారు.

వాళ్లకు చెప్పకపోయావా? అని అతనంటే వెంటనే చెవులు మూసుకుని- "శివశివ.. ఇంకేమన్నా ఉందా స్వామీ? మనం ఆ డైరెక్టర్ల దగ్గరా, నిర్మాతల దగ్గరా నోరెత్తడమే? ఎంత ప్రమాదం? ఆ కవిగారు అలా రాశారు. వాళ్లు అలా తీస్తున్నారు. చూడండీ, ఈ సినీ లోకంలో మనకి తెలిసినా, తెలియనట్టుండాలి. మనకి తెలిసినట్టు వాళ్లకి తెలియకుండా, మనకేమీ తెలియనట్టుగా, మనం ఏమీ తెలియనివాళ్లంగా మసలుకోవాలి. పొరపాటున ఏమైనా అన్నాం అనుకోండి. 'పోవయ్యా, చెప్పింది చెయ్యి. లేకపోతే వేషం తీసి దయచెయ్యి' అంటారు. అమ్మయ్యో... చాలా డేంజరు ఈ సినీ మాయాలోకం" అన్నారు తన పద్ధతిలో భయం నటిస్తూ.

# నవలా వైభవం



కథన్నాక ఎంతో కొంత సెంటిమెంటు, డ్రామా తప్పవు. పుస్తకాలు చదువుతూ, సినిమాలు చూస్తూ కడవలకొద్దీ కన్నీళ్ళు కార్చటం మన సొంతమనీ, పశ్చిమ దేశాల వాళ్ళకో పట్టాన మనసు కరగదనీ అనుకుంటాం. ఈ సందర్భంగా డికెన్స్ నవలల గురించి చెప్పుకోక తప్పదు.

సెంటిమెంటల్ సాహిత్యం రాజ్యమేలిన పందొమ్మిదవ శతాబ్ది ఇంగ్లండులో, డికెన్స్ అలనాటి పాఠకులకు నచ్చినట్టుగానే రాసి అత్యంత పాఠకాదరణ పొందిన రచయితగా పేరు తెచ్చుకున్నాడు. అయితే ఆయన 'ఓల్డ్ క్యూరియాసిటీ షాప్' (1840-41)లో మాత్రం సెంటిమెంట్ పరాకాష్ఠకు చేరింది.

## తెర తీయగ రాదా!

ఈ నవల పాఠకులనెంతగా ఆకట్టుకున్నదంటే బహుశా, అలాంటి గౌరవం, ఆదరణ, అభిమానం చరిత్రలో మరే రచయితకూ దక్కలేదు. డికెన్స్ సంపాదకత్వంలోని 'హౌజ్ హోల్డ్ వర్డ్స్' పత్రికలో ఇది సీరియల్‌గా వస్తున్నప్పుడు పాఠకులు ఆ పత్రికను ఎగబడి కొనేవాళ్ళు. ఇందులో ఉత్ప్రేక్ష ఏమీ లేదు. అమెరికాలో కూడా డికెన్స్ భక్తులకు కొదవ లేదు.

'లిటిల్ నెల్ డెత్ బెడ్ సీన్లు' చదివి కన్నీరు మున్నీరుగా విలపించారు. ఇది తెలిసి, డికెన్స్ కథను మరింత మరింత పొడిగించారు. పాఠకులలో ఉత్కంఠ పెరిగింది. రేవులో నిలబడి, పత్రికను తెచ్చే షిప్పు కోసం నిరీక్షించారు.

షిప్పు వాళ్లది కూడా జాలి గుండె. కథ చదివి చెప్పకుండా ఉండటం వాళ్ళకూ సాధ్యం కాదు. అందువల్ల అల్లంత దూరాన ఉన్న ఓడనుండి మైకులో చదివి వినిపించారు. పాఠకులను మంత్రముగ్ధుల్ని చేసిన 'ఓల్డ్ క్యూరియాసిటీ షాప్' గురించి తరువాతి తరాల పాఠకులు, సాహిత్యకారుల అభిప్రాయాలు మారిపోయాయి.

"డికెన్స్ గొప్ప హాస్య రచయిత. లిటిల్ నెల్ మరణం పాఠకులను కడుపుబ్బ నవ్విస్తుంది" అంటాడు ఆస్కార్ వైల్డ్.

'సెంటిమెంటల్ ట్రాష్', 'చదవటం అసాధ్యం', 'అసలీ మనిషికి ఆలోచించ గలిగిన శక్తి ఉందాని సందేహం కలుగుతుంది', 'డికెన్స్‌కు మానసిక జాడ్యం ఉంది. కళ్ళ ముందరి వాస్తవికతని చూడలేని అంధుడు', 'ఇతడి పాత్రలకు మానసిక జీవితం ఉండదు' అంటూ ఎద్దేవా చేశారు హెన్రీ జేమ్స్, జార్జి హెన్రీ లెవిస్, ఆల్డస్ హక్స్‌లీ, జార్జి ఆర్వెల్ వగైరా.

ఎవరి అభిప్రాయాలెలా ఉన్నా, డికెన్స్ అభిమానుల సంఖ్య రోజురోజుకూ పెరుగుతూనే ఉంది.

తెలుగులో కనీసం ఒక రచయితకు డికెన్స్ ఆరాధ్యుడు.

ఆయన మనందరి ఆరాధ్యుడు రావిశాస్త్రి.

–స్వప్న ✦

# పరిమితులు, హద్దురాళ్లూ లేనిదే ప్రేమ




వినోదిని

నల్లటి మేఘంలాంటి చీకటి ఒంటరితనమై మనసు మీద ముసురుకుంటే తుప్పు పట్టిన ఇనుపతెరల్లాంటి ఓ చీకటి ఎయిడ్స్ రోగమై సర్వ ప్రపంచానికి మనకు మధ్య నిలబడితే-

నిగనిగలాడే వేసవికాలపు నల్లని తాజా తారురోడ్డు లాంటి చీకటి ఏక్సిడెంటై మనల్ని అవిటివాళ్లను చేస్తే-

దయ్యంలా అర్ధరాత్రి సముద్రంలోంచి నడిచొచ్చిన సునామీ చీకటి మనల్ని సర్వం కోల్పోయి బతికున్న శవాలుగా మారిస్తే.

నల్లటి మురిక్కాలవలాంటి చీకటి చేయని తప్పుకు మనల్ని బొడ్డు తడియారని అనాథగా విసిరేస్తే-

ఒక చీకటి హృదయాన్ని అలుముకుంటే-

ఇంకో చీకటి బతుకును ఆక్రమిస్తే-

ఇంకొక చీకటి తరతరాల జీవితం మీద దట్టమైన పొగమంచై కురిస్తే-

అదేదో చీకటి ఆడదానివని వెక్కిరిస్తే?

అదే చీకటి కామాతురతో అత్యంత భయానకంగా దాడి చేస్తే?

ఇంకేదో చీకటి అంటరానితనమై దూరంగా తరిమికొడితే?

అదే చీకటి ఆధిపత్య కులాలై ఆత్మగౌరవాన్ని కసుక్కున పొడిచేస్తే?

కురవకుండా రెప్పల కింద అదిమిపెట్టిన మేఘాలను కరిగించి, చల్లార్చి, అనునయించి, అక్కున చేర్చుకొని భారాన్నంతటినీ తను తీసుకొని మనసుని తేలికపరిచి నేనున్నానంటూ ఒక చెయ్యి ఆత్మీయంగా స్పృశించడం- ప్రేమ.

ఆ చెయ్యి వ్యక్తి కావచ్చు,

కుటుంబం కావచ్చు,

సంస్థ కావచ్చు,

ఒక దేశమే కావచ్చు!

అందుకే అందమైన గ్లామర్ ప్రపంచానికి రాణుల్లాంటి తెల్లటి సినిమా తారలు సైతం నల్లజాతి అనాథ పసివాళ్లని దత్తత చేసుకోవడం-

ఆత్మీయులు జబ్బుతో ఆస్పత్రి పాలైతే ఖర్చుల కోసం చేతిలో ఉన్న బొటాబొటి డబ్బుల్ని కూడా పక్కనే ఉన్న అనాథ రోగుకి కొంత ఇవ్వడం-

ప్రేమకెన్ని కోణాలో!

స్నేహితులు, స్త్రీ పురుషులు, కుటుంబ సభ్యులు...

ఒకింత అనురాగం- కాస్తంత ఆప్యాయత- ఇదంతా ప్రేమే!

భూమి చుట్టూ ఓజోన్ పొరలా మనిషి బాధల్లో, భయాల్లో, కష్టాల్లో, నష్టాల్లో, దుఃఖంలో, ఒంటరితనంలో, ఆకలిలో, అవమానంలో సమస్త భావాల చుట్టూ ఎప్పుడూ ఒక ప్రేమ వలయం కమ్ముకునే ఉంటుంది. అవి సమసిపోవడానికి సపర్యలు చేస్తూనే ఉంటుంది.

అసలు మనిషి- ఆ మాటకొస్తే సమస్త

జీవప్రపంచమే ప్రేమ అనే ఒక వాత్సల్యపు కాగితప్పొరతో పొట్లంలా చుట్టబడి ఉంది.

అందులో మనదేశం- ఇక్కడి మనుషులు కూడా!

కొందరు పక్షుల్ని ప్రేమిస్తారు- వాటికోసం గింజలు చల్లుతారు, మూకుట్లో నీళ్లు పోస్తారు.

మరికొందరు జంతువుల్ని ప్రేమిస్తారు- ప్రేమగా తల నిమిరి బుజ్జగించి, ఆడించి, లాలించి తన్మయులవుతారు. వాటికోసం ప్రత్యేక సంస్థల్ని నెలకొల్పుతారు. సర్వ సదుపాయాలూ ఏర్పాటు చేస్తారు. ఇంకొందరు మొక్కల్నీ ప్రేమిస్తారు.

ప్రేమకు పరిమి



తులు లేవు!

హద్దురాళ్లసలే లేవు!!

కొన్ని పరిమితుల గురించి మాట్లాడకుండా, కొన్ని ప్రశ్నల్ని లేవనెత్తకుండా మనం కొన్ని విషయాలను మాట్లాడలేం, ప్రేమ దానికి మినహాయింపు కాదు.

పక్షుల్నీ, కుక్కల్నీ, మొక్కల్నీ, సమస్త జీవరాసుల్నీ ఏ భేదాలూ లేకుండా, ఏ ప్రయోజనాలూ ఆశించకుండా ప్రేమించగల మనుషులు సాటి మనుషుల్ని ప్రేమించడంలో, దానిని ప్రకటించడంలో మాత్రం ఎన్నో సంశయాలు, మరెన్నో ప్రతిబంధకాలూ, ఇంకెన్నో అడ్డుకట్టలు!

కులం తక్కువై ఉండటం, మతం మనది కాకపోవడం, స్టేటస్ మనంత లేకపోవడం, అంచనాలకు తక్కువయ్యే శారీరక నిర్మాణం, రంగు, ఊరు మనది కాకపోవడం- నేల ఒకటి కాకపోవడం...

అంతరంగంలో అంతరాల పొరలను పేర్చి సామాజిక అసమానతా కట్టడాలను నిర్మించి ఈ సమాజం చేతులు దులుపుకుంటుంది. పసితనంనుంచే చిన్నారులకు ఆధిపత్య భావాలను, స్వార్థపరత్వాన్ని సెరెలాక్‌లా తినిపిస్తోంది.

ఇందులో కుటుంబం బాధ్యత ఎంత?

నిజానికి ప్రేమ స్వచ్ఛమైందే- మదర్ థెరిస్సాలా! జీసస్‌లా! కానీ నీళ్లు కలుషితమైనట్టు, పాలు కలుషితమైనట్టు, సమస్త ఉత్పత్తులు కల్తీకి గురయినట్టు ఇప్పుడు ప్రేమ కూడా కలుషితమే!

ఇప్పటి యువతీ యువకుల మధ్య ప్రేమలు- కాలేజీ లవ్‌స్టోరీలు నిజంగా లెక్కలకతీతమా? కేవలం హృదయ స్పందనే ప్రేమైక దీపమై వెలుగుతోందా? మనసుల్ని కలుపుతోందా!

రెండు హృదయాలతో మాత్రమే ప్రేమను ముడిపెట్టిన భావకవుల కలాలిప్పుడు పొయ్యిలో పడ్డ ప్లాస్టిక్కు వస్తువులై ముడుచుకుపోతున్నాయి.

ఒక్కసారి శరీరాల కలయిక కోసమో- ఒక గంట విలాసాల కోసమో-డాలర్లూ, రూపాయలు, బంగారు తులాలు, వెండి తూకాలు, భూములు, ప్రేమను వ్యక్తీకరించే నక్షత్ర వజ్రాలూ, కార్లూ, మేడలు, చివరికి ఒక కప్పు ఐస్‌క్రీము క్కూడా ప్రేమ పదం పెట్టుబడిగా నిలవడం లేదా?

గ్రీన్‌కార్డు విప్లవాలు జీవితాలను ఆక్రమించి ఒక కొత్త ప్రపంచాన్ని అరచేతిలో ఆవిష్కరించాక- ఇంట్లో ఒంటరిగా మిగిలిపోయిన ముసలి తల్లికి- ప్రేమ పోగులు ఒక్కొక్కటిగా తెగుతున్న కుక్కిమంచం కావడం లేదా? ఓల్డేజీ హోంలకు దారి చూపించే బాణం గుర్తు రాలేదా?

అసలు ప్రేమకెన్ని ముఖాలు?

ద్వేషం- స్వార్థం- ఆధిపత్యం- కసి, చివరికి అర్థంలేనితనం గూడానా?

ఏ ఏకధ్రువ ప్రపంచం మీది, ఏ ఆధిపత్యం మీది ప్రేమ, యుద్ధం పేరుతో వేలాది కుటుంబాలను విచ్ఛిన్నం చేసింది? వీరుణ్ణి ఉరికొయ్యకు వేలాడదీసింది?

ఏ సెక్స్ మీది, ఏ సంపాదన మీది ప్రేమ, నోయిడాలో తవ్వుతున్నకొద్దీ పాలుగారే పసిబుగ్గల్ని అస్థిపంజరాలుగా బయల్పడేస్తోంది?

ఏ ఆధిపత్యం మీది, ఏ ద్వేషం మీది ప్రేమ, ఖైర్లాంజీ దళితుల మానాల్లో కరువై, బీరు బాటిళ్లై దిగి మొత్తం కుటుంబాన్నే దారుణాతి దారుణంగా హతమార్చింది?

ఏ ముప్పైరూపాయల మీది ప్రేమ నిండు ప్రాణాల్ని బండరాళ్లతో మోది బలి తీసుకుంది?

ప్రేమ- హింస పర్యాయపదాలు కాదు కదా!

బహుశా జీసస్ చెప్పినట్లు 'నిన్ను వలే నీ పొరుగువారిని ప్రేమించడం' నేర్చుకుంటే ఈ లోకంలో హింసకు తావుండదేమో.

ప్రతి మనిషి చేతులనిండా ప్రేమ నింపుకుని ఈ ప్రేమరాహిత్యపు చీకటిలో తడుముకుంటున్న వారి కోసం ఒక ప్రేమ కొవ్వొత్తిని వెలిగించాలి. అది అనురాగపు కిరణాల కాంతులతో ప్రతి హృదిలో ప్రేమతో నిండిన వెలుగుపూలు పూయిస్తుంది.

అలాంటి ప్రేమ నిండిన ప్రపంచం కోసం మన చేతుల్ని సిద్ధం చేసుకుందాం!

*(ఈ శీర్షిక ఇంతటితో సమాప్తం)* ✦

---

**చతుర సమీక్ష** | **ఏప్రిల్ 'చతుర' నవల సర్కారు గడ్డి**

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు:

______________________________

చిరునామా:

______________________________

______________________________

______________________________

నాటి చతుర



ఫ్లాష్‌బ్యాక్

# సుడిగుండం

రుక్మిణి

సంపుటి: 3 సంచిక : 3 ఏప్రిల్ 1980

నాటి నవల

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం.

1980వ సంవత్సరం ఏప్రిల్ నెల **'చతుర'** లో రుక్మిణి నవల **'సుడిగుండం'** ప్రచురితమైంది. ఆ నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

మనిషి జీవితంలో వివాహం ఒక ముఖ్యమైన మలుపు. వైవాహిక జీవితం కొందరికి స్వర్గతుల్యమైతే మరికొందరికి ప్రత్యక్ష నరకమవుతుంది. సంసారం నరకతుల్యమై కట్టుకున్న భర్తే యముడికంటే క్రూరంగా ప్రవర్తించినవేళ స్త్రీ మనసు ముకుళించుకుపోవటం సహజం. ఆ తర్వాత ఆమె ధైర్యం కూడగట్టుకుని ముందుకు సాగటమో, పిరికిదైతే ఆత్మహత్యకు పాల్పడటమో, లేక నిరాశా నిస్పృహలతో అశాంతి జీవితం గడపటమో జరుగుతుంది. అలా అన్యాయానికీ, అశాంతికీ గురైన ఓ మహిళ ప్రపంచంలో ఇతరులు సుఖపడటం చూసి సహించలేని మనస్తత్వాన్నీ, కసినీ పెంచుకుంటుంది. ఆ కసికి టార్గెట్లను ఎంచుకుని వాళ్ళు తమ తమ పండంటి సంసారాలను కూల్చుకుని కుమిలిపోయే స్థాయికి దిగజార్చుతుంది. అలాంటి ఓ వనిత కథే ఈ నవలలోని ప్రధానాంశం.

**ఇక నవలలోకి వెళ్తే:**

చైతన్య ఓ డాక్టరు. అతడు ఎం.బి.బి.ఎస్. చివరి సంవత్సరంలో ఉండగా బ్రెయిన్ హెమరేజ్‌తో తండ్రి చనిపోతాడు. ఆయన మిగిల్చిన ఆస్తిపాస్తులు లేకపోవటంతో చదువు కొనసాగటం సమస్యగా మారుతుంది. ఈ స్థితిని గమనించిన దూరపు బంధువు వెంకటపతి ఇంటర్మీడియట్‌తో చదువు చాలించిన తన కూతుర్నిచ్చి పెళ్ళి జరిపిస్తాననీ, చదువు ఆగకుండా డబ్బు సర్దుతాననీ బేరం పెట్టడంతో చైతన్య అంగీకరిస్తాడు.

చైతన్య చదువు ముగిశాక పెళ్ళవుతుంది. ప్రాక్టీస్ మొదలు పెడతాడు. ఓ రోజు క్లినిక్ మూసేసి ఇంటికి బయల్దేరుతుండగా వెనక నుండి అంబాసిడర్ కారు వచ్చి అతని పక్కన ఆగుతుంది. "డాక్టర్ చైతన్య మీరేనా? " అని ప్రశ్నిస్తున్న డ్రైవర్‌వైపు ఆశ్చర్యంగా చూస్తాడతడు. "చాలా అర్జెంటు. కారె

క్కండి సార్. మా అమ్మగారికి ఒంట్లో బాగా లేదు. రండి" అనేసరికి కారెక్కుతాడు చైతన్య.

రాజభవనం లాంటి బంగళాలోకి వెళ్తుంది కారు. ఫోంబెడ్ మీద పడుకుని ఉన్న పేషంటు సంధ్యను చూసి 'ఎంత అందగత్తె' అని అనుకోకుండా ఉండలేకపోతాడు చైతన్య. డ్రగ్స్ అతిగా తీసుకుందని తెలుసుకుని ఆమెకు చికిత్స చేస్తాడు. చాలా సేపటి వరకు ఆమె పరిస్థితిని గమనించటం కోసం అక్కడే ఉండిపోతాడు. ఆ పరిచయంతో సంధ్య తరచూ చైతన్యను తన ఇంటికి పిలిపించుకుంటుంది. భోజనానికి రమ్మని ఆహ్వానిస్తుంది. ఓ సారి తానే కారులో క్లినిక్కి వచ్చి గుడికి వెళ్దాం రమ్మని మరో ఊరికి తీసుకెళ్తుంది. అక్కడ హోటల్ గదిలో ఇద్దరూ ఒకటవుతారు. ఆ తరువాత తరచూ చైతన్య సంధ్యతో ఆమె ఇంట్లో గడుపుతుంటాడు. భర్తలోని మార్పును గమనిస్తుంటుంది చైతన్య భార్య కమల.

తన గతం గురించిన కథ చెబుతానంటుంది సంధ్య. తనకు ఊహ తెలియక ముందే తల్లిదండ్రులు తనకు ఆస్తి వదిలి చనిపోయారనీ, తనను మేనమామ చేరదీశాడనీ చెబుతుంది. ఆ మేనమామ కొడుకు సుధాకర్‌తో సంధ్య పెళ్ళి జరిపించాలనుకుంటారు సంధ్య మేనమామ, అతని భార్య. సుధాకర్ అహంకారి, మూర్ఖుడు. సుధాకర్‌పై తను అసహ్యాన్ని మరింత పెంచుకుంటుంది. అయినా సుధాకర్ తల్లిదండ్రులు సంధ్యకూ సుధాకర్‌కూ పెళ్ళి చేస్తారు. సంధ్య సుధాకర్‌ను దగ్గరికి రానివ్వదు. తల్లీ కొడుకులు కుట్రపన్ని మత్తుమందు కలిపిన పాలను సంధ్యచేత తాగిస్తారు. సుధాకర్ అత్యాచారం చేస్తాడు. మర్నాడే కారు యాక్సిడెంట్లో చనిపోతాడు. సంధ్య నెలతప్పగా అబార్షను చేయించుకోవాలనుకుంటుంది. అత్తగారు బతిమాలి ఆపుతుంది. డాలీ పుడుతుంది. తన బతుకునిలా దిగజార్చి ఎందుకూ కొరగాకుండా చేసిన సుధాకర్‌పై కసితో డ్రగ్స్‌ను అలవాటు చేసుకున్నాననీ తన కథ ముగిస్తుంది సంధ్య. చైతన్యకు తను తప్పు చేస్తున్నానని తెలుసు. ఆ విషయం కమలకూ తెలుసు. ఓరోజు స్వీట్లు అందిస్తుంది. ఏమిటి విశేషం అని అడగ్గా తన తమ్ముడు మామయ్య కాబోతున్నాడని చెబుతుంది. చైతన్యకు ఫ్లాష్ వెలుగుతుంది. "మరి నాకు చెప్పలేదేం?" అని నిష్ఠురమాడతాడు- తన తమ్ముడు రామప్ప పిక్నిక్‌కు వెళ్తే చైతన్య కన్పించాడని చెబుతుంది. ఆమె కళ్ళలో చైతన్య పట్ల అసహ్యం, దారుణమైన ఏవగింపు తళుక్కుమంటాయి.

మర్నాడు సంధ్య ఇంటికి వచ్చిన చైతన్య "మా ఆవిడకు మన విషయం ఎలా చెప్పాలో అర్థం కావటం లేదు" అంటాడు.

"పిచ్చివాడా! మన మూర్ఖులు ఏర్పాటు చేసిన ఈ పిచ్చి బంధనాలు, ఆచారాలు, వ్యవహారాలు, కట్టుబాట్లు నిన్ను కుదించుకుపోయేలా చేశాయి. నీ నోరు నొక్కిందెవరు? ఔను. నాకు ఆవిడకు శారీక సంబంధం ఉంది. ఇది నా ఇష్టం' అని స్వేచ్ఛగా ఎందుకు చెప్పలేకపోతున్నావు? నీకు మాలో ఏ ఒక్కరు కావాలన్నా రెండోవారిని త్యాగం చేయాలి. ఇద్దరూ కావాలనుకుంటే నీ 'క్వాలిటీస్‌ని కొన్నింటిని తగ్గించుకోవాలి" అంటుంది. "నాకిద్దరూ కావాలం"టాడు చైతన్య.

"అలా అయితే నీలో ఆత్మాభిమానం, రోషం, కోపం, అధికారం, అహంకారం అన్నీ వదిలేయాలి" అంటుంది సంధ్య.

సంధ్య ఇంట్లో ఉండగా చైతన్యకు ప్రసిద్ధ గైనకాలజిస్ట్, లీడింగ్ డాక్టర్ గౌరినుండి ఫోనొస్తుంది. ఆమె క్లినిక్‌కు వెళ్తాడు చైతన్య. కమలను పరీక్షించిన డాక్టర్ గౌరి "ఆవిడ మానసికంగా బాగా దెబ్బతిన్నట్లుంది. తన మొగుడు పరాయి ఆడదానితో సంసారిక జీవితాన్ని పంచుకోవడాన్ని ఏ ఆడదీ ఒప్పుకోదు. మరి మగవాడి విషయానికి వస్తే...?

మీ ఆవిడే మరొకరి పక్కన చేరితే మీరు సహించగలరా? మీకో రూలూ, ఆమెకింకో రూలుండటం భావ్యమేనా? మంచి భర్తగా కమలను ఓదార్చండి. మీ భార్య బతకాలంటే అలాంటి ట్రీట్‌మెంట్ కావాలి" అంటుంది. రెండు గంటల తరువాత ఆ నిస్సత్తువలోనే కమలకు వణుకు ప్రారంభమై విపరీతమైన రక్తస్రావం వల్ల తెల్లవారుజామున చనిపోతుంది. కమల పోయినందుకు చైతన్య బాధ పడుతుంటాడు. సంధ్య చైతన్యను




ఓదారుస్తుంది. ఓ రోజు సంధ్య ఇంటికి చైతన్య వెళ్ళేసరికి గూర్ఖా అడ్డగిస్తాడు. అతణ్ణి తోసి మరి లోపలికి చొరబడతాడు చైతన్య. సంధ్య ఓ కుర్ర లాయర్‌తో మాట్లాడుతుంటుంది. అతడు వెళ్ళిపోగానే చైతన్య నిప్పులు కక్కుతున్న కళ్ళతో సంధ్యతో పోట్లాడి చెంప ఛెళ్ళు మన్పిస్తాడు. "మన మధ్య ఇంకోడు రావటం నేను సహించను" అంటాడు.

"నీ పెళ్ళాం బతికున్నప్పుడు మేం ఇద్దరం కావాలని నువ్వనలేదూ? అప్పుడు నాలో కలగని ఆవేశం, అసూయ నీకిప్పుడు హఠాత్తుగా ఎలా కలుగుతున్నాయి? అది నేనెలా సహించానో నువ్వూ ఇది సహించాలి. నా దేహం కావాలనిపిస్తే రెండు చేతులు చాచి మోకాళ్ళ మీద పాక్కుంటూ రా! అప్పుడు నీక్కావలసిన సుఖం ఇస్తాను. అదీ నాకిష్టమైతేనే!" అంటూ అతడిని వెళ్ళగొడుతుంది.

మర్నాడు గూర్ఖాతో ఓ ఉత్తరం పంపిస్తుంది. సంధ్య లోగడ తను అతనికి చెప్పిన తన కథంతా అబద్ధమనీ నిజానికి తనో పేదింటి పిల్లననీ, డబ్బు బాకీపడిన తన తండ్రి ఓ ముసలివాడితో పెళ్ళి జరిపించగా అతడు నానా హింసా పెట్టాడనీ, డాలీ తన కూతురు కాదనీ రాస్తుంది. తనను కష్టాలు పెట్టిన ముసలి మొగుడు ఓ కారు యాక్సిడెంటులో చనిపోగా, ఆ ఆస్తి తనకు లభించిందనీ, ప్రపంచంలో ఇతరుల అనురాగానందాలను చూసి తను సహించలేననీ, అందరూ తనలా నాశనం కావాలని కోరుకుంటాననీ, తనకు దక్కని దానిని మరెవరో అనుభవించకూడదని అనుకుంటాననీ రాస్తుంది. అంతే కాదు తోటి మానవుల మీద కసి తీర్చుకోవడానికి తను ఆనందంగా, అన్యోన్యంగా ఉన్న జంటలను ఎన్నుకొని వారిని తనవైపు ఆకర్షితులను చేసుకుంటుంది. వాళ్ళందరూ తమ కాపురాలను కూల్చుకుని కుమిలిపోతే ఆనందిస్తుంది. తన చర్మం అందంగా ఉన్నంత కాలం తన వేట ఇలాగే సాగుతుందనీ, ఈ సమాజం, దాని కట్టుబాట్లు, సాంఘిక, ఆర్థిక వ్యవస్థ తననట్లా తయారుచేశాయనీ, తన కసిని సమాజం మీద తీర్చుకుంటాననీ, ఇలాంటి ఉత్తరమే మరొకటి సిద్ధంగా రాసి ఉంచుకున్నాననీ, ఈ సాలెగూటిలోనికి వచ్చి చిక్కుకోబోయే మరో పురుగు కోసం దాచాననీ ఉత్తరం ముగిస్తుంది సంధ్య. దాంతో నవల సమాప్తమవుతుంది. పరిస్థితుల ప్రాబల్యం వలన దెబ్బతిన్న స్త్రీ హృదయం ఎలా మారుతుందో, ఏ ఆలోచనలు చేస్తుందో, ఎలా ప్రవర్తించి తన కసి తీర్చుకుంటుందో, అందుకు కారణాలేమిటో, సమాజమే గాక తల్లిదండ్రులూ ఇందుకు ఎంతవరకు బాధ్యులో వివరించే ఈ నవలలో స్త్రీలోని మరో కోణాన్ని సమర్థవంతంగా ఆవిష్కరించారు రచయిత్రి రుక్మిణి. ✦




## ఇది జీవితం!

(ప్రథమ బహుమతి రూ. 100 పొందిన లేఖ)

పల్లె జీవనానికి, సాదా సీదా బతుకులకూ, పల్లెప్రజల స్వచ్ఛమైన ఆత్మీయతలూ, అభిమానాలకూ అద్దంపట్టిన నవల 'చినుకుల సవ్వడి'.

సుభిక్షత కంటే దుర్భిక్షతకే తరచు గురయ్యే ప్రాంతంలోని వ్యవసాయ కుటుంబాల ఆశావహ దృక్పథంతో తమ కష్టాలను, బాధలను వెనక్కినెట్టి పరస్పర సహకారంతో, నిర్మల హృదయాలతో, మానసిక అనుబంధాలతో ముందుకు సాగడం అపూర్వం. గొడ్డుగోదా, పైరూనీరూ, నేలా నింగీలతో ముడి పడివున్న వారి జీవితాలూ అపురూపం. ఇరుగు పొరుగులతో, సాటి కుటుంబాలతో పెనవేసుకున్న ఆపేక్షలూ, కలబోసుకునే ఆప్యాయతలూ అద్భుతం.

దుష్టుడైన మేనమామ బారినుండి తప్పించి మేనమరదల్ని అర్ధాంగిని చేసుకున్నందుకు, శివుడి పెళ్ళాం గౌరి-ఎటువంటి భేషజాలకు పోకుండా మనసా, వాచా, కర్మణా అత్తింట, మెట్టిన గడ్డతో మమేకమై 'అర్ధాంగి' అన్న పేరును సార్థకం చేసుకోవడం ముదావహం.

రైతు చేనులో విత్తు నాటి పంట కోతకు వచ్చేంతవరకు పడే పాట్లు, తపన, వహించే ఓర్మి, ఆడ, మగ నిరంతరం శ్రమించే అవసరం... శ్రమఫలం చేతికందేంతవరకు పారాడే అనిశ్చితి కళ్లకు కడతాయి. శివుడు, గౌరిల ప్రణయకలాపాలు, శృంగార చేష్టలూ... వారిని ఆటపట్టించేవారి మాటల్లో మోటుదనం తొంగిచూసినా, అభిమానం తొణికిసలాడే తీరూ, పల్లె పదాలు, పాటలలోని స్వచ్ఛతా- రమణీయంగా మలచబడ్డాయి. లక్ష్మమ్మ పాత్ర ఓ తల్లిలో ఉండవలసిన మనో పరిపక్వతను చాటుతుంది. కన్నకూతురు కష్టపడకూడదని సరోజమ్మ తపించడం అసహజం కాదు.

పల్లె వాతావరణంలోని సాదాసీదా జీవితాల నిత్యపోకడలు, వారి జీవన విధానాలు, అవస్థలు, అల్పసంతోషాలు, ప్రతికూలతలలో కూడా వినోదాన్ని వెదుక్కునే తీరులూ, సున్నితమైన మానవ సంబంధాలు, సునిశిత హాస్యాలూ అత్యంత సహజంగా చిత్రీకరించబడి ఆద్యంతం ఆసక్తికరంగా సాగిన చక్కటి నవల ఇది. ప్రతి సంఘటన, సన్నివేశమూ ఎంతో సహజంగా వుండి చక్కటి శిల్పం, టిపికల్ లాంగ్వేజీ, గలగల పారే సెలయేటిలా ఆహ్లాదకరంగా సాగిన కథనం- రచనా పటిమనూ, విషయంమీద రచయితకు ఉన్న పట్టునూ సుస్పష్టం చేశాయి.

కక్షలూ- కావేశాలూ, కుళ్లు-కుత్సితాలతో నిండిన వర్తమాన వాతావరణంలో- కేవలం రెఫరెన్స్‌గా మిగిలిపోయే వీరారెడ్డి తప్పితే, దుష్టపాత్రలేవీ తగలకపోవడం పూర్తి హాయిగా ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే- ఇది కథ కాదు, జీవితం! ఇంత చక్కటి నవల ఎంపిక న్యాయనిర్ణేతల ఉత్తమాభిరుచికి తార్కాణం అంటే అతిశయోక్తి కాదు!

**-పి.వి.వి. సత్యనారాయణ, సికింద్రాబాద్.**

## 'మర్లు' గొలిపే చినుకుల చిరుసవ్వడి (ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన లేఖ)

చక్కని గ్రామీణ రైతాంగ జీవన నేపథ్యం గల నవల చదివి ఎంతో ఆహ్లాదం కలిగింది. ఆద్యంతం రమణీయంగా తీర్చిదిద్ది, బహుమతి గెల్చుకున్న 'రామిరెడ్డి'గారిని అభినందించకుండా ఉండలేకపోతున్నాను.

పచ్చని పొలాలను, పక్కనుంచి కదిలి సాగే రైతు జనాలను ఈ నవల చదివిన తర్వాత గమనిస్తుంటే ఓ కొత్త అనుభూతి కలుగుతుంది. చిన్న పల్లెలో ఓ రైతు కుటుంబంలోని ప్రధాన పాత్రలు లక్ష్మమ్మ, శివయ్య జీవితంలోకి 'గౌరి' ప్రవేశించాక వివిధ రుతువుల్లో జీవన స్రవంతి ఎలా సాగిందో చిత్రించిన తీరు మెచ్చదగినది.

స్పందన కలగజేసిన అనేక అంశాల్లో కొన్ని- ముఖ్యంగా రచయితకి గల పల్లె భాష, రైతాంగ జీవన వ్యవహారిక పదాలపై పట్టు. మామూలు పాఠకులకు ఎన్నో పదాలకు అర్థం తెలీకపోయినా తన శైలిలో ఇమిడ్చి పాఠకుణ్ణి ఆసక్తిదాయకంగా ముందుకు చదివించేలా చేయగలిగారు. సన్నివేశానుగుణంగా పాత్రలు పలికిన మాటల పాటలు (పల్లె పదాలు) కొత్త అనుభూతుల్ని కలిగించక మానవు.

నవల ముగిసినా పాఠకుల్ని ఒకటి రెండు సందేహాలు వీడవనిపిస్తుంది. తన బావతో, పొలంతో, శ్రామిక జీవనంతో మమేకమైన 'గౌరి' అంగన్‌వాడీ టీచర్‌గా ఉద్యోగం చేస్తుందా? చేయదా? ముగింపు అత్యంత అద్భుతమనిపించింది. కారణం- అప్పటివరకూ ఒక పల్లవిలా సాగిన జీవన చిత్రం- నేటి రైతాంగ వాస్తవ పరిస్థితిని గూర్చి కూడా ఉటంకించటం, 'ఒకవేళ కరువు పరిస్థితిని గౌరికి పరిచయం చేయాల్సొస్తే' అనే ఆలోచన 'శివుణ్ణి' కదిలించటం, ఆ కరువు వర్ణన కళ్లకు కట్టినట్టు 'అడుగడుగనా ఎండిపోతూ రైతు గుండెను మాడ్చే పైరునూ... బిందెడు నీళ్లకై మైళ్ళు నడిచి రావలసిన పరిస్థితిని చాలా క్లుప్తంగానైనా వాస్తవంగా చిత్రించటం బాగుంది.

మూగజీవాల ఆహారపు అలవాట్లు నిశిత పరిశీలన సైతం అబ్బుర పరిచింది. ఏ గడ్డి, ఏ ఆకు వాటికెంత అమృతపాయమో తెలిశాక, ఏ గడ్డిపరకనో, పనికిరాదనుకున్న ఏ ఆకునో చూసినా వాటి ఆకలి గుర్తుకొస్తుంది. మానవ సంబంధాల చిత్రణ అనేక రచనల్లో ఉండొచ్చు. మూగజీవాల రాగబంధాలనూ పిచ్చుక గూళ్ళలో, కోడిపిల్లల్లో, బర్రెల్లో చూసిన విధం మనసుకు హత్తుకుంది. ఇంకా ఎన్నెన్నో ఉదహరించొచ్చు.

నవల మొత్తంగా హృద్యంగా ఉంది, మళ్ళా 'మర్లు' గొలిపే చినుకుల చిరుసవ్వడి ఎప్పుడు అనుభూతి కలుగుతుందో ఎదురు చూడాలి.

—యిమ్మిడిశెట్టి చక్రపాణి, అనకాపల్లి.

## నిరుత్సాహపరచిన నవల (తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

చతుర నవలల పోటీ ప్రకటన నాటి నుండి ఫలితాల వరకు ఎంతో ఆశగా ఎదురుచూసి, వచ్చిన వెంటనే ఎంతో ఉత్సాహంతో చదివిన నవల నిరాశ ను మిగిల్చింది. గతంలో సన్నపురెడ్డి రాసిన చనుబాలు, ఊరబిండి లాంటి ఎన్నో కథలు చదివిన నాకు ఈ నవల ఆ స్థాయిలో లేకపోవడం కొంత నిరుత్సాహం కలిగించింది. కథనం, కథ కోసం ఎంచుకున్న వాతావరణం, భాష, రచనా నిర్మాణం అన్నీ చాలా

అద్భుతంగా కుదిరినప్పటికీ చదివిన తరువాత అసంతృప్తే మిగిలింది. గౌరి పాత్రకు గ్రామీణ జీవితాన్ని, ఆ జీవితాలలోని మానవ సంబంధాలను (మానవ సంబంధాలు కాదు ప్రాణ సంబంధాలు అనాలి) పరిచయం చేస్తున్న క్రమంలో తనను తాను అమె ముందు పరిచినట్లు శివుడు పాత్ర ద్వారా రచయిత చెప్పిస్తాడు. కాని జరిగే సంఘటనల పట్ల ఆలోచనాత్మకమైన స్పందనను రచయిత ఆ పాత్రకు ఆపాదించలేదు. ఎక్కువగా ఆమె ఒక ప్రేక్షకురాలుగానే ఉంటుంది తప్ప, ఎక్కడా ఆమె మానసిక స్థితి వర్ణితం కాలేదు.

గ్రామీణ జీవిత చిత్రణలో కూడా ఎంతో అసంబద్ధత, అవాస్తవికత చోటు చేసుకున్నట్లుగా అనిపిస్తుంది. సమాచార విప్లవం ద్వారా కలుషితం కాని పల్లెలు ఇంకా వున్నాయా? పల్లెల్లో వ్యాపారతత్వం చోటు చేసుకోవడం లేదా? పల్లెల్లోనే ఒక కొత్తరకం 'నియోరిచ్' వర్గం తయారుకావడం లేదా? వ్యవసాయం లాటరీ అయిన ఈ తరుణంలో దానికి సంబంధించిన ఆటుపోట్లే లేవా? వీటి ప్రస్తావనైనా ఈ నవలలో ఉందా? తదితర ప్రశ్నలకు జవాబులు కనబడవు. మనుషుల మధ్య సంబంధాలను చూసినపుడు కూడా వారిమధ్య ప్రేమాభిమానాలు మాత్ర మేనా? ఈర్ష్యాద్వేషాలు మచ్చుకు కూడా కానరావా? అత్తా కోడళ్లు ఈ నవలలోలాగా బయట ఎక్కడా కనబడరు.

నవల మొత్తంలో గ్రామీణ జీవిత చిత్రణ మాత్రమే వుంది కానీ, గ్రామీణ జీవన వాస్తవికత ఎక్కడా కనబడదు. కథ మొత్తం గౌరి పాత్ర చుట్టూ తిరుగుతుంది. ఆమె మానసిక స్థితికి తగిన ప్రాణప్రతిష్ఠ జరగలేదు. 'తన ఊరిని తను నమ్ముకొన్న మట్టిని వదిలి వెళ్లకూడదు' అనే ఒకే ఒక అంశం చుట్టు కథ నడిచిందే తప్ప, శివుడి వ్యక్తిత్వ నిర్మాణం కూడా తగినంత పటిష్టంగా అనిపించలేదు.

*–బండ్ల మాధవరావు, హైదరాబాద్*

## పల్లె మనసు *(నాలుగో బహుమతి రూ. 50/- పొందిన లేఖ)*

రైతుల జీవితంలోని ఆటుపోట్లకు అద్దం పడుతూ వారి ఎద సందడిని మన ముందుంచిన రచయితను ఏమని పొగడాలి! ఎన్నో నవలలు చదివినా ఇంతటి మానసికోల్లాసం, తృప్తి, ప్రకృతి మాత ఒడిలో సేదదీరిన అనుభూతి మరెన్నడూ కలుగలేదు. రైతన్నల శ్రమ జీవన సౌందర్యాన్ని వారి భాషలోనే అందంగా, పొందికగా మన కందించారు రచయిత. ఇలాంటి నేపథ్యంలోనూ రచనలు చేయొచ్చని చూపారు.

వానలు లేక పంటలు పండని దుస్థితి, చినుకుల సవ్వడితో పులకించే భూమాత, పరవశించే గ్రామీణులు, రకరకాల పంటలు, వంటలు, ఆకుకూరలు, కాయగూరలు, పల్లె పదాల నిఘంటువులా ఉంది నవల. పాడి పశువులు, కోళ్ళూ, జానపద గీతాలు, హాస పరిహాసాలు ఎకసెక్కాలు, సంగటి ముద్దలూ, నంజుళ్ళు అన్నింటా పల్లె జీవితం ప్రతిఫలించింది. ఉడుకుడుకు సంగటి ముద్ద, మిరప పచ్చడి నోరూరిస్తుంది.

గౌరిని అర్ధాంగిగా మలచుకొన్న శివుడే సాక్షాత్కరిస్తాడిక్కడ. భార్య సుఖం కోసం వెంపర్లాడే భర్త, పట్నవాసంలో చదువుకొన్న అమ్మాయి పల్లె వాతావరణంలో ఇమిడిపోవటానికి చేసే ప్రయత్నం- అంతా ఎంతో హృద్యంగా ఉంది. ప్రతి చిన్న విషయానికి స్పందించే మంచి మనసులు... పశు పక్ష్యాదులతో తాదాత్మ్యం చెంది వాటి కష్టాలకు కలవరపడే బేల మనసులు... అంతా

ఎంతో అద్భుతం!

వానలు కురిసి పంటలు పండే మంచి కాలంలోనే గౌరికి తమ జీవిత విధానాన్నీ, వాతావరణాన్ని అలవరచటానికి, పరిచయం చేయటానికి నానా అగచాట్లూ పడ్డారం దరూ. కరువు కాటకాల కాలాన్ని ఆమెకెలా పరిచయం చేయాలోనన్న శివుని అంతర్మథ నంతో నవల ముగిసింది. ఈ నవలకు ప్రథమ బహుమతి ఇచ్చిన చతురకూ, రూప శిల్పి వెంకటరామిరెడ్డి గారికి, న్యాయ నిర్ణేత లకు అభినందనలు.

**గోరంట్ల వాణీదేవి,** పేరాల.

## పరిమళించిన జీవన మాధుర్యం (ఐదో బహుమతి రూ. 50/- పొందిన లేఖ)

చినుకు తడితో పులకించిన కరవు సీమలో పరిమళించిన జీవన మాధుర్యం 'చినుకుల సవ్వడి' అంటూ ఒక అద్భుత జీవిత చిత్రాన్ని సజీవంగా ఆవిష్కరింప జేసిందీ నవల. భార్యకు పచ్చదనాన్నీ, పల్లె దనాన్నీ పరిచయం చేసేందుకు శివుని ప్రయత్నాలు; చాలా సహజమైన అనుభ వాల ద్వారానూ, శ్రమ జీవనం ద్వారానూ ఎన్నో సత్యాలను అర్థం చేసుకోగలిగిన గౌరి; ముఖ్యంగా మరొక జీవి ఆకలి గురించిన స్పృహనే ఒక సాంప్రదాయిక అలవాటుగా చేసుకోగలగడం; వ్యవసాయ కుటుంబాల్లోని మానవ సంబంధాలూ, మానసిక అనుబం ధాలూ తెలిసి రావడం- ఇలా అనేక అను భూతుల అల్లికతో ఒక గొప్ప అందెల రవ ళిని మనకందించిన రచయితను ఎంతైనా అభినందించాల్సి ఉంది. కల్పనలూ, ఊహ లూ, అసహజాలూ, అవాస్తవాలూ ఏమీ లేకుండా అత్యంత సహజమైన సుందర దృశ్యాలతో, రుతువులతో, కార్తెలతో, ప్రకృతి పోకడలతో, చక్కని శృంగార భావాలతో నిం డిన ఈ నవలలో నిజమైన నవలా సౌంద ర్యాన్ని చూడగలుగుతాం. కరువు కాలం దారుణాల మాట ఎలా ఉన్నా ఒక మంచి కాలాన్ని మాత్రం ఎంతో సౌందర్యవంతంగా ఈ నవల చూపగలిగింది. మంచి భాష, సన్నివేశాలు, సౌజన్యం, సహ జీవన సౌందర్యం, ముఖ్యంగా రైతు కుటుంబాల కష్టసుఖాలు, అలవాట్లు, ఆచారాలు, అనుబం ధాలూ- ఇవన్నీ కలిసికట్టుగా ఈ నవలను ఉత్తమంగా చేశాయి.

సమాజంలో ఇప్పుడు అనేక చోట్ల, అతకని బతుకులతో నిత్యం సతమతమవుతూ సహ జీవనమే కరువైపోవడాన్ని చూస్తూనే ఉన్నాం. ఎందరి దుర్మార్గాలతో మరెందరో బలయిపోతున్న సంఘటనలనూ చూస్తు న్నాం. స్త్రీ, పురుష జీవితాలలోని ప్రేమ భావాల మాధుర్యం, మానవీయ భావాలూ హృదయ స్పందనలనూ రచయిత చాలా గొప్పగా అనుభవింపచేశారు. చాలా కాలం తర్వాత ఒక నిజమైన గొప్ప నవలను చది విన అనుభూతి కలిగింది.

**-వి. వీరభద్రరావు,** హైదరాబాద్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai 24982818; Chennai: 28232390; Bangalore: 25583804; & www.eenadu.net.






Cream of Creams






రాయలసీమ

**THRUPTHI ASSOCIATES**

Plot No.F-9, Industrial Estate, Proddatur-516 362.
Kadapa Dt., A.P. Tel. 08564-250636 Fax : 08564-258465

కోస్తా ఆంధ్రా

**THRUPTHI FOODS**

Depo II - D.No. 1-3/18-35, Vidyadharapuram,
Vijayawada. Tel. 0866-6530156, Cell. 9849991235

తెలంగాణా

**THRUPTHI MARKETING**

Depot : D.No. 138, Sri Krupa Market, Malakpet,
Hyderabad-36. Tel. 040 - 65181115 Cell.9849991257

JOY

ఆంధ్రప్రదేశ్ అంతటా ఐస్‌క్రీమ్ సరఫరా చేయువారు

# THRUPTHI FROZEN FOODS

**WANTED DISTRIBUTOTRS**

(డిస్ట్రిబ్యూటర్స్ లేని ప్రాంతాలలో)

